నిత్యం భృత్య సు పుత్ర పౌత్రి సహితో భార్యా ద్వయాలంకృతః
దీర్ఘాయు ర్భవ లబ్ధ వర్ణ నిచయా ద్రామేశ పూజ్యో భవ॥ 6

అ ర్థ ము :

రామేశ—ఓ రామేశ ప్రభూ । సర్వ—సమస్త మైన । ఉర్వీపతి—రాజుల । వర్గ—సమూహమునకు । దుర్గమ—పొంద శక్యము గాని । మహా—గొప్పదైన । సామ్రాజ్య లక్ష్మీ—రాజ్య సంపత్తి చేత । యుతః—కూడుకొనినవాడవై । సకలాన్—సమస్త మైన । నిజాశ్రిత జనాన్—తన నాశ్రయించిన వారలను । కారుణ్య వీక్షాంకురైః—దయా పూర్ణములగు చూపుల ప్రసారముల చేత । సంరక్షణ—రక్షించుచున్న వాడవై । నిత్యం—ఎల్లపుడు । భృత్య—సేవకులచేత । సుపుత్ర—మంచి కొడుకులచేత । పౌత్ర - మనుమలచేత। సహితః - కూడుకొనినవాడవై । భార్యా ద్వయాలంకృతః — ఇద్దరు భార్యలచేత అలంకరించబడిన వాడవై । దీర్ఘాయుః—గొప్ప ఆయుస్సు కలవాడవై । భవ—శివుని వలన । లబ్ధ—సంపాదించుకొనిన । వర్ణనిచయాత్—అక్షర సముదాయమువలన । పూజ్యః—పూజార్హుడవు । భవ—అగుదువు గాక ।

తా త్ప ర్య ము :

గొప్ప రాజ్యాధికారము గలిగి, చక్కగా ప్రజా పాలనము సేయుచు సేవకులు పుత్ర పౌత్రకళత్రాదులు కొలువగా చిరంజీవియై శివుని దయవల్ల కలిగిన విజ్ఞానముతో సభా పూజ్యతను సంపాదించుకొని రామేశ ప్రభువు వర్ధిల్లు గాక ।

పయః పాయం పాయం దుత్రిత మపసరన్ దూర మురుభిః
సుధార్ద్రై శ్చాటూక్తై ర్నికట ముపయ[1] న్వక్షసి లుఠన్।
సహాసం సంజల్పన్ మధుర మధురాః కాశ్చన గిరః
చలన్ ఖేలన్ బాల స్త్వమివ పితరం త్వాం మదయతు॥ 7

అ ర్థ ము :

పయః—పాలను । పాయం పాయం—త్రాగి త్రాగి । ద్రుతం—త్వరగా దూరం—దూరము । అపసరన్—వెళ్లుచున్న వాడై । ఉరుభిః—గొప్పవైన । సుధార్ద్రైః—అమృత మద్దిన । చాటూక్తైః —ప్రియోక్తుల చేత । నికటం—సమీపమును । ఉపయన్—చేరుచున్న వాడై । వక్షసి—ఎదపై । లుఠన్—పొర్లుచున్నవాడై । సహాసం—చిరునవ్వుతో గూడి।మధుర మధురాః—అత్యంత మధురములగు । కాశ్చన—కొన్ని । గిరః — మాటలను । సంజల్పన్ — పలుకుచున్నవాడై

1. ముపనయ—ప్రాతప్రతి

చలన్—తిరుగుచున్నవారై । ఖేలన్—ఆడుచున్న వారై । బాలః—(నీ) పిల్లవాడు । పితరం—(నీ) తండ్రిని । త్వమివ—నీవువలె । త్వాం—నిన్ను । మదయతు—సంతోషపెట్టును గాక ।

తా త్ప ర్య ము :

రామేశ ప్రభువు తన తండ్రిని అలరించినట్లుగానే ఈ రామేశ ప్రభువు కుమారుడుకూడ పాలు త్రాగుచు, పరుగులిడుచు, పైన బడుచు, నవ్వుచు, నడచుచు, ఆడుచు, అల్లిబిల్లి మాటలతో తన తండ్రి యగు రామేశ ప్రభువు నలరించుగాక ।

త్వదీ యేయం జాయా[1] ప్రథమ గలితం వాఙ్మధురసం
పిబంతీ కౌసల్యా నిజతను భువశ్శైశవ జుషః ।
సకంపా స్విన్నాంగీ పులకిత తను ర్విస్మిత ముఖీ
పరా నందాంభోధౌ విగల దవధౌ మజ్జతు[2] భృశమ్॥ 8

అ ర్థ ము :

ఇయం—ఈ । త్వదీయా—నీ । జాయా—భార్య యగు । కౌసల్యా—కౌసల్యాదేవి శైశవ జుషః—బాల్యము గల । నిజ తను భువః—తన కొడుకుయొక్క । ప్రథమ గలితం—మొదట జారిన।వాఙ్మధు రసం—వాక్కు అనెడు తేనియను।పిబంతీ—ఆస్వాదించు చున్నది యై। సకంపా-కంపము గలదియై।స్విన్నాంగీ-చెమర్చిన శరీరము గలదియై।పులకిత తనుః—పులకించిన దేహము గలదియై। విస్మిత ముఖీ—నగు మోము గలదియై। విగలదవధౌ- అంతము లేని। పరానందాంభోధౌ-గొప్ప సంతోష సముద్రమునందు । మజ్జతు—మునుగు గాక ।

తా త్ప ర్య ము :

రామేశ ప్రభువుయొక్క పట్టపు రాణియగు కౌసల్యా దేవి తన కొడుకుయొక్క అల్లిబిల్లి మాటల కమితానందము నొందు గాక ।

నృత్య ద్వేధో వధూటీ పద కమల లస న్మంజు మంజీర శింజా
కల్పానా మచ్ఛ కల్పద్రుమ మధుర ధురీ మాధురీ సోదరీణామ్।
సద్య స్సంఫుల్ల మల్లీ పరిమల లహరీ గర్వ సర్వంకషాణాం
భాషాణాం విద్వ దిష్టా భవతు[3] మమ సుధాధారిణీ ధోరణీయమ్॥ 9

అ ర్థ ము :

నృత్యత్—నర్తించు । వేధోవధూటీ—సరస్వతీదేవి యొక్క । పద కమల—కమలముల వంటి పాదముల యందలి । లసత్-ప్రకాశించు । మంజు—అందమైన । మంజీర-అందెలయొక్క

1. యే జాయే—వ్రాతప్రతి 2. మజ్జతిత్వం—వ్రాతప్రతి
3. పిబతు—వ్రాతప్రతి.

శింజా—చిరుగజ్జియలతో । కల్పానాం—సదృశములగు । అచ్ఛ—స్వచ్ఛమైన । కల్పద్రుమ—కల్ప వృక్షమునకు సంబంధించిన । మధుర ఝరీ—తీయని ప్రవాహము యొక్క । మాధురీ—మాధుర్యమునకు । సోదరీణాం—అసమానములైనట్టి । సద్యః—అపుడే । సంపుల్ల—వికసించునట్టి । మల్లీ—మల్లెపూవుల । పరిమల—సుగంధము యొక్క । లహరీ—ప్రవాహము యొక్క । గర్వ—అహంకారమును । సర్వంకషాణాం—మొత్తముగ నశింపచేయునట్టి । మమ—నాయొక్క । భాషాణాం—వాక్కుల యొక్క । సుధా ధారిణీ—అమృతమును వహించు । ఇయం—ఈ । ధోరణీ—శైలి । విద్వదిష్టా—విద్వాంసుల కిష్టమైనదియై । భవతు[1]—అగుగాక ।

తాత్పర్యము :

సరస్వతీదేవి కాలి యందెల చిరుగజ్జియల ధ్వని వలె వీనులకు విందొనరించునట్టివియు, కల్పవృక్షప్రసూత మగు రసప్రవాహము వలె తీయనైనట్టివియును, వికసించిన మల్లెపూవుల గుబాళింపుల సంతరించుకొనినట్టివియును నగు తన వాక్కుల శైలి అమృత స్యందినియై విద్వాంసుల కిష్టమగుగాక యని గ్రంథకర్త ఆశించుచున్నాడు ।

వ. అథేదానీం రుచక వాచిక భూషణార్థ వివేకి ప్రముఖ సప్త మహా కవీనాం కవితాసు భూషణాంచితాయా ఏవ కవితాయాః ప్రాశస్త్యం మన్వానేన సర్వజ్ఞేన కాళిదాసేన చంద్రాలోకాఖ్యం లక్ష్య లక్షణోపేతం ఏకసర్గ కావ్యం అరచి।

తద్వన్మయాపి తత్పాదచ్ఛాయా మనుసృత్య, సురభూరుహస్యేవ సుకృతాల వాలస్య, అపిచ చంద్రస్యేవ భాసమాన హితస్య, తపనబింబస్యేవ, సద్యోగ సహితస్య, వినతా సుతస్యేవ సబలాత్త పక్షస్య, దనుజాంతకస్యేవ కమలాంచితాక్షస్య, నవ వసంతస్యేవ సౌరభోదారస్య, కవి కౌశలస్యేవ బహు రసాధారస్య, సురనికాయస్యేవ కల్యాణ కాంతస్య, పురమర్దనస్యేవ భుజ ధృతానలస్య, దివిజేశ్వరస్యేవ గురువాక్య పాలస్య, దశకంధరస్యేవ పుణ్యజనఖేలస్య, ఐరావతస్యేవ బహుదాన శీలస్య. యదునందనస్యేవ భృత భూరిగోపస్య, అతిధీర సుమనస్య, అతిమాత్ర వరివస్య, అతివేల కవిశస్య, చతురోక్తి సుయశస్య, కృతి మంత్రి సురహస్య, కలనార్హ్హ సవయస్య, కులపూర్ణ సదనస్య, లలనాలి మేయస్య, అనిపిండి కులజస్య, కలశాబ్ధిసారస్య, రామామనోహరస్య, రామేశ్వరాఖ్యస్య, సకల జనతా హార్ద సంహూతి వరివస్య, పరిపాలితామ్మన్న కామాంతరాలస్య,

1. పిబతు-మూలపాఠము

ధర్మైకమూల మహితం సుకృతాలవాలం ।
శక్తి త్రయాఖ్య విటపై రుపశోభమానం ।
సద్య స్సుఫుల్ల సుయశ స్సుమనోఽభిరామం ।
కావ్యం విరచ్యత ఇదం కవితామృతాఖ్యమ్ ॥ 10

**తాత్పర్యము**

రుచకాదులుగా విభజింపబడిన కవుల కవితలలో అలంకార మహితమగు కవితయే ప్రశస్తమని భావించిన సర్వజ్ఞుడగు కాళిదాసు లక్ష్యలక్షణములతో నొప్పు చంద్రాలోకమను పేరుగల ఏకసర్గాత్మక కృతి నొకదానిని రచించి యున్నాడు. అట్లే నేనుకూడ అతని అడుగుజాడల ననుసరించి ధర్మమే మూలముగా గల్గియున్నట్టి పుణ్యమున కాలవాలమగునట్టి ప్రభుమంత్రోత్సాహ శక్తులనెడు కొమ్మలతో భాసించునట్టి అమ్మన్నయొక్క కీర్తి స్వరూప పుష్పములతో అందమైనట్టి కవితామృతమను కావ్యమును రచింతును.

“కావ్యమీమాంస”లో రాజశేఖరుడు కవులను వర్గీకరించినాడు వారిని ఈ గ్రంథకర్త రుచకాదులుగా పేర్కొనుచున్నట్లు కనపడును.

చంద్రాలోకము జయదేవుని కావ్యలక్షణ గ్రంథము. అందులోని అలంకార ప్రకరణము మాత్రము విడిగా ముద్రించబడినది. దీనిపైన అప్పయ్య దీక్షితులు కువలయానందమను బృహద్వ్యాఖ్య రచించియున్నారు. ఐతే అలంకార ప్రకరణమునకు మాత్రమే దీక్షితుల వ్యాఖ్యానము ఉపలబ్ధమగుచున్నది. ఈ వ్యాఖ్యాన మీ ప్రకరణమునకు పృథగ్గ్రంథ ప్రతిపత్తిని కట్టిపెట్టినది. తెలుగులో దీనిని అనువదించిన అడిదము సూరకవి దీనిని కాళిదాసుడు రచించినట్టుగానే పేర్కొని యున్నాడు. అందుచే ఈ గ్రంథకర్త అట్లే భావించినట్లున్నది.

ఇచ్చట “తద్వదహమపి” అనుటకు బదులుగా “తద్వ న్మమాపి” అని సవరించుకొనిన శ్లోకములోని “విరచ్యతే” అను క్రియలో అన్వయము కుదురును. శ్లోకము మొదటి పాదము “ధర్మైకమూలమహితం సుకృతాలవాలం”అని చదువుకొనిన ఛందోభంగము వారించబడును.

మిగత గద్యము నందు షష్ఠ్యంతములు ప్రభువుకు విశేషణములుగా నున్నవి. వానిలో కల్పవృక్ష చంద్రాదుల వంటివాడని కొన్ని శ్లిష్ట విశేషణములు. ఆలవాలమనగా పాదు. చక్కగా కట్టిన పాదుకలది కల్ప వృక్షమైతే. ప్రభువు సుకృతమునకు....పుణ్యమునకు.... ఆలవాల మనగా స్థానమని యర్థము. చంద్రుడు ప్రకాశించు చుక్కలు కలవాడు. ప్రభువు ప్రకాశించు బంధుమిత్రులుకలవాడు. సూర్య బింబమునకు సద్యోగ మనగా నక్షత్ర సంక్రమణ రూప సంబంధము. ప్రభువుకు సద్యోగమనగా సజ్జన సహవాసము. ఇట్లు సద్యోగ సహితుడై నందున ప్రభువు సూర్యునివంటివాడనుట. గరుత్మంతుడు సబల–బలముగల । ఆత్త–స్వీకరించిన । పక్ష– రెక్కలు గలవాడు । ప్రభువు కూడ సబల—బలవంతులచేత । ఆత్త పక్షుడు స్వీకరించబడిన తన అభిప్రాయములుగలవాడు । విష్ణువు వలె ప్రభువు కూడ కమలముల వంటి ప్రశస్తమగు కనులు కలవాడు । నవ వసంతుని వలె ప్రభువుకూడ పరిమళముల

ప్రసాదించువాడు। బహువిధ రసములకు కవికౌశల మాధారమైన బహురసా — అధిక భూప్రదేశమునకు ప్రభువు ఆధారభూతుడు। దేవ గణమునకు వలె రాజునకును మంచి కాంతులు గలవనుట। త్రిపుర దాహ సమయములో శివుడు తనచేత అనలము ధరించి కదా పుర దహనము సేయును। అట్లే ప్రభువు కూడ చేత అనలము ధరించినాడనుట (ఇది సరిగా అవగాహనమగుట లేదు. అంతేకాదు. ఈ వాక్యములో భుజధృతా తరువాత ఒక లఘ్వక్షరము లోపించినట్లును గమనించవచ్చును. ఉపలబ్ధ వాక్యమునకు పైవిధముగా తాత్పర్యము వ్రాయబడినది. ఇంద్రుడు, గురు=బృహస్పతి-వాక్యమును మన్నించును. ప్రభువు తన గురువుల మాట మన్నించును। కనుక ప్రభువు ఇంద్రునివంటివాడు। పుణ్యజను లనగా రాక్షసులు పుణ్యాత్ములు అని కూడ అర్థము. రావణుడు రాక్షస క్రీడలు కలవాడు. ప్రభువు పుణ్యాత్ములతో నాడువాడు. కనుక రాజు రావణ తుల్యుడనును। దానమనగా ఏనుగు మదము ఈవి కూడ। అందుచే రాజు ఐరావతమువలె దానశీలుడని భావము. గోపులనగా పశువుల పాలించు గొల్లలని, వాక్కులపాలించు విద్వాంసులనియు అర్థము. కృష్ణునివలె రాజుకూడ అనేక గోపుల పోషించువాడు। గొప్ప మనస్సు, సేవయు గల అనేక కవీశులు గలవాడు ప్రభువు — ఇక్కడ విసంధి కనపడును. మూలమున కవిశస్య అని ఉన్నది. దానిని కవీశస్య అని భావించి పై తాత్పర్యము వ్రాయనైనది। చతుర సంభాషణ ప్రఖ్యాతులును, సమర్థులగు మంత్రుల రహస్యముల దాచగలవారును, అగు మిత్రులతో నిండియున్న భవనము గలవాడు ప్రభువు। శ్రీ సఖురాంద్రకు దొరకునట్టివాడు, అనిపించి వంశీయుడు, సముద్ర సార స్వరూపుడు, శ్రీ మనోహరుడు, రామేశ్వరనాముడు అందరి హార్దికాహ్వాన సేవలచేత సార్థకము చేయబడిన అమ్మన్నయను పేరులోని అంతరార్థము గలవాడు — ఇచట కామాంతరాలస్య, అను దానిలోని కా అనుదానిని నా అని సవరించుకొని తాత్పర్యము వ్రాయుటయైనది. రామేశ ప్రభువుకు అమ్మన్న యనికూడ పేరు.

యం సుషువే కామాక్షీ
విశ్వేశా త్తులిత రామ వామాక్షీ!
సోఽయం జయతి కుమారః
విబుధ సమాజేషు కథిత నిజసారః॥ 10

అర్థము :

తులిత — తూచబడిన। రామ వామాక్షీ — రాముని స్త్రీ యగు సీతాదేవి గల। కామాక్షీ — కామాక్షి యను పేరుగలరాణి — పార్వతీదేవి। విశ్వేశాత్ — విశ్వేశ ప్రభువు వలన — శంకరుని వలన —। యం — ఎవనిని। సుషువే — కనెనో। విబుధ — విద్వాంసుల — దేవతల —। సమాజేషు — గోష్ఠుల యందు। కథితనిజసారః — ప్రకటించిన

తన బలము గల । సో౽యం — అట్టి ఈ । కుమారః — బాలుడు — కుమారస్వామి— । జయతి — సర్వోత్కృష్టుడుగా నున్నాడు ।

తాత్పర్యము :

పార్వతీ వరమ శివులకు దేవతా శ్రేష్ఠుడగు కుమారస్వామి యావిర్భవించినట్లు కామాక్షీ విశ్వేశ దంపతుల కావిర్భవించిన బుధ శ్రేష్ఠుడగు నీ కుమారుడు అందరినిమించి మెలగుచున్నాడు.

జయంతి మహిత కీర్తి ర్మన్మథాకార మూర్తిః
పరమ పుమవతారః పాలితానేక వీరః।
వర సుగుణ నికాయో నిత్య లక్ష్మీ సహాయః
సరస కుముద చంద్రో రామ భూమీ సురేంద్రః॥ ౧౧

అర్థము :

మహిత కీర్తిః — ప్రశస్తమైన కీర్తిగలవాడు । మన్మథాకార మూర్తిః — మన్మథుని యాకారము వంటి శరీరము కలవాడు । పరమ పుమవతారః — పరమ పురుషుడగు విష్ణువు యొక్క అవతార స్వరూపుడు । పాలితానేక వీరః — అనేక వీరుల పరిపాలించువాడు । వరసుగుణ నికాయః । శ్రేష్ఠములగు మంచి గుణముల సముదాయ స్వరూపుడు । నిత్య లక్ష్మీ సహాయః — నిత్య సంపత్తి కలవాడు । సరస కుముద చంద్రః — రసజ్ఞులనెడు కలవలకు చంద్రుడు అగు । రామభూమీ సురేంద్రః — రామేశ్వర ప్రభువు । జయతి — అందరిని మించి యున్నాడు.

తాత్పర్యము సుస్పష్టము :

నన్వయం పరమ పుమవతారశ్చేత్ వ్యాసాదయః భావి కథా
ప్రసంగేషు పురాణేషు కిమిత్యేనం న వర్ణయాంచక్రురితి చే దత్ర
బ్రూమః! 12

అర్థము :

నను — ఓయీ । అయం — ఈ ప్రభువు । పరమ పుమవతారః — పరమపురుషుని యవతారము । చేత్ — ఐతే । వ్యాసాదయః — వ్యాసుడు మొదలగువారు । భావి కథాప్రసంగేషు — భవిష్యత్ కథా ప్రసంగము గల । పురాణేషు — పురాణముల యందు । కమితి —

ఏమని । ఏనం — ఈ ప్రభువును । న వర్ణయాంచక్రుః — వర్ణించలేదు । ఇతిచేత్ — అని యన్నచో । అత్ర — ఈ విషయములో । బ్రూమః — చెప్పుదుము ।

తాత్పర్యము సుస్పష్టమే ।

వాల్మీకి: ప్రణయీ ద్విజిహ్వభవనే వ్యాసోఽపి దాశాత్మజా
సూనుః పద్మ భవో జడ శ్రుతి గణై ర్వాచస్పతిశ్చ గ్రహః!
కావ్య స్తాదృశ ఏవ పన్నగపతిః ఖ్యాతో ద్విజిహ్వ స్తతః
కోవా మ్మన్న మహీమహేంద్ర సుగుణస్తోతా న తం వేద్మ్యహమ్॥ 13

అ ర్థ ము :

వాల్మీకిః — వాల్మీకి । ద్విజిహ్వ భవనే — పాములుండు పుట్టయందు । ప్రణయీ — ప్రేమ గలవాడు । వ్యాసః అపి— వ్యాసుడేమో । దాశాత్మజా సూనుః — దాశరాజు కూతురు కొడుకు । పద్మభవః — బ్రహ్మదేవుడు । శ్రుతి గణైః — వేద సమూహములచేత । జడః — జాడ్యము కలిగినవాడు । వాచస్పతిః చ — బృహస్పతియేమో । గ్రహః—గ్రహము । కావ్యః— శుక్రుడు కూడ । తాదృశ ఏవ — అట్టి గ్రహ స్వరూపుడే । పన్నగ పతిః — ఆదిశేషుడు । ఖ్యాతః — ప్రసిద్ధమగు । ద్విజిహ్వః — పాము । తతః — అందువలన । అమ్మన్న మహీ మహేంద్ర సుగుణస్తోతా — అమ్మన్న రాజావారి గుణముల స్తోత్రము చేయువారు । కోవా ?— ఎవరో । తం — అతనిని । అహం — నేను । నవేద్మి — తెలిసికొనలేను ।

తా త్ప ర్య ము :

వాల్మీకి వ్యాసాదులు ఆయా దోషములు కలవారలు కనుక అమ్మన్న రాజా వారిని వర్ణించ జాలరు. అందుచే వారు రచించిన గ్రంథాలలో ఈ మహారాజు ప్రసక్తి లేదు. అంతే కాని ఈ ప్రభువు పరమ పురుషావతారము కానందున కాదు.

అథాఽర్థాలంకారాః నిరూప్యంతే.

ఇక అర్థాలంకారములు నిరూపించబడుచున్నవి.

ఉపమాలంకారము:—

యది వాచ్యం సాధర్మ్యం
సమ్మత మన్యేన లోకసిద్ధేన।
ప్రకృతస్య చైకవాక్యే
స్యా దుపమా పూర్ణ లుప్త భేదవతీ ॥ 14

తాత్పర్యము :

లోక సిద్ధమై తనకంటే భిన్నమైన వస్తువు చేత ఒకే వాక్యము నందు తనకు కవి సమ్మతమగు సామ్యము వాచ్యమైనచో దానిని ఉపమ అందురు. అది పూర్ణోపమ, లుప్తోపమ యని రెండు రకములుగా నుండును.

ఉపమా నాదు వర్ణనీయస్య వదనాదేః లోక సిద్ధేనాన్యేన చంద్రాదినా సమ్మతత్వ వాచ్యత్వ విశిష్టం సాధర్మ్యమ్।

ఉపమ యనగా వర్ణించదగిన ముఖము మొదలగు ఉపమేయమునకు లోక సిద్ధమును, తనకంటె భిన్నమును అగు చంద్రుడు మొదలగు వస్తువు చేత కవి సమ్మత మగునట్లు శబ్ద వాచ్యమగునట్లు చెప్పబడు సాధర్మ్యమే।

అన్యేన ఇత్యనేన అనన్వయ వ్యావృత్తిః। తత్ర ఏకస్యైవ ఉపమానోపమేయతా స్పదత్వాత్। వాచ్యమిత్యనేన రూపకాదీనాం వ్యావృత్తిః, తే ష్వౌపమ్యస్య గమ్యత్వాత్। సమ్మత మిత్యనేన కుముద మివ ముఖం కరణమివ కార్యం ఇత్యేవ మాదీనాం వ్యావృత్తిః తేషా ముపమానత్వేన కవి కులా నభిమతత్వాత్। ఏకవాక్యే ఇత్యనేన ఉపమేయోపమాయా వ్యావృత్తిః। తస్యా వాక్యద్వయ గోచరత్వాత్।

ఉపమా లక్షణములో ఉపమానము ఉపమేయముకంటె భిన్నముగా నుండవలెనని 'తనకంటె భిన్నమైన' అనువిశేషణము ప్రయోగించబడినది. ఈ విశేషణములేనిచో ఉపమకు అనన్వయమునకంటే వైలక్షణ్యము సిద్ధించదు. అనన్వయములో ఉపమేయము ఉపమానము కంటె భిన్నమై యుండదు. అందులో ఒకే వస్తువును ఉపమానముగా ఉపమేయముగా వర్ణించుదురు. ఈ లక్షణములో "వాచ్య" మని మరియొక విశేషణము వేయబడినది. వాచ్య మనగా శబ్దముచేత సామ్యము చెప్పబడవలయునని తాత్పర్యము. రూపకము మొదలగు నలంకారముల లోను సామ్యము ఉండును. కాని వానిలో నా సామ్యము తోచునేకాని శబ్దముచేత చెప్పబడదు. ఇపుడు ఉపమా లక్షణములో వాచ్యమను విశేషణము వేసినందుననే ఉపమకు రూపకాదుల కంటె వైలక్షణ్యము సిద్ధించును. ఇట్లే ఈ యుపమా లక్షణములో "సమ్మత"మను వేరొక విశేషణముకూడ ఉన్నది. ఉపమానము కవి సమ్మతముగా నుండవలెనని దీని తాత్పర్యము. ఈ విశేషణము లేనిచో "మోము కలువవలె నున్నది" అను స్థలమును గూడ ఉపమాలంకార మున్నదని అంగీకరించవలసి యుండును. కలువను మోమునకు ఉపమానముగా జెప్పుట కవి సమ్మతము కాదు. కనుక వస్తుతః ఇది ఉపమాలంకారము కాదని తెలుపుటకే లక్షణములో "సమ్మత" మను విశేషణము వేయవలసి వచ్చినది.

ఇక్కడి సమ్మత మను పదమునకు ధర్మమును బట్టియు సమ్మత మను నర్థము చెప్పుకొన వలెను. లేనిచో "కరణము వలె కార్యము గూడ నొక పదార్థమే" యను చోటడగూ

కార్యమునకు కరణముతో సామ్యముచెప్పబడినది. కనుక ఉపమాలంకార మంగీకరించవలసి వచ్చును. ఇచ్చట కరణమునందున్నట్లే పదార్థత్వమను ధర్మము కార్యమునందు కూడ నున్నది. ఈ ధర్మమును పురస్కరించుకొనియే కార్యము కరణమువలె నొక పదార్థ మని చెప్పుట యైనది. కాని ఇట్టి ధర్మములను బట్టి చెప్పు సామ్యము సమ్మతము కాదు. అందుచే "కార్యము కరణమువలె నొక పదార్థము", "రాముడు కృష్ణునివలె నొక మనిషి" మొదలగునవి ఉపమాలంకారమునకు ఉదాహరణములు కావు. ఇట్లు వీని కంటె వైలక్షణ్యము సిద్ధించుటకే ఉపమా లక్షణములోని సమ్మత మను పదమునకు ధర్మమును బట్టియు 'సమ్మతమగునట్టి' యను నర్థమును చెప్పుకొన వలయును. ఇట్టి ధర్మమును బట్టి సామ్యము చెప్పుట కవి సమ్మతము కాదని గ్రహించవలయును.

ఇట్లే ఒకే వాక్యమునందు సామ్యము చెప్పబడినపుడే అది ఉపమాలంకార మగును. "ధర్మ మర్థమువలె నున్నది", "అర్థము ధర్మమువలె నున్నది" యను నట్లు రెండు వాక్యముల లోను సామ్యము చెప్పబడినచో దానిని ఉపమేయోపమాలంకార మందురు. ఈ ఉపమేయోప మాలంకారముకంటె ఉపమాలంకారమునకు భేదమును సూచించుటకే ఉపమాలక్షణములో "ఒకే వాక్యమునందు" అను పదము ప్రయోగించబడినది.

## ఉపమా విభాగము

> ఇయం చ ఉపమానోపమేయోపమావాచక సాధారణ ధర్మాణాం చతుర్ణామప్యుపాదానే పూర్ణా । ఏతేష్వన్యతరస్య ద్వయో స్త్రయాణాం వా లోపే లుప్తా। పూర్ణాపి శ్రౌత్యార్థీ చేతి ద్వి ప్రకారా। సాదృశ్యవాచకానాం యథేవాదీనాం ప్రయోగే శ్రౌతీ। వ్యవధా నేన తదర్థప్రతిపాదకానాం తుల్య సదృశ సంకాశనీకాశాదీనాం ప్రయోగే ఆర్థీ। ఏతయోర్ద్వయోరపి ప్రత్యేకం వాక్య, సమాస, తద్ధిత, గతత్వేన త్రైవిధ్యే షట్ ప్రకారా పూర్ణోపమా।

ఈ ఉపమ ఉపమానము, ఉపమేయము, సాదృశ్య వాచకము, సాధారణ ధర్మము అను నీ నాలుగును చెప్పబడినపుడు పూర్ణోపమాలంకార మనబడును. వీనిలో నొకటి గాని రెండు గాని మూడు గాని చెప్పబడనపుడు లుప్తోపమ యనబడును. పూర్ణోపమ యనునదియు శ్రౌతి యని ఆర్థి యని రెండు విధములు గలదిగా నుండును. సాదృశ్యమును చెప్పు 'వలె' మొదలగు శబ్దము లున్నచో సాదృశ్యము సాక్షాత్తుగా శ్రుతమైనది కనుక శ్రౌతి పూర్ణోపమ యనబడును. తుల్య సదృశాది శబ్దములు సాదృశ్యము కలిగిన వస్తువులను చెప్పునే కాని సాక్షాత్తుగా సాదృశ్యమును చెప్పవు కనుక ఇట్లు పరంపరగా సాదృశ్యమును చెప్పు తుల్య సదృశాది శబ్దములున్న స్థలములోని యుపమ ఆర్థి యనబడును.

ఈ రెండు పూర్ణోపమలను వాక్య సమాస తద్ధితగతలని మరి మూడు విధములుగా విభజించ వచ్చును గనుక పూర్ణోపమ మొత్త మారు భేదముల గలదిగా పేర్కొన వచ్చును. ఆరు విధములగు పూర్ణోపమ నిట్లు పేర్కొవచ్చును :- 1 వాక్యగత శ్రౌతీ పూర్ణోపమాలంకారము. 2 సమాసగత శ్రౌతీ పూర్ణోపమాలంకారము. 3 తద్ధితగత శ్రౌతీ పూర్ణోపమాలంకారము. 4 వాక్యగతార్థీ పూర్ణోపమాలంకారము. 5 సమాసగతార్థీ పూర్ణోపమాలంకారము. 6 తద్ధిత గతార్థీ పూర్ణోపమాలంకారము.

క్రమేణోదాహరణాని :-

వరుసగా నుదాహరణములు:—

అపి సకల కలానాం శైశవే పారగస్సన్
పరమత బలహంతా హంత రామేశ విద్వన్।
విలససి శిశు భావే ప్రౌఢ వేతండ గండ
స్థల దలన కలాయాం సాదరః కేసరీవ॥ 15

అర్థము

రామేశ విద్వన్ — రామేశ విద్వాంసుడా! । శైశవే — బాల్యమునందు । సకల కలానాం అపి — అన్ని విద్యల యొక్కయు । పారగః సన్ — అవలి గట్టు చేరిన వాడవై । పరమత బల హంతా సన్— శత్రు పక్షీయుల బలమును నశింపచేయు వాడవై । శిశు భావే — బాల్యమునందే । ప్రౌఢ — గొప్పనైన । వేతండ — ఏనుగు యొక్క । గండ స్థల — గండ స్థలము యొక్క। దలన కలాయాం — చీల్చుట యను కళ యందు । సాదరః— ఆదరము గల । కేసరీవ — సింహమువలె । విలససి — ప్రకాశించుచున్నావు । హంత — అహో ।

తాత్పర్యము

అన్ని కళలయందు దారి తేరిన రామేశ ప్రభువు బాల్యమునందే శత్రుబల సంహారము చేయుచు, మదపు టేనుగుల చీల్చి చెండాడు సింగపు పిల్లవలె నున్నాడు.

ఇయం పూర్ణాశ్రౌతీ సమాసగతా ఇవేనసహ నిత్య సమాసత్వాత్।

తెలుగు వివరణము

ఈ పై శ్లోకమునందు 1 కేసరి ఉపమానము 2 రామేశప్రభువు ఉపమేయము 3 ఇవ అనునది సాదృశ్య వాచకము 4 ప్రకాశించుట సాధారణ ధర్మము. ఈ నాలుగు

కూడ చెప్పబడినందున ఇది పూర్ణోపమ యగుచున్నది. సాక్షాత్తుగా సాదృశ్యమును చెప్పు "ఇవ" శబ్ద మున్నందున దీనిని శ్రౌతి యన వచ్చును. "ఇవ" యను పదముతో సమాసము నిత్యము అని వ్యాకరణ శాస్త్రము ఆదేశించు చున్నందున కేసరీవ అనునది ఇట సమాసమే గాని "కేసరి" "ఇవ" అని వ్యస్తముగా పద విభాగము చేయు నవకాశము లేదు. ఇట్లు ఇచ్చట సాదృశ్య వాచక శబ్దము సమాస గత మగుటచేత నీ యుపమ సమాస గత యగు చున్నది. ఇట్లు పై శ్లోకము సమాసగత శ్రౌతీ పూర్ణోపమాలంకార మని చెప్పవచ్చును.

## విశేషము

శరీరమునకు శోభాతిశయమును సమకూర్చు నట్టి కటక కుండల మణి హారాదులను లోకమున అలంకారములని వ్యవహరించుట కలదు। అట్లే కావ్యమునందు గూడ వస్త్వలంకార రస భావాది రూపమగు నేదేని ప్రధాన వాక్యార్థమునకు సౌందర్య విశేషమును సంతరింపజేయు నుపమాదుల నలంకారములుగా పేర్కొనుచుందురు. వీని లోను శబ్దమాత్ర శోభా హేతువులగు అనుప్రాసాదులను శబ్దాలంకారము లనియు, అర్థ సౌందర్య విశేషాధాయకములగు నుపమాదుల నర్థాలంకారము లనియు వ్యవహరింతురు. ఈ గ్రంథకర్త కేవల మర్థాలంకారములనే నిరూపించుచున్నాడు. ఈ ఉపమాదులు ఏ అర్థము నలంకరించునో ఆ అర్థము ప్రధానము, అలంకార్యము అగును. ఒక్కొకచోట ఉపమాదులే ప్రధాన వాక్యార్థము లగుట కూడ జరుగును. అపు డవి అలంకార్యములే కాని అలంకారము లనబడవు.

పై శ్లోకములో కవి రామేశ ప్రభువును స్తుతించినాడు. స్తోత్రము స్తుతికర్త యొక్క ప్రీతి విశేషము నావిష్కరించును కనుక ఈ శ్లోకములో ప్రభు విషయక ప్రీతి ప్రధాన వాక్యార్థ మనవలయును. ప్రీతిని రతి యని ఆలంకారికులు వ్యవహరింతురు స్త్రీ పురుష పరస్పరానురాగరూప రతి యైనచో శృంగార రసముగా పరిణమించు నవకాశము కలిగి యుండును. రాజ దేవతాది విషయకరతి భావముగానే యుండును గాని ఏరస రూపముగాను పరిణమించదు. కనుక ప్రకృత శ్లోకములో రాజ విషయక రతి భావము ప్రధాన వాక్యార్థ మనవలయును. ఈ భావమునకు శోభాతిశయమును కలిగించుచున్నందున ఇందులోని ఉపమ అలంకార మగుచున్నది. ఇట్లీశ్లోకము సమాసగత శ్రౌతీ పూర్ణోపమాలంకారమునకు ఉదాహరణముగా పరిపోవుచున్నది.

ఇచ్చట తెలిసికొనవలసిన మరియొక్క విశేషమును కలదు: అది సాధారణ ధర్మమునకు సంబంధించినది ఉపమా నిర్వాహక మైనది సాధారణ ధర్మమే యని గమనించవలెను. ఇది ఉపమానోపమేయములు రెంటియందును ఉన్నపుడే సాధారణ ధర్మమని వ్యవహరించబడును. లేనిచో ఏదో ఒకదానికి అది అసాధారణ మగును. "చంద్రుని వలె ముఖ మాహ్లాదకముగా నున్నది" అనుచోట ఆహ్లాదకత్వ మను ధర్మము చంద్రుని

యందును ముఖమునందును కలదు. కనుక సాధారణ ధర్మ మనబడును. ప్రకృత శ్లోకమున "విలససి" అను క్రియాపదము చేత చెప్పబడిన ప్రకాశించుట యనునది సింహము నందు రామేశప్రభువునందును కలదు. కనుక ఇక్కడ ప్రకాశించుట యనునది సాధారణ ధర్మము కాగలదు.

కాని ప్రకాశించుట సూర్య చంద్రాది తేజశ్శాలి పదార్థముల ధర్మము. ఆ ధర్మము కేసరియందు కానీ ప్రభువునందు కానీ కేవల ముపచారము వలననే చెప్పవలెను. ఉపచారము సాదృశ్యమును బట్టి ఆశ్రయించబడును. అగ్ని యంతటి పరిశుద్ధి గల వటువును చూచి అగ్ని యందురు. ఇచట వటువునందు అగ్నిత్వము లేదు. కాని అగ్నిత్వము కల అగ్ని యందు గల పరిశుద్ధి యున్నది. ఈ పరిశుద్ధినిబట్టి వటువు నందు అగ్నిత్వము ఉపచారము చేత వ్యవహరించబడును. ప్రకృతములో సూర్య చంద్రాది ధర్మమగు ప్రకాశము కేసరి యందు గానీ ప్రభువునందు కానీ ఉపచరిత మగుచున్నది. ప్రకాశము గల సూర్యచంద్రాదు లెంత బాగుగా నుందురో సింహ ప్రభువులుకూడ అంత బాగుగా నున్నారని అర్థ మేర్పడును. ఏతావతా సింహము వలె ప్రభువు ప్రకాశించుచున్నా డనగా ప్రభువు సింహము వలె నున్నా డని అర్థ మేర్పడుచున్నది.

ఇట్లు పర్యవసితమైన అర్థమును బట్టి చూడగా కేవలము "ఉండుట" అనునది ఇచట సాధారణ ధర్మమని చెప్పవలసి వచ్చును. ఐనను సాధారణముగా ఉండుట అను ధర్మము ఉపమా నిష్పాదకముగా స్వీకరించబడదు. సింహము వలె నున్నాడనునప్పుడు ఉనికి మాత్రమే సాధారణ ధర్మముగా వివక్షిత మైనచో చమత్కారము లేదు. చమత్కారము లేక పోవుటయే కాదు. ప్రతి వ్యక్తికి ఉనికి గలదు. కనుక ప్రతి వ్యక్తి సింహము వలె నున్నాడని చెప్ప నవకాశ మేర్పడును. అందువలన పై శ్లోకములో "విలససి" క్రియా పదముచేత వాచ్యమగు ప్రకాశించుట లేదా బాగుగా ఉండుట అనునది ఉపమానిష్పాదక మగు సాధారణ ధర్మమని చెప్ప వీలుపడదు అని యాక్షేపించు నవకాశము కలదు.

ఈ ఆక్షేపము సత్యమే. అనగా పై శ్లోకములో ప్రకాశించుట యనునది ఉపమాన నిష్పాదకముగా చెప్పబడిన సాధారణ ధర్మము కాదని యంగీకరించవలెను. కేసరి ప్రభువులకు సాధారణ మైన మరియొక ధర్మము శ్లోకములో కనుపించుటయులేదు. ఐనను కేసరి ప్రభువు లిద్దరును ప్రకాశించుటకు ప్రయోజనముగా కేసరియందు గజగండస్థలదలనమను ధర్మము, ప్రభువునందు శత్రు పక్ష హనన మను ధర్మము చెప్పబడినది. ఉపమానోపమేయ గతము లగు నీ రెండు ధర్మములకు సాదృశ్య మున్నది. శత్రువులు ఏనుగుల వంటివారు. శత్రువుల సంహరించుట ఏనుగుల చీల్చుట వంటిది. ఇట్లు సాదృశ్యము గల నీ రెండు ధర్మములకు బింబ ప్రతిబింబభావ మేర్పడుచున్నది. ఉపమానగతధర్మము బింబము. ఉపమేయగత ధర్మము ప్రతిబింబము. ఇట్లు బింబ ప్రతిబింబభావ మేర్పడిన రెండు ధర్మముల

కైక్యము చెప్పికొనుట ఆలంకారికుల కభిమతమైనదే, కనుకే పై శ్లోకములోని గజ గండస్థల దలన శత్రుబలహనన రూప ధర్మద్వయమున కైక్యము వివక్షిత మనవచ్చును. అపుడు పై శ్లోకములో "ప్రతి బింబ భావాపన్న గజగండస్థల దలన శత్రు పక్షబల హనన" రూప సాధారణ ధర్మమే ఉపమా నిష్పాదక మని చెప్పుట సమంజసముగా నుండును.

వాక్యగత శ్రౌతీపూర్ణోపమాలంకారమున కుదాహరణము:-

అమ్మన్న తవ సత్కీర్తేః స్ఫూర్తయో యుగపద్దిశః
యో వ్యాప్నువంతి యథా శీతరశ్మే శ్శిశిర భానవః॥

అర్థము:

అమ్మన్న ! — ఓ అమ్మన్న మహారాజా । తవ — నీ యొక్క । సత్కీర్తేః — చక్కని కీర్తియొక్క । స్ఫూర్తయః—వెలుగులు । శీతరశ్మేః — చంద్రుని యొక్క । శిశిర భానవ యథా — చల్లని కిరణములవలె । యుగపత్ — ఒకేసారి । దిశః — దిక్కులను । వ్యాప్నువంతి — వ్యాపించుచున్నవి.

వాక్యగతేయం పూర్ణా:-

ఇది వాక్యగతయగు శ్రౌతీపూర్ణోపమాలంకారము.

తాత్పర్యము:

అమ్మన్న ప్రభువు యొక్క కీర్తి విలాసములు చంద్రకిరణములవలె దిక్కుల నిండ వ్యాపించుచున్నవి.

ఇచట చంద్ర కిరణములు ఉపమానములు. కీర్తి విలాసములు ఉపమేయములు. సకల దిగ్వ్యాప్తి యనునది సాధారణ ధర్మము. యథా అను పదము సాదృశ్య వాచకము. ఇట్లీ శ్లోకములో నాలుగును చెప్పబడినందున ఇది పూర్ణోపమ. సాదృశ్య వాచకమగు పదము సమాసములో లేక విడిగా ప్రయుక్తమైనందున ఇక్కడి యుపమ వాక్యగత యగుచున్నది. "యథా" శబ్దము సాక్షాత్తుగా సాదృశ్యమును చెప్పుచున్నది. కనుక ఈ యుపమ శ్రౌతి యనబడును. అట్లే ఈశ్లోకములో ప్రధాన వాక్యార్థమగు రాజ విషయక రతి భావమునకు ఉపమ ఉపస్కారకముగా నున్నందున అలంకార మగుచున్నదని భావించవలెను.

తద్ధితగా శ్రౌతీ పూర్ణా యథా :-

తద్ధిత గత శ్రౌతీ పూర్ణోపమాలంకారమున కుదాహరణము:-

త్వత్కీర్తి మండల శ్శుభ్రో లిహన్నభ్రం సనాతనః ।
హిమాచల వదా భాతి విశ్వేశ కులదీపక ॥ 17

అర్థము :

విశ్వేశకులదీపక — విశ్వేశ వంశమును ప్రకాశింప చేయు నోరామేశప్రభూ । సనాతనః — శాశ్వతిక మైనట్టిదియు । అభ్రం — మేఘ మండలమును । లిహన్ — స్పృశించుచున్నదియు । శుభ్రః — తెల్లనైనట్టిదియు అగు । త్వత్కీర్తి మండలః । — నీ కీర్తియొక్క సముదాయము । హిమాచలవత్ — హిమాలయమువలె । ఆభాతి — ప్రకాశించుచున్నది॥

తాత్పర్యము :

రామేశ ప్రభువు కీర్తి మండలము శుభ్రముగా అభ్రంలిహముగా హిమాలయము వలె నున్నది. ఇచ్చట హిమాలయము ఉపమానము. కీర్తి మండలము ఉపమేయము, శుభ్రత్వము అభ్రంలిహత్వము సాధారణ ధర్మములు. "హిమాచలవత్" అనుచోట "వలె"అను నర్థములో "వతి" ప్రత్యయము వచ్చినది. ఇది తద్ధిత ప్రత్యయము. కనుక ఈ శ్లోకములో తద్ధితగతి శ్రౌతీపూర్ణోపమాలంకారము. సాధారణముగా నీ గ్రంథములోని శ్లోకములలో రాజవిషయక రతి ప్రధానవాక్యార్థ మగును. కనుక ఉపమాదుల కలంకారభావ మవ్యాహతమని ఎరుగవలెను.

ఇయం తద్ధితగా శ్రౌతీపూర్ణా। "తత్ర తస్యే" వేతివార్థె వతేర్విధానాత్। ఈ శ్లోకములో "హిమాచలవత్" అనుచోట 'వతి' ప్రత్యయము కలదు. ఇది తద్ధిత ప్రత్యయము. "తత్రతస్యేవ" అను సూత్రముచేత ఈ వతి ప్రత్యయము "ఇవ" అనుదాని యర్థమున విధించబడినది. "ఇవ" యనగా "వలె" అని యర్థము. ఇట్టి శ్లోకములో తద్ధిత గత శ్రౌత పూర్ణోపమాలంకారము ఉదాహరించబడినది।

ప్రకాశిత కుల క్ష్మాభృత్ కీర్తిచంద్ర స్సుశీతలః ।
భవతా సదృశో భాతి నిత్య మమ్మన్న భూసుర॥ 18
ఇయ మార్థీ పూర్ణా వాక్యగా :—

అర్థము :

ప్రకాశిత — ప్రకాశింప జేయబడిన । కుల — వంశమునందలి । క్ష్మాభృత్ — మహారాజులు గలయట్టి । అమ్మన్న భూసుర-అమ్మన్నయను పేరుగల ఓ భూదేవుడా । సుశీతలః— మిక్కిలి చల్లనివాడును । ప్రకాశిత — ప్రకాశింపజేయబడిన । కులక్ష్మాభృత్ — కుల పర్వత

ములు గలవాడును అగు। కీర్తి చంద్రః — (సీ) కీర్తి యనెడు చంద్రుడు । నిత్యం — ఎల్లపుడు। భవతా — నీతో । సదృశః—సామ్యము గలవాడై । భాతి — భాసించుచున్నాడు ।

**తాత్పర్యము :**

అమ్మన్న మహారాజు తన కులమునందలి రాజులను ప్రకాశింప జేయుచున్నట్లు, ఆయన యొక్క చల్లని కీర్తియనెడు చంద్రుడు కూడ కులపర్వతముల ప్రకాశింప చేయుచున్నాడు. అందుకే ఈ కీర్తిచంద్రుడు అమ్మన్నతో సమానుడుగా ప్రకాశించుచున్నాడు. ఇయం — ఇది । ఆర్థీ — అర్థ ప్రాప్తమగు । పూర్ణా — పూర్ణోపమ । వాక్యగా — వాక్యగతమైనది.

ఈ శ్లోకములో కీర్తి చంద్రుడు ఉపమేయము. అమ్మన్న మహారాజు ఉపమానము. సదృశ శబ్దము ఉపమా వాచకము. ఇక కులక్ష్మాభృత్ ప్రకాశకత్వము సాధారణ ధర్మము · ఇట్లీనాలుగును పేర్కొనబడినందున ఇచట పూర్ణోపమ అలంకార మగుచున్నది . ఇచట సాధారణ ధర్మమును చెప్పు శబ్దము "ప్రకాశిత కులక్ష్మాభృత్". ఇందులోని "కులక్ష్మాభృత్" పదమునకు "కుల పర్వతముల"ను నొక అర్థమును "కులమునకు చెందిన రాజు"లను మరి యొక అర్థమును చెప్పికొనినాము. వీనిలో కులపర్వతముల ప్రకాశింపజేయుట అను ధర్మము చంద్రునియందు మాత్రమే పొసగుచున్నది. తన వంశమునకు చెందిన రాజులను ప్రకాశింపచేయుటయను ధర్మము అమ్మన్న రాజునందే కుదురుచున్నది. కనుక ఈ రెండు ధర్మములును ఉపమానోపమేయముల కసాధారణములగుచున్నవి. మరి ఉపమానోపమేయ ములకు ఇచట సాధారణ ధర్మమేది ? రెంటియందును ఉండగలిగిన ధర్మమును గదా సాధారణ ధర్మమందురు!. సాధారణ ధర్మము లేనిదే ఉపమ ఎట్లు నిష్పన్నమగును ?. అను ఆశంక ఏర్పడవచ్చును.

కాని యిటువంటి తావులలో అలంకారికులు శబ్ద మాత్ర సాధర్మ్యము ఉపమా నిష్పాదకమని అంగీకరించుచున్నారు "సకల కలం పుర మేతత్ జాతం సంప్రతి సుధాంశు బింబ మివ" అనగా "సకల కల మగు నీ పట్టణమిపుడు చంద్రబింబము వలె నున్నది" అని యొకకవి వర్ణించును. ఇచట పట్టణ ముపమేయము. చంద్రబింబ ముపమానము. ఇవ యనునది వాచకము. ఇక సకల కలత్వము సాధారణ ధర్మము. సకల కలత్వ మనగా అన్ని కళలు గలిగి యుండుట యని చంద్ర బింబ పక్షమున అర్థము. మరి కలకల ధ్వని సహితత్వమని పట్టణ పక్షమున అర్థము. ఇట్లు రెండు అర్థములు రెంటికిని అసాధారణ ధర్మము లగుచున్నవి. మరి ఉపమానిష్పాదకమగు సాధారణ ధర్మమేది ? అని చర్చించికొనిన యాలంకారికు లిచట శబ్దమాత్ర సాధర్మ్యము నాశ్రయించి ఉపమ నిష్పన్న మగుచున్నదని అంగీకరించుచున్నారు.

ఇట్లే ప్రకృతములోను "కులక్ష్మాభృత్ ప్రకాశకత్వ మను ధర్మముకూడ ఉభయ సాధారణ మైనదని అంగీకరించవలసియున్నది. అపు డిచటకూడ ఉపమ నిష్పన్న మగుట యందు ఎట్టి ఆశంకయును కలుగజాలదు. ఇచట ఉపమేయమగు చంద్రుడు వాస్తవిక చంద్రుడు గాడు. కీర్తియం దారోపించబడిన చంద్రుడు, కీర్తికిని చంద్రునికినిగల సామ్యమును బట్టియే చంద్రుడు కీర్తియం దారోపించబడినాడు. ఇట్లారోపితుడగు చంద్రునికి మరియొకనితో సామ్యము వర్ణించుటలో సామంజస్యముగానీ చమత్కారముగానీ కనిపించదు. "ముఖ పద్మము" చంద్రునివలె నున్నది యనిన నేమి బాగుండును ? విజ్ఞులు విచారించవలయును.

ఈ శ్లోకములో ఉపమానోపమేయ వాచక ధర్మములు నాలుగును ప్రతిపాదించబడుట జేసి పూర్ణోపమయుదాహరించబడిన దనవలెను. ఇందులో "సదృశ" అను శబ్దము సామ్యమును గాక సామ్యవిశిష్టమును చెప్పుచున్నది. అందుచే "ఉపమ" శబ్దమువలన సాక్షాత్తుగా చెప్ప బడుటలేదు. మరేమనిన అర్థాత్ సిద్ధమగుచున్నది. అందుచే ఇది "ఆర్థీ ఉపమ". ఆట్లే ఈ శ్లోకములో ఉపమ అనగా సామ్యమునుచెప్పు శబ్దము సమాసములోనో తద్ధిత రూపముగానో లేదు. కనుక ఇది "వాక్యగతోపమ" యగును.

అహీన భోగ విశ్రాంతా త్వదాశ్రిత బుధావలిః ।
విశ్వంభరా సమానత్వం ధత్తే రామేశ్వర స్థిరమ్ ॥ 19

**అర్థము :**

రామేశ్వర – ఓ రామేశ్వర ప్రభూ । అహీన – ఉత్కృష్టములగు । భోగ – సౌఖ్యం ములయందు । విశ్రాంతా – విశ్రమించినట్టి । (అహీన – సర్పశ్రేష్ఠుడగు ఆదిశేషుని । భోగ – శరీరమునందు । విశ్రాంతా – విశ్రమించినట్టి । అని రెండవ అర్థము) త్వదాశ్రిత – నిన్నాశ్ర యించియున్న । బుధావలిః – పండిత సముదాయము । విశ్వంభరా సమానత్వం – భూమితో సమాన మగుటను । స్థిరమ్– దృఢముగా । ధత్తే – ధరించుచున్నది ।

**తాత్పర్యము :**

రామేశ్వరు నాశ్రయించిన పండితమండలి అహీనభోగవిశ్రాంతి గలదియై భూదేవీ సామ్యమును ధరించినది. ఇచట పండిత మండలి ఉపమేయము. విశ్వంభర ఉపమానము. సమానత్వం అనునది వాచకము. అహీన భోగ విశ్రాంతత్వము సమాన ధర్మము. ఇట్లీ నాలుగు చెప్పబడియున్నందున ఇది పూర్ణోపమ. ఇచట కూడ పై శ్లోకమునందు వలెనే శబ్దమాత్ర సాధర్మ్యమును బట్టియే ఉపమ నిష్పన్నమగుచున్నదని చెప్పకొనవలెను.

"ఇయ మార్థీ పూర్ణా సమాసే॥

ఇచటి యుపమ సమాన పద వాచ్యార్థముయొక్క ఏకదేశమగుటచే అర్థాత్ సిద్ధమగు చున్నది కనుక ఆర్థీ. అట్లే 'విశ్వంభరా సమానత్వం' అని సమాసములోని పదమువలన ఏర్పడుచుండుటంజేసి సమాసగతోపమ అని చెప్పవచ్చును. వస్తుతః ఈ శ్లోకములోని యుపమ అర్థాత్ సిద్ధమనుటకు వీలులేదు. సమాన సదృశ సమ తుల్యాది పదములు ప్రయోగించినపుడు ఉపమ అర్థాత్ సిద్ధమందురు. ఎందుకనగా పైశబ్దములు ఉపమను చెప్పనవిగావు. మరేమనిన ఉపమా విశిష్టములను చెప్పును. అందుచే ఈ శబ్దములు ప్రయోగించబడినప్పుడు ఉపమ శబ్దముచేత చెప్పబడదు. ఇక ఈ శబ్దముల అర్థము ఉపమా విశిష్టము కనుక ఉపమ ఇచ్చట అర్థాత్ సిద్ధమని యందురు. అందుచే సమానాది శబ్ద ప్రయోగ సందర్భమున ఆర్థీ ఉపమ అని పేర్కొనుచుందురు. ఐనను ప్రకృత శ్లోకములో సమాన శబ్దముకాక 'సమానత్వం' అను శబ్దమున్నది. సమానత్వం సదృశత్వం సాదృశ్యం సమత్వం సామ్యం తుల్యత్వం ఇవి యన్నియు ఉపమనే చెప్పును గాని ఉపమా విశిష్టమును చెప్పవు. కనుక ఈ శబ్దములు వాడినచోట శ్రౌతి ఉపమయే గాని ఆర్థి యనుటకు వీలుపడదు. "విశ్వంభరా సమానా తు భాతి రామేశ్వర స్థిరమ్" అను రీతిలో శ్లోకము యొక్క ఉత్తరార్థమును మార్చికొనినచో సరిగా నుండును.

కృత వృద్ధశ్రవః ప్రీతిః యశశ్శ్రీ ర్భవత స్సదా
స్వారాజ్యలక్ష్మీవ ద్భాతి శ్రీవిశ్వేశ తనూభవ ॥ 20

అర్థము :

శ్రీవిశ్వేశ తనూభవ — విశ్వేశ పుత్రుడవగునోమహారాజా । భవతః — నీయొక్క యశశ్శ్రీః — యశస్సంపత్తి । కృత — చేయబడిన । వృద్ధ — పెద్దలయొక్క । శ్రవః — చెవులకు । (వృద్ధశ్రవః — ఇంద్రునికి, అని మరియొక అర్థము) ప్రీతిః — సంతోషముగలదియై । సదా — ఎల్లపుడు । స్వారాజ్యలక్ష్మీవత్ — స్వర్గ రాజ్యలక్ష్మితో సమానముగా । భాతి — ప్రకాశించుచున్నది ।

ఇయ మార్థీ పూర్ణా తద్ధితే "తేనతుల్య" మిత్యాదినా
తుల్యార్థే వతే ర్విధానాత్॥

ఇయం — ఇది । ఆర్థీ — అర్థ సిద్ధమైనది । పూర్ణా — పూర్ణోపమ । తద్ధితే — తద్ధిత ప్రత్యయగతమై యున్నది । తేనతుల్యం ఇత్యాదినా — తేన తుల్యం క్రియాచేద్వతిః అను సూత్రముచేత । తుల్యార్థే — తుల్యమను నర్థములో । వతేః — వత్ ప్రత్యయము యొక్క । విధానాత్—విధించుటవలన ।

తాత్పర్యము :

రామేశ ప్రభువు యశస్సంపత్తి స్వర్గరాజ్య రమవలె భాసించుచున్నది. ఏమనిన ఇతని యశస్సు పెద్దల చెవులకు ప్రీతిని కలిగించునని. అందుచే 'వృద్ధశ్రవః ప్రీతి కారిత్వం' అను ధర్మము గలది। మరి వృద్ధశ్రవా అని ఇంద్రునికిని పేరున్నది. సర్గరాజ్యరమ ఇంద్రునికి ప్రీతి కలిగించునది. కనుక అదియు వృద్ధశ్రవః ప్రీతికారిత్వ మను ధర్మము గలదియే. ఇట్లు పైశ్లోకములయందువలెనే ఈ శ్లోకమునకూడ శబ్దమాత్ర సాధర్మ్యమును బట్టి ఉపమ నిష్పన్నమగుచున్నది. ఉపమానాది చతుష్టయము చెప్పబడినందున ఈ యుపమ పూర్ణ మగును. లక్ష్మీవత్ అనుచోటగల వత్ ప్రత్యయము ఇవార్థములోగాక తులార్థములో విధించబడినది. కనుక ఈ శ్లోకములో తద్ధితగతా ఆర్థీ పూర్ణోపమ అలంకారమగుచున్నది.

ఇక "లుప్తోపమ"

లుప్తా స్యాదౌ శ్రౌత్యార్థీ భేదేన ద్విప్రకారా। తత్ర శ్రౌతీ
ధర్మస్య లోపే వాక్యే సమాసే చేతి ద్వివిధైవ। తద్ధితేన సం
భవతి। ఆర్థ్యాస్తు త్రైవిధ్యం సంభవత్యేవ। తేన ధర్మలుప్తా
పంచప్రకారా ।

తాత్పర్యము :

లుప్తోపమ కూడ మొదట శ్రౌతియని ఆర్థి యని రెండు రకాలు. వీనిలో శ్రౌతీ ధర్మలు వాక్యగతయని, సమానగత, యని రెండు రకాలు మాత్రమే. తద్ధితగత శ్రౌతీ ధర్మలు యుండదు. ఆర్థీ ధర్మలుప్త మాత్రము వాక్యగత, సమాసగత, తద్ధితగతయని మూడు కాలుగా నుండును. ఇట్లు ధర్మలుప్తోపమ ఐదు విధాలుగా నుండును.

క్రమేణోదాహరణాని

వరుసగా ఉదాహరణములు

యథేందు బింబం వదనం సుధేవ వాణీ సమాచంద్రికయా స్మితశ్రీః ।
భుజౌ భుజంగేంద్రసమౌ కరౌ తే రామేశ కల్పావనిజాత కల్పౌ॥ 21

అర్థము :

రామేశ – ఓరామేశప్రభూ । తే-నీయొక్క । వదనం – మోము । ఇందుబింబంయథా – చంద్రబింబమువలె (ఉన్నది) । వాణీ – వాక్కు । సుధేవ – అమృతమువలె (ఉన్నది)।

స్మితశ్రీః — దరహాసకాంతి। చంద్రికయా సమా — వెన్నెలతో సమానముగాఉన్నది। భుజౌ — భుజములు । భుజంగేంద్రసమౌ — ఆదిశేషునితో సమానములు । కరౌ — చేతులు । కల్పావనిజాతకల్పౌ — కల్పవృక్షములతో సమానములు ।

తాత్పర్యము.

రామేశ ప్రభువుయొక్క వదనాదులు చంద్రబింబాదులతో సమానములుగా వర్ణించబడినవి.

> అత్ర యథేందు బింబం వదన మిత్యాదౌ కమనీయతర కాంతిమ త్త్వాదేః
> ధర్మస్య అప్రయోగాత్ ఇయం లుప్తా పంచప్రకారాప్యేక శ్లోక దర్శితా।

తాత్పర్యము :—

ఈ శ్లోకమున యథేందుబింబంవదనం మొదలగు తావులలో విశిష్టకాంతి మత్త్వాది ధర్మములు చెప్పబడక పోవుటంజేసి ఇది ధర్మలుప్త యగును. ఐదువిధములగు ధర్మలుప్తలు గూడ నీశ్లోకమున చూపెట్టబడినవి. వరుసగా నొక్కొకటి గమనించుడు.

1. వదనము ఇందు బింబమువలె నున్నది. ఇచట వదనము ఉపమేయము. ఇందు బింబము ఉపమానము. వలె యనునది ఉపమావాచకము. ఇక ధర్మమును చెప్పనదిలేదు. కనుక ఇది ధర్మలుప్త. యథా అను ఉపమావాచకము సాక్షాత్తుగా ఉపమను చెప్పుచు సమాసగతముగాక వాక్యములోనున్నందున ఇది శ్రౌతి వాక్యగత ధర్మలుప్త యనబడును.

2. వాణీ సుధేవ యనుచోట ఉపమానాదులు మూడును గలవు కాని ధర్మవాచకములేదు. కనుక ధర్మలుప్త. ఇవయను పదము సాక్షాత్తుగా సామ్యమును చెప్పను కనుక శ్రౌతి. ఈ ఇవ యనునది "సుధేవ" అను సమాసములో నున్నందున ఇది సమాసగతశ్రౌతి ధర్మలుప్త కుదాహరణమగుచున్నది.

3. స్మితశ్రీ చంద్రికతో సమము అనుచోట ధర్మ మొక్కటి చెప్పబడలేదు కనుక ధర్మలుప్త. సమశబ్ద ప్రయోగమున్నందున ఇచ్చటి యుపమ ఆర్థి యగుచున్నది. ఈ శబ్దము సమాసమున చేరక వ్యస్తముగా నున్నందున ఇది వాక్యగత ఆర్థి ధర్మలుప్త కుదాహరణమగుచున్నది.

4. భుజములు భుజంగేంద్ర సమములు అనుచోట సమ శబ్దము సమాసగతమై యున్నందున సమాసగత ఆర్థి ధర్మలుప్త కిది యుదాహరణ మగుచున్నది.

5. కరములు కల్ప వృక్ష కల్పములు అనుచోట కల్పవృక్షములతో సమానములు (కొంచెము తక్కువ) అను నర్థములో 'కల్పప్' అను తద్ధిత ప్రత్యయము వచ్చినది.కనుక ఇది తద్ధితగత ఆర్థిధర్మలుప్త కుదాహరణము.

ఇట్లీఐదు స్థలములలోను ఐదు ధర్మలుప్త లుదాహరించబడినవి. ఈ ఐదింటిలోను ధర్మము ప్రసిద్ధము కనుక వేరుగా చెప్పబడక పోయినను ఉపమ నిష్పన్న మగును. మొదటి ఉపమలో కాంతిమత్త్వము సాధారణ ధర్మము. రెండవ దానిలో మాధుర్యము. మూడవదానిలో శుభ్రత్వము. నాలుగవదానిలో భూభరణ సామర్థ్యము. ఐదవ దానిలో అర్థితార్థప్రదత్వము. ఇవి యన్నియు నిట్లు ఊహించుకొనవచ్చును. కనుక ఈతావులలో ధర్మము చెప్పబడక పోయినను ఉపమ యేర్పడునని తెలియనగును.

ఉపమానాఽప్రయోగే వాక్యగా లుప్తా యథా।

ఉపమానము చెప్పబడనప్పుడు ఉపమాన లుప్త యనబడును. ఇయ్యది కేవలము వాక్యగత యని ఒకే రకము. దాని యుదాహరణము.

దాతామ్మన్న విభోస్తుల్యో నాస్త్యేవ వసుధా తలే।
యదాశ్రితేషు పశ్యంతి సశ్రియోభిక్షుకా ద్విషః॥ 22

అర్థము :

అమ్మన్న విభోః — అమ్మన్న మహారాజుకు । తుల్యః — సమానుడగు । దాతా — దానగుణము గలవాడు । వసుధాతలే — భూతలమున । నాస్త్యేవ — లేదు । భిక్షుకాః — బిచ్చమెత్తుకొనుచున్న । ద్విషః — శత్రువులు । యదాశ్రితేషు — అమ్మన్న నాశ్రయించిన వారియందు । స్వశ్రియః — తమ సంపత్తులను । పశ్యంతి చూచుచున్నారు.

తాత్పర్యము :

శత్రువుల సంపత్తుల కొల్లగొట్టి తన యాశ్రితులకు పంచిపెట్టిన అమ్మన్న ప్రభువంతటి దాత భూతలమునలేడు । ఇచ్చట అమ్మన్న ప్రభువు ఉపమేయము. దాతృత్వము ధర్మము. తుల్యః అను వాచకము కలదు. కాని ఉపమాన వాచకము లేదు. కనుక నిది ఉపమాన లుప్త. తుల్యయను వాచకము వ్యస్తముగానే యున్నది కనుక వాక్యగత.

అనుక్త ధర్మోపమానా వాక్యగా లుప్తా యథా।
వాక్యగత ధర్మోపమాన లుప్త యుదాహరించబడుచున్నది.

ప్రతిపక్ష భుజంగ పక్షిరాజ్ఞా సుమనః కైరవ కౌముదీ ప్రియేణ।
జనలోచనపద్మ తిగ్మభాసా భవతామ్మన్న సమోవిభుర్నచాస్తి॥ 23

అర్థము :

ప్రతిపక్ష — శత్రువులనెడు । భుజంగ — పాములకు । పక్షిరాజ్ఞా — గరుడుడవగు సుమనః — విద్వాంసులనెడు । కైరవ — కలువలకు । కౌముదీప్రియేణ — చంద్రుడవగు జనలోచన — జనుల కనులనెడు । పద్మ — పద్మములకు । తిగ్మభాసా — సూర్యుడవగు ।, భవతా-నీతో । అమ్మన్న — ఓ అమ్మన్న మహారాజా । సమః — సమానుడగు । విభుః — ప్రభువు । నఅస్తిచ — లేడు ।

తాత్పర్యము :

శత్రువుల జయించి, విద్వాంసుల నాహ్లాదపరిచి, జనుల నందరను సంతోషపరుచు అమ్మన్న ప్రభువంతటివాడు లోకమున లేడు.

అత్ర పూర్వ శ్లోక ఇవ దాతృత్వాది ధర్మస్య అప్రయోగాత్ అనుక్తధర్మో పమానరూపా లుప్తోపమా।

ఇచ్చట పై శ్లోకమునందు వలె దాతృత్వాది ధర్మము చెప్పబడలేదు. కనుక ఇది ధర్మోపమానములు చెప్పబడని లుప్తోపమ. అనగా ధర్మోపమాన లుప్తోపమయని తాత్పర్యము. ఈ శ్లోకములో విభు శబ్ద మున్నది. దీనితో అమ్మన్నయంతటి ప్రభువు లే దను నర్థమేర్పడు చున్నది. పై శ్లోకమున అమ్మన్న యంతటి దాత లేడనగా దాతృత్వము సమాన ధర్మమైనట్లు ఇచట ప్రభుత్వము సమానధర్మము కావచ్చును.కనుక''భవతామ్మన్న సమో న్యోచాస్తి కశ్చిత్'' అను రీతిలో నాల్గవ పాదము ''విభు'' పదము లేకుండునట్లుగా పఠించిన బాగుండును.

అనుక్త ధర్మోపమానా సమాసగతా లుప్తా యథా:—
సమాసగతయగు ధర్మోపమాన లుప్త యుదాహరించబడుచున్నది.

ద్యుసరిత్ప్రసర త్కీర్తి పవిత్రిత జగత్త్రియ।
రామేశ క్షోణి మందార త్వత్సమో న సమీక్ష్యతే॥

అర్థము :

ద్యుసరిత్ — ఆకాశగంగవలె । ప్రసరత్ — ప్రసరించు । కీర్తి — కీర్తిచేత । పవిత్రిత — పవిత్రములుగా చేయబడిన । జగత్త్రియ — మూడు లోకములుగల । క్షోణి మందార — భూమి యందలి మందారమా । రామేశ! — ఓ రామేశ ప్రభూ! । త్వత్సమః — నీయంతటివాడు । న సమీక్ష్యతే — కానబడడు ।

తాత్పర్యము :

ఎవని కీర్తి ఆకాశగంగవలె వ్యాపించి మూడు లోకాలను పవిత్ర మొనరించుచున్నదో అట్టి మహీమందార స్వరూపుడగు రామేశ ప్రభువునకు సాటిరాగలవారు కనిపించరు. ఇచ్చట కూడ ధర్మము ఉపమానము చెప్పబడలేదు. ఉపమా వాచక పదము సమ యనునది సమాసమున చేరినది. అందుచే ఇది సమాసగత ధర్మోపమాన లుప్తోపమ యనవలెను.

ఇచ్చట రామేశ ప్రభువునందు మందార తాద్రూప్యము చెప్పబడుచున్నది. ఈ తాద్రూప్యము సామ్యమూలకముగానే నిర్వహింపబడవలసియున్నది. ఉపమానమును నిషేధించుసీ సందర్భమున సామ్యమూలకమగు మందార తాద్రూప్యమును వర్ణించుట సమంజసముగా కన్పట్టదు. "రామేశ వసుధానాథ" యని మూడవ పాదమును పఠించిన బాగుండును.

అనుక్తే వాదిః సమాసగా లుప్తా యథా:-

ఇవాది వాచకములు చెప్పబడని సమాసగత లుప్తోపమ ఉదాహరించబడుచున్నది.

ప్రాలేయాచల రూఢరూప్య కుధరోత్సంగానుషంగీశ్వరో
త్తంసాకాశనదీతరంగ నివసచ్ఛీతాంశుఖండోజ్జ్వలమ్।
శ్రీవిశ్వేశ కుమారరత్న సుయశస్స్ఫీతం విధత్తే తవ
త్రైలోక్యం స్ఫటికాశ్మనిర్మిత మహాసౌధం స్వకాంతిశ్రియా॥ 25

అర్థము :

శ్రీవిశ్వేశ కుమార రత్న - ఓవిశ్వేశరపుత్ర రత్నమా । ప్రాలేయాచల రూఢ - హిమాలయమునందుగల । రూప్యకుధర - వెండికొండయొక్క । ఉత్సంగ - మధ్యభాగమున । అనుషంగి - వసించు । ఈశ్వర - శివుని । ఉత్తంస - శిరోభూషణమగు ఆకాశనదీ - గంగ యొక్క । తరంగ — అలలయందు । నివసత్ ఉన్నట్టి । శీతాంశుఖండ - చంద్రఖండమువలె । ఉజ్జ్వలం - ప్రకాశించునట్టి । తవ - నీ యొక్క । స్ఫీతం - చిక్కని । సుయశః - చక్కని కీర్తి । స్వకాంతిశ్రియా - తన కాంతి సంపత్తిచేత । త్రైలోక్యం -

ముల్లోకములను । స్ఫటికాశ్మ - స్ఫటికమణులచే । నిర్మిత — నిర్మించబడిన । మహాసౌధం - గొప్ప మేడనుగా । విధత్తే — చేయుచున్నది ।

తాత్పర్యము

చంద్రునివలె భాసించు రామేశ ప్రభువు కీర్తి మూడు లోకములలోను బాగుగా వ్యాపించినది. ఇచట చంద్రఖండ ముపమానము. కీర్తి ఉపమేయము. ఉజ్జ్వలత్వము సమాన ధర్మము. వాచకమగు ఇవ శబ్దము సమాసమూలమున లోపించినది. "శీతాంశు ఖండం ఇవ ఉజ్జ్వలం" అనునది విగ్రహ వాక్యము. "శీతాంశు ఖండోజ్జ్వలమ్" అనునది సమాసము. అందుచే ఇచట సమాసగత వాచక లుప్తోపమాలంకార మనవలెను.

అధికరణాదుత్పన్నేన క్యచా సా యథా:—

అధికరణార్థమున విధించబడిన క్యచ్ ప్రత్యయము నుపయోగించుకొనినపుడు కూడ ఇవాది వాచకము లోపించును. దాని యుదాహరణము.

రామేశ క్షోణి దేవేంద్ర భవతః కీర్తిగేహినీ।
భువన త్రితయే హంత నివాస భవనీయతి॥ 26

అర్థము :—

క్షోణి దేవేంద్ర — భూలోకమున కింద్రుడవగు । రామేశ! — ఓరామేశ ప్రభూ । భవతః - నీయొక్క । కీర్తిగేహినీ—కీర్తియనెడు ఇల్లాలు । భువనత్రితయే — లోకత్రయము నందు । నివాసభవనీయతి — తానుండు ఇంటియందు వలెనున్నది. హంత —ఆశ్చర్యము ।

తాత్పర్యము :

రామేశ ప్రభువు కీర్తి మూడు లోకములయందును తన ఇంటి యందువలె నున్నది. ఇచట భువనత్రితయము ఉపమేయము. నివాస భవనము ఉపమానము. ధర్మము అనుక్తము. వాచకమగు ఇవ శబ్దము క్యచ్ ప్రత్యయ మూలమున లోపించినది. "నివాస భవనే ఇవ ఆచరతి" అనునది విగ్రహ వాక్యము. "నివాస భవనీయతి" యనునది తద్ధిత వృత్తి. అందుచే ఇది అధికరణ క్యజంత ప్రయోగమూలమున ఏర్పడిన వాచక లుప్త. ఐనను ధర్మము గూడ అనుక్త మైనది కనుక ధర్మ వాచకలుప్త యనవలెను.

అనుక్త ధర్మేవాది: క్విపా లుప్తా యథా—

ధర్మ మనుక్తమై, వాచకము క్విప్ ప్రత్యయ మూలముగా లుప్తమైనపుడు ఏర్పడు ధర్మ వాచక లుప్త ఉదాహరించబడుచున్నది.

మనోభవతి కాంతానాం అర్థినాం కల్ప వృక్షతి।
ప్రకృతీనాం జనకతి శ్రీవిశ్వేశ తనూభవః॥ 27

ఆ ర్థ ము :—

శ్రీవిశ్వేశ తనూభవః — శ్రీవిశ్వేశ ప్రభువు కుమారుడు । కాంతానాం — స్త్రీలకు మనోభవతి — మన్మథుని వలె నున్నాడు । అర్థినాం — యాచకులకు । కల్ప వృక్షతి — కల్ప వృక్షమువలె నున్నాడు । ప్రకృతీనాం — ప్రజలకు । జనకతి — తండ్రివలె నున్నాడు ।

తా త్ప ర్య ము

ఇచట మనోభవఇవ ఆచరతి, యనునది విగ్రహ వాక్యము. ఇవ ఆచరతి అను నర్థములో క్విప్ అను ప్రత్యయము వచ్చుట వలన మనోభవతి మొదలగు తద్ధిత వృత్తి వాక్యము లేర్పడినవి. సౌందర్య దాతృత్వ రక్షకత్వాది ధర్మములుకూడ చెప్పబడలేదు. కనుక ధర్మలుప్తయనికూడ అన వచ్చును. క్విప్ ప్రత్యయార్థమగు ఆచరణమే ''సామాన్య ధర్మమని, అది లోపించుటచే నిది ధర్మవాచక లుప్త'' యని కొంద రందురు.

ఏవం లుప్తా భేదాః సూక్ష్మ దృగ్భి రన్యే ప్యూహ్యాః

ఇట్లు లుప్తోపమా భేదములు అనేకములు కావచ్చును. వానిని సూక్ష్మ దృష్టి కల వివేకు లూహించుకొనవలెను.

అయ మలంకారో వస్తుప్రతివస్తుభావేన బింబప్రతిబింబ భావేన చ సంభవతి వస్తుప్రతివస్తుభావః। ఏకస్యైవ ధర్మస్య ద్విరూపాదానం వస్తు ప్రతివస్తు భావః। యథా-

ఈ యుపమాలంకారము వస్తుప్రతివస్తు భావాపన్న సామాన్య ధర్మ నిష్పాద్యముగాను బింబ ప్రతిబింబ భావాపన్న సామాన్యధర్మ నిష్పాద్యము గాను ఉండవచ్చును. వస్తు ప్రతి వస్తు భావ మనగా ఒకే ధర్మమును రెండు విభిన్న శబ్దములచేత పేర్కొనుట. దీని యుదా హరణము —

అశేష హృదయాహ్లాది కీర్తీ రామేశ్వర ప్రభుః।
సమస్త స్వాంత సంతోషి చంద్రిక శ్చంద్రమా యథా॥ 28

అర్థము :

అశేష - అందరి । హృదయ — హృదయములను । అహ్లాది—ఆహ్లాదపరుచు । కీర్తిః — కీర్తిగల । రామేశ్వర ప్రభుః — రామేశప్రభువు । సమస్త — అందరి । స్వాంత — హృదయములను । సంతోషి — సంతోషపరుచు । చంద్రికః — వెన్నెలగల । చంద్రమా యథా —చంద్రుని వంటి వాడు ।

అత్ర అశేష హృదయాహ్లాది సమస్త స్వాంత సంతోషి శబ్దాభ్యాం
ఏకస్యైవ ధర్మ స్యోపాదానాత్ వస్తు ప్రతివస్తు భావః॥

ఇక్కడ 'అశేష హృదయాహ్లాది' యనియు, 'సమస్త స్వాంత సంతోషి' అనియు రెండు శబ్దములచేత ఒకే ధర్మము చెప్పబడినందున వస్తు ప్రతివస్తు భావము వివరించబడి నట్లైనది.

వస్తుతః ఇచ్చట ఉపమాలంకారము వస్తు ప్రతివస్తు భావాపన్న సాధారణ ధర్మ నిష్పాద్యము కాదు. ఇచట రామేశ ప్రభువు ఉపమేయము. చంద్రుడు ఉపమానము. యథా అనునది వాచకము. ఇక సాధారణ ధర్మము లేదు. దానిని కల్పించుకొనవలెను. రాజునందు కీర్తి, చంద్రునియందు చంద్రిక చెప్పబడినవి. ఇవి రెండును ఇద్దరికి అసాధారణ ధర్మములు. కాని ఈ రెంటికిని సాదృశ్యము కవి సమ్మతము. కనుక కీర్తి చంద్రికలను రెంటిని సాదృశ్యమును బట్టి ఏకము చేయవలెను. ఇది బింబ ప్రతిబింబ భావాపన్న సాధారణధర్మ మగును. దీనిని బట్టి రాజ చంద్రులకు ఔపమ్యము నిష్పాద్యమగుచున్నది. కనుక నీ శ్లోకమున బింబ ప్రతిబింబ భావాపన్న సాధారణ ధర్మనిష్పాద్యమగు ఉపమయే చెప్పవలెను. కాని ఈ కీర్తి చంద్రికలకు కూడ సామ్య మున్నది. ఇట కీర్తి ఉపమేయము. చంద్రిక ఉపమానమును. వీనికి సాధారణ ధర్మము ఆహ్లాదకత్వము. ఈ సాధారణ ధర్మము అశేష హృదయాహ్లాది శబ్దము చేతను, 'సమస్త స్వాంత సంతోషి' శబ్దముచేతను చెప్పబడినది. కనుక ఈ ధర్మము వస్తు ప్రతివస్తు భావాపన్న ధర్మ మనుటలో సందేహములేదు. కాని ఇచ్చట చంద్రికలో కీర్తికి ఉపమను వర్ణించుటలో తాత్పర్యము లేదు. "రామేశ్వర ప్రభుః చంద్రమా యథా" అని ప్రభువుకు చంద్రునితో గల "ఉపమయే అలంకారముగా ఇచట నిర్దిష్టమగుచున్నది. కీర్తి చంద్రికలు కేవల విశేషణములుగానే నిర్దిష్టములైనవి. కనుక చంద్రికోపమ యిట ప్రధాన వివక్షితము కాదు. వివక్షితమగు చంద్రోపమ వస్తు ప్రతివస్తు భావాపన్న సాధారణ ధర్మ నిష్పాద్యముగాదు. అందుచే ఈ శ్లోకము వస్తు ప్రతివస్తు భావాపన్న సాధారణ ధర్మ నిష్పాద్యమగు ఉపమాలంకారమున కుదాహరణము కాదు. మరేమనగా 'వస్తు ప్రతివస్తు భావ' మనగా నెట్టిందునో చూపెట్టుట కీశ్లోక మని అనుకొనవలెను. ఒకే ధర్మము ఈ శ్లోకములో "అశేషే" త్యాది శబ్దముచేతను, సమస్తేత్యాది శబ్దముచేతను చెప్పబడినది కదా ! ఇట్లు ఒకే ధర్మము

రెండు విభిన్న శబ్దములచే చెప్పబడిన 'వస్తు ప్రతివస్తు భావ' మనబడు నను విషయమునకు మాత్రమే శ్లోక ముదాహరణ మనవచ్చును.

బింబ ప్రతిబింబ భావః— భిన్నయోరేవ ధర్మయోః వారద్వయ ముపాదానం బింబ ప్రతిబింబ భావః। యథా—

ప్రాసాద శిఖరారూఢో రామేశ క్షితివాసవః।
సువర్ణాచల కూటస్థో భాస్వా నివ విరాజతే॥ 29

**అర్థము :**

ప్రాసాద శిఖరా రూఢః — మేడ పైభాగము నధిరోహించిన। రామేశ క్షితివాసవః — రామేశ భూమీంద్రుడు। సువర్ణాచల కూటస్థః — మేరు శిఖరముపై నున్న। భాస్వానివ — సూర్యునివలె। విరాజతే — ప్రకాశించుచున్నాడు।

అత్ర ప్రాసాద శిఖరారూఢత్వ సువర్ణాచల కూటస్థత్వయోః వస్తుతో భిన్నయో రేవ ధర్మయోః అతిశయోక్త్యాధ్యవసానాత్ బింబ ప్రతిబింబభావః।

ఇచ్చట "ప్రాసాద శిఖరారూఢత్వము" "సువర్ణాచల కూటస్థత్వము" అను రెండు విభిన్న ధర్మములకు అతిశయోక్తితో అధ్యవసాన మొనర్చినందున బింబ ప్రతిబింబ భావ మేర్పడినది.

**తాత్పర్యము :**

మేడపైనున్న రాజు బంగారు కొండపైనున్న సూర్యునివలె భాసించుచున్నాడు. ఇచట రాజు ఉపమేయము. సూర్యు డుపమానము. ఇవ అనునది వాచకము. ఇక ధర్మము కేవలము భాసించుట కాదు. మరేమనగా మేడపై నుండుట, కొండపై నుండుట అను రెండు విభిన్న ధర్మములకు సాదృశ్యమూలముగా ఐకము సంపాదించినచో నవి రెండును ఒక సాధారణ ధర్మముగా నేర్పడును. మేడ కొండవలె నున్నతమైనది. ఈ సాదృశ్యమును బట్టి మేడకు కొండకు భేద మున్నప్పటికి నభేదము చెప్పుదురు. దీనిని 'భేదేపి అభేదాతిశయోక్తి' యందురు. ఇచటి మూలములోని అధ్యవసాన పదమున కభేదమని మాత్రమే యర్థము చెప్పుకొనవలెను. ఇట్లు విభిన్న ధర్మముల కైక్యము చెప్పుకొనినందున నిచట బింబ ప్రతిబింబ భావాపన్న సాధారణ ధర్మ నిష్పాద్యమగు ఉపమ అలంకారమగుచున్నది.

పునర ప్యస్యాలంకారస్య ద్వైవిధ్యం సంభవతి। సమస్త వస్తు విషయా ఏకదేశ వివర్తినీ చేతి। సమస్తవస్తు విషయా యథా—

మరియు నీ యుపమ సమస్త వస్తు విషయ యని, ఏకదేశ వివర్తిని యని రెండు రకములుగా నుండును. సమస్త వస్తు విషయ కుదాహరణము.

పయస్సరస్వానివతస్య వంశః మందార ముఖ్యా ఇవ తత్ప్రజాశ్చ।
శశీవ రామేశ విభుర్విభాతి తత్కీర్తి మాలాపిచ కౌముదీవ॥ 30

అర్థము :

రామేశ విభుః — రామేశ ప్రభువు । శశీవ — చంద్రునివలె । విభాతి — భాసించుచున్నాడు । తస్య — అతని । వంశః — వంశము । పయస్సరస్వా నివ — పాలకడలివలె । విభాతి — భాసించుచున్నది । తత్ప్రజాశ్చ — అతని ప్రజలుకూడ । మందార ముఖ్యా ఇవ — పారిజాతము మొదలగువానివలె । విభాంతి — భాసించుచున్నారు । తత్కీర్తి మాలాపిచ — అతని కీర్తి పరంపరయు । కౌముదీవ — వెన్నెలవలె । విభాతి — భాసించుచున్నది.

తాత్పర్యము :

ఇచట ప్రభువు చంద్రునివలె నున్నాడని అతని వంశము పాల సముద్రమువలె నున్నదని ఈ విధముగా అన్ని విషయములయందును సాదృశ్యము వర్ణించ బడినందున ఇది సమస్త వస్తు విషయ యగు ఉపమ యని వ్యవహరింతురు.

ఏకదేశ వివర్తినీ యథా —

ఏకదేశ వివర్తిని ఉపమ కుదాహరణము—

మైనాక ముఖ్యైరివ మంత్రి ముఖ్యైః మహోర్మిభిర్వా బుధవాగ్విలాసైః।
త్వయా సముద్య త్సురభూరుహేవా రామేశ విప్రేంద్రసభా విభాతి॥ 31

అర్థము :

విప్రేంద్ర — విప్రశ్రేష్ఠుడవగు । రామేశ — ఓ రామేశ ప్రభూ । మంత్రిముఖ్యైః — మంత్రులు మొదలగువారిచేత । మైనాక ముఖ్యైరివ — మైనాకుడు మొదలగువారిచేతవలె । బుధవాగ్విలాసైః — పండితుల వాగ్విలాసములచేత । మహోర్మిభిర్వా — గొప్పతరంగముల చేతవలె । త్వయా — నీ చేత । ఉద్యత్సురభూరుహేవా — ఉదయించు కల్పవృక్షముచేతవలె । సభా — సభ । విభాతి — ప్రకాశించుచున్నది ।

అత్ర సభా సముద్ర ఇవ ఇత్యర్థాత్ప్రతీతేః ఏకదేశ వివర్తిత్వమ్

ఇచ్చట రాజు కల్పవృక్షము వంటి వాడని, మంత్రులు మైనాకునివంటి వారని, పండిత వాక్కులు తరంగముల వంటివని వర్ణించినందున సభ సముద్రము వంటిదని తోచును కనుక నిచట ఏకదేశ వివర్తివి ఉపమ యనబడును. అనేక విషయములయందు వర్ణించబడిన సామ్యమునుబట్టి ఒకచోట సామ్యము గమ్యమయ్యేనేని అది ఏకదేశ వివర్తిని యుపమ యనబడును.

పునః మాలారూపేణాప్యయ మలంకార స్సంభవతి యథా—

ఇంకను మాలారూపముగాను ఈ యలంకార ముండును ఉదా:

రాజద్రాజ గుణావలీ పరిమళోదంచచ్చరిత్రాద్భుతత
శ్రీరామేంద్ర మహీంద్ర హంత భవతః కీర్తేః పరిస్ఫూర్తయః।
నీహారంతి హరంతి నిర్జరవరాహారంతి వాణీ స్మిత
వ్యాహారంతి హరాచలంతి పరితో హారంతి హీరంతిచ॥ 32

అర్థము:

రాజత్ — ప్రకాశించుచున్న । రాజగుణావలీ — రాజగుణ సముదాయముయొక్క । పరిమళ — సంపత్తిచేత । ఉదంచత్ — వృద్ధిచెందు । చరిత్ర — చరిత్రముచేత । అద్భుత — ఆశ్చర్యకరుడవగు । శ్రీరామేంద్ర మహీంద్ర — ఓరామేశప్రభూ । హంత — ఆశ్చర్యము—భవతః — నీయొక్క । కీర్తేః — కీర్తియొక్క । పరిస్ఫూర్తయః — విలాసములు । నీహారంతి — మంచువలె నున్నవి । హరంతి — శివునివలె నున్నవి । నిర్జరవరాహారంతి — అమృతమువలె నున్నవి । వాణీస్మిత వ్యాహారంతి — సరస్వతీదేవి చిరునగవులతోడిపలుకులవలె నున్నవి। హరాచలంతి — కైలాసమువలె నున్నవి । పరితః — అన్ని వైపుల । హారంతి — ముత్తెముల హారములవలె నున్నవి । హీరంతి — వజ్ర మణులవలె నున్నవి ।

అత్రైకస్యైవోపమేయ స్యానేకా న్యుపమానాని విబద్ధానీతి మాలారూపత్వమ్।

ఇచట కీర్తి విలాసము లుపమేయములు. వానిని నీహారాదు లనేకములు ఉపమానములుగా చెప్పబడినవి. కనుక దీనిని మాలోపమాలంకారమందురు.

ఇయం బాలా లోలాయత నయన లీలాపహసితా
సితాంభోజా పూజాపర సుర సమాజాశ్రితపదా।
కనద్భూషా శేషాభరణహితవేషా స్మితముఖీ
చతుర్వ్యూహా ఒమోహా జితహృదయగేహా విజయతామ్॥ 33

అర్థము :

లోల — చంచలములును । ఆయత — దీర్ఘములును అగు । నయన — కనులయొక్క । లీలా — విలాసములచేత । అపహసిత — వెక్కిరించబడిన । అసితాంభోజా — నల్లకలువలు గలదియు । పూజాపర — పూజాయందాసక్తులగు । సుర — దేవతల యొక్క సమాజ — సముదాయముచేత । ఆశ్రిత — ఆశ్రయించబడిన । పదా — పదములు గలదియు । కనద్భూషా । మెరయుభూషణములు గలదియు । శేషాభరణ — శివునికి । హిత — ఇష్టమగు ।వేషా — వేషముకలదియు । స్మితముఖీ — చిర్నగవు లొలుకు మోము గలదియు । చతుర్బాహా — నాలుగు చేతులు గలదియు । అమోహా — మోహములేనిదియు । జిత హృదయగేహా — జయించబడిన కామముగలదియునగు । ఇయం — ఈ । బాలా — త్రిపుర సుందరీదేవి । విజయతామ్ — జయించుగాక ।

తాత్పర్యము :

ఉపమాలంకార ప్రకరణము ముగించు సందర్భమున గ్రంథకర్త తన ఇష్ట దేవతయగు బాలా త్రిపుర సుందరీదేవిని ఈ శ్లోకములో భక్తి పూర్వకముగా స్మరించుచున్నాడు.

"ఇత్యుపమాలంకార ప్రకరణమ్"

ఇది ఉపమాలంకార ప్రకరణము.

అథ ఉపమేయోపమాలంకార ప్రకరణమ్

ఉభయోశ్చ విపర్యాసా ద్యద్యుపమానోపమేయతే భవతః।
సన్నిహిత వాక్యయుగలే తర్హ్యుపమేయోపమా సమాదిష్టా॥
అత్ర ఉపమేయస్య ఉపమానత్వ కారణాత్ ఉపమా వ్యావృత్తిః।యథా–

అర్థము :

సన్నిహిత వాక్యయుగలే — దగ్గరగానున్న రెండు వాక్యములలో । ఉభయోశ్చ — రెంటికిని । విపర్యాసాత్ — వరుసగా । యది — ఒకవేళ । ఉపమానోపమేయతే — ఉపమానత్వము ఉపమేయత్వముగూడ । భవతః — ఏర్పడును । తర్హి — అపుడు । ఉపమేయోపమా ఉపమేయోపమ — యను నలంకారము। సమాదిష్టా — చెప్పబడినది । అత్ర — ఇందులో । ఉపమేయస్య — ఉపమేయమునకు । ఉపమానత్వకారణాత్ — ఉపమానత్వ మేర్పడిన కారణముగా । ఉపమావ్యావృత్తిః — ఉపమకంటె భేదము ।

తాత్పర్యము :

మొదటి వాక్యములోని ఉపమానోపమేయములను రెండవ వాక్యములో నుపమేయోపమానములుగా చేసి రెండు వాక్యములలో రెండు ఉపమలు వరసగా చెప్పబడినచో నది ఉపమేయోపమాలంకారమని తెలియవలెను. ఇచట ఉపమేయమునకు వెంటనే ఉపమానత్వము గూడ చెప్పబడుచున్నందున ఈ యలంకారము ఉపమాలంకారము కంటె భిన్నమైనది. వస్తుతః ఇదికూడ ఉపమాలంకారమే అని, ఐనను ప్రకృతములగు రెంటికి సదృశము కాదగిన మూడవ వస్తువు లేదని తెల్పుటయే దీనికిగల విశేషమని, దీనిని బట్టియే ఉపమకంటె వేరుగా వ్యవహరించబడుచున్నదని పండితరాజ ప్రభృతులు భావించుచున్నారు. ఉదాహరణము—

రామేశ త్యాగ మందార ధైర్యశ్రీ జిత మందర।
సుధేవ భవతో వాణీ వాణీవ మధురా సుధా॥ 35

అర్థము :

త్యాగమందార — త్యాగములో మందారమా । ధైర్యశ్రీజిత మందర — ధైర్యసంపత్తి చేత జయించబడిన మందరముగలవాడా । రామేశ — రామేశప్రభూ । భవతః — నీయొక్క । వాణీ — వాక్కు । సుధేవ — అమృతము వంటిది । సుధా — అమృతము । వాణీవ — నీ వాక్కువలె । మధురా — తీయనిది ।

తాత్పర్యము :

ఇచట మొదట వాక్కు ఉపమేయము, అమృతము ఉపమానము, తరువాత వాక్యములో వాక్కు ఉపమానము, అమృతము ఉపమేయము ఐనది. అందుచే ఇది ఉపమేయోపమాలంకారము.

అత్ర మాధుర్యం సాధారణోధర్మ ఇతి సాధారణ్యేన ఇయం
ఉపమేయోపమా।

ఇచ్చట మాధుర్యము సాధారణ ధర్మము. ఇట్లు సామాన్యము గానిది ఉపమేయోపమ.

ఇత్యుపమేయోపమాలంకారః।

అథాఽనన్వయాలంకారః

ఏకస్యైకస్య స్తో యద్యుపమా నోపమేయతే వాక్యే।
తత్రాఽనన్వయ నామాఽలంకారః కీర్త్యతే విపశ్చిద్భిః॥ 36

యత్ర సదృశ నిషేధద్యోతనాయ ఏకస్యైవ ఉప
మానోపమేయ భావః ప్రతిపాద్యతే తత్రానన్వయాలంకారః యథా-

వివరణము:

ఒకే వాక్యమునందు ఒకే వస్తువునకు ఉపమానత్వము ఉపమేయత్వము కూడ వర్ణించబడినచో నది అనన్వయాలంకారమగును. సాటి రాదగిన మరియొక వస్తువు లేదని తెలుపుటకై ఒకే వస్తువునకు ఉపమానత్వము ఉపమేయత్వము కూడ వర్ణించబడుచుండును.
ఉదాహరణము —

సమస్త సుగుణ స్తోమ విస్తారాద్భుత వర్తనః
రామేశ్వరో యమాభాతి రామేశ్వర ఇవస్వయమ్॥ 37

అర్థము:

సమస్త — మొత్తము । సుగుణ — సుగుణములయొక్క । స్తోమ — సముదాయము యొక్క । విస్తార — వ్యాప్తిచేత । అద్భుతవర్తనః — ఆశ్చర్యకర ప్రవర్తనగల । అయం — ఈ । రామేశ్వరః — రామేశ ప్రభువు । స్వయం — స్వయముగా రామేశ్వర ఇవ — రామేశ ప్రభువు వలెనే । ఆభాతి — ప్రకాశించుచున్నాడు.

వివరణము:

ఇచట రామేశ ప్రభువు రామేశప్రభువు వలె నున్నాడని వర్ణించినందున రామేశప్రభువునకు సాటిరాదగినవారు లేరని తేల్చుటయైనది. కనుక నిది అనన్వయము.

ఇత్యనన్వయాలంకారః.

అథ స్మరణాలంకారః

సదృశార్థానుభవేన స్మర్యేత యదా పునస్సదృశమ్।
తత్ర స్మరణం నామ ప్రేక్షావంతో వదం త్యలంకారమ్॥ 38

యత్ర సదృశ వస్తుదర్శనేన సదృశార్థాంతరావమర్శః తత్ర స్మరణాలంకారః।

వివరణము:

ఒక వస్తువును చూచునప్పుడు తత్సదృశమగు మరియొక వస్తువు స్మృతమైనట్లు వర్ణించబడినచో నచ్చట స్మరణాలంకారము. ఉదాహరణము—

సభాస్థలీ సంస్థిత మీక్ష్య సూరయో రామేశ్వరం దేవపతిం స్మరంతి।
అన్యే ధనేశం సుజనా_స్త్ర చంద్రం స్త్రియ స్స్మరం వీతమదా స్స్మరఘ్నమ్॥ 39

అర్థము :

సభాస్థలీ సంస్థితం — సభయందున్నట్టి । రామేశ్వరం — రామేశప్రభువును — ఈక్ష్య — చూచి । సూరయః — విద్వాంసులు । దేవపతిం — ఇంద్రుని । స్మరంతి — స్మరించు చున్నారు । అన్యే — మరి కొందరు । ధనేశం — కుబేరుని । స్మరంతి — స్మరించుచున్నారు । సుజనాస్తు — సుజనులు । చంద్రం — చంద్రుని । స్మరంతి — స్మరించుచున్నారు । స్త్రియః — స్త్రీలు । స్మరం । మన్మథుని । స్మరంతి — స్మరించుచున్నారు । వీతమదాః — మదముడిగిన వారు । స్మరఘ్నం — శివుని । స్మరంతి । స్మరించుచున్నారు ।

వివరణము — ఇచట రామేశ ప్రభువును చూచిన వారలకు తత్సదృశ దేవేంద్రాది స్మరణము కలిగినట్లు వర్ణించబడి యున్నందున నిది స్మరణాలంకార మగుచున్నది ।

ఇతి స్మరణాలంకారః

అథ రూపకాలంకారః

అథాభేద ప్రయుక్త సాధర్మ్యమూలాలంకారాణాం మధ్యే
ప్రథమ మారోప గర్భేషు నిరూపణీయేషు ఆదౌ రూపకం నిరూప్యతే॥

అతి రోహితస్య విషయ స్యారోప్యే ణోపర క్తతా యత్ర।
తద్రూపక మభిధత్తే భేదా శ్చాస్య త్రయో విభావ్యంతే॥ 40

వివరణము :

సాదృశ్యము భేద గర్భితము, అభేద గర్భితము అని రెండు విధములు. ఉపమాద్యలంకారములలో ఉపమానోపమేయములకు భేదము నిరాకరించక సాదృశ్యము వర్ణించబడినది. కనుక అవిభేదగర్భిత సాదృశ్యమూలకములగు నలంకారములుగా పేర్కొన బడుచున్నవి. రూపకాదులయందు ఉపమానోపమేయములకు అభేదము వర్ణించబడును. ఈ యభేదము సాదృశ్యప్రయుక్తము. కనుక నీయలంకారములు అభేదగర్భిత సాదృశ్యమూలకములు. ఈ భేద గర్భితము గాని సాదృశ్యము రూపకోత్ప్రేక్షాదులయందు వర్ణించబడును. వీనిలో రూపకాదు లారోపమూలకములు. ఉత్ప్రేక్షాదులు అధ్యవసాయమూలకములు. ఉపమానోపమేయ ములను విడివిడిగా నిర్దేశించి చెప్పిన అభేదము ఆరోప మనబడును. ఉపమేయమును విడిగా

చెప్పక ఉపమాన వాచక పదముతోనే చెప్పిన అధ్యవసాయ మనబడును. ఇపు డారోపమూల కాలంకారములలో మొదట రూపకాలంకారము నిరూపించబడుచున్నది.

తిరోహితము గానట్టి ఉపమేయమునకు ఆరోప్యమగు దానితో తాద్రూప్యమెచట వర్ణించ బడునో దానిని రూపకముగా గ్రంథకర్త చెప్పుచున్నాడు. ఈ రూపకాలంకారము మొదట మూడు ముఖ్యములగు భేదములు గలదిగా చెప్పవచ్చును.

> అత్ర అతిరోహితస్య విషయస్య, ఇత్యనేన సందేహ భ్రాంతిమ దపహ్నవానాం వ్యావృత్తిః తేషాం విషయస్య సందేహ భ్రాంత్యపహ్నవైః తిరోహితత్వాత్। "ఆరోప్యేణ"ఇత్యనేన ఉత్ప్రేక్షాదేరుపమాదీనాంచ వ్యావృత్తిః ఉత్ప్రేక్షాదే రారోపవ్యతిరిక్తాధ్యవసాయమూలత్వాత్।ఉపమాయాశ్చానారోప మూలత్వాత్ అస్యాలంకారస్య ఆరోప ప్రాణత్వాత్। "ఉపరక్తతే"త్యనేన పరిణామాలంకార వ్యవచ్ఛేదః। తత్రారోప్యమాణస్య ప్రకృతోపయోగితయా విషయపరిణామ రూపత్వేన ప్రకృతోరంజకత్వాభావాత్। అతః సర్వేభ్యః సాదృశ్యమూలాలంకారేభ్యః వివిక్త ఏవాస్య అలంకారస్య విషయః ।—

వివరణ:

పైన పేర్కొనిన రూపక లక్షణములో తిరోహితము కానట్టి ఉపమేయమునకని చెప్పకొనినందున సందేహ భ్రాంతిమదపహ్నవాలంకారములకంటె వైలక్షణ్యము చెప్పినట్లైనది. సందేహాద్యలంకారములలో నుపమేయము సందేహముచేత భ్రాంతిచేత నిషేధముచేత తిరోహితమగును కదా. ఇట్లే ఈ లక్షణములో "ఆరోప్యమగు దానితో" నని చెప్పియున్నందున ఉత్ప్రేక్షాదులకంటెను ఉపమాదులకంటెను భేదము వివరించబడినది. ఏమనిన ఉత్ప్రేక్షలోనున్నది అధ్యవసాయము కాని ఆరోపము కాదుకదా! ఉపమాదు లారోపమూలకములే కావు కదా. ఇక నీలక్షణమున "తాద్రూప్యము వర్ణించబడు" నని చెప్పినందున పరిణామాలంకారముకంటె వ్యావృత్తి చెప్పబడినది. పరిణామములో ప్రకృతోపయోగముకొరకు ఆరోప్యమే ఉపమేయరూపముగా పరిణమించునే కాని ఉపమేయమునకు తాద్రూప్యము వర్ణించ బడదు. ఇట్లు సాదృశ్యమూలకములగు నితర సర్వాలంకారములకంటెను ఈ రూపకాలంకారమునకు వేరు విషయము గలదు.

> అస్య చ ప్రథమం త్రయో భేదాః, సావయవం, నిరవయవం, పరంపరితం చేతి। సావయవంచ ద్వివిధం సమస్త వస్తు విషయమేకదేశవివర్తి చేతి। నిరవయవంచ ద్వివిధం, కేవలం మాలారూపం చేతి। పరంపరి

తస్యాపి శ్లిష్ట శబ్ద నిబంధనత్వేన అశ్లిష్ట శబ్ద నిబంధనత్వేన ద్వివిధస్యాపి కేవల మాలారూపభేదాభ్యాం సంహత్య చాతుర్విధ్యమ్। తేన సంభూయాష్ట విధోయ మలంకారః। క్రమేణ – సమస్త వస్తువిషయం యథా–

వివరణ :

ఈ రూపకాలంకారము సావయవ మని నిరవయవ మని పరంపరిత మని మొదట మూడు విధములు. సావయవము కూడ సమస్త వస్తు విషయమని ఏకదేశ వివర్తి యని రెండు విధములు. నిరవయవము కేవల మని మాలారూప మని రెండు విధములు. పరంపరిత రూపకము కూడ కేవల శ్లిష్ట పరంపరితము, కేవలాశ్లిష్ట పరంపరితము, మాలారూప శ్లిష్ట పరంపరితము, మాలారూపాశ్లిష్ట పరంపరితము అని నాలుగు విధములు, ఇట్లే రూపక మెనిమిది విధములు.వరుసగా ఉదాహరణములు–సమస్త వస్తువిషయ రూపకోదాహరణము :–

శ్రీవిశ్వేశ కుమార చంద్ర మవనీపాల స్వఫాలస్థలీ
సమ్మీలత్ కరకంజపుంజ మమలం దిగ్వ్యాపి కీర్తి ప్రభమ్।
విశ్లిష్టాత్మ విరోధి చక్ర మధికశ్లాఘ్యోదయోద్దీపితా
శేషాహ్లాద పయోధి ముజ్జ్వల మిహస్తోతుం విరజ్యేత కః? 41

అర్థము :

అవనీపాల – రాజులయొక్క । స్వఫాలస్థలీ – నెన్నుదట । సమ్మీలత్ – ముడుచుకొనుచున్న । కరకంజపుంజం – చేతులనెడు తామరల సమూహము గల । అమలం – నిర్మలుడునగు । దిగ్వ్యాపి – దిక్కులు వ్యాపించిన కీర్తి యనెడు వెన్నెల గల । విశ్లిష్ట – వేరు చేయబడిన । ఆత్మవిరోధి చక్రం – తన శత్రువులనెడు చక్రవాకములు గల । అధికశ్లాఘ్యోదయ – మిక్కిలి కొనియాడ దగిన తన ఉదయము చేత । ఉద్దీపిత – పెంచబడిన । అశేష – అందరియొక్క । అహ్లాదపయోధిం – సంతోషమను సముద్రము గల । ఉజ్జ్వలం – బాగుగా ప్రకాశించునట్టి । శ్రీవిశ్వేశకుమారచంద్రం – విశ్వేశకుమారుడను చంద్రుని । ఇహ–ఇక్కడ । స్తోతుం – స్తోత్రము చేయుటకు । కః – ఎవడు । విరజ్యేత – వైరాగ్యము చెందును ।

అత్ర అవయవానాం అవయవినశ్చసామస్త్యేన రూపణం కృత మితి సమస్త వస్తు విషయత్వమ్।

వివరణము :

ఇచ్చట రామేశ ప్రభువునకు చంద్రాభేదము చెప్పబడినది. ఇతని సామంతుల చేతులు ముడుచుకొనిన పద్మములుగా పేర్కొనబడినవి. చంద్రుని ముందు పద్మములు ముడుచు

నును గదా. అట్లే ఇతని కీర్తి వెన్నెల ఐన విరోధులు విడగొట్టబడిన చక్రవాకములుగా వర్ణించబడినారు. చంద్రుడు చక్రవాకములకు విశ్లేషము కలిగించును గదా. మరి తన ఉదయము చేత జనులందరిలోను ఉప్పొంగిన ఆనందమునకు సముద్రాభేదము చెప్పబడినది. ఇట్లు ప్రధానమునకును తత్సంబంధులకును రూపకము చెప్పినందున ఇది సమస్త వస్తు విషయ సావయవ రూపకమునకు ఉదాహరణము.

— — —

ఏకదేశ వివర్తి యథా.

ఏకదేశ వివర్తికి ఉదాహరణము.

మిథస్సముల్లాసిత బంధుచక్రః, ప్రోత్సారితారాతి జనాంధకారః,।
హృత ప్రమీలాఖిల నేత్రపద్మః, విభాతి రామేశ్వర సార్వభౌమః।। 42

అర్థము :

మిథస్సముల్లాసిత బంధుచక్రః — పరస్పర సంతోషము కలిగించబడిన బంధువులను చక్రవాకములుగల । ప్రోత్సారితారాతిజనాంధకారః — తొలగించబడిన శత్రుజనులనెడు చీకటి గల । హృత ప్రమీలాఖిలనేత్ర పద్మః—హరించబడిననిద్దుర గల అందరి నేత్రములనెడు పద్మములు గల । రామేశ్వర సార్వభౌమః — రామేశ ప్రభువు । విభాతి — ప్రకాశించుచున్నాడు ।

అత్ర అవయవ నిరూపణాదేవ రామేశ్వర సార్వభౌమస్య సహస్రాంశు తయా అవయవరూపణం గమ్యతే ఇత్యేకదేశ వివర్తిత్వమ్।

వివరణము :

ఇచట బంధువులు చక్రవాకములుగా రూపించబడినారు. వారికి ఉల్లాసముకూడ చెప్పబడినది. మరి చక్రవాకములకు సంతోషము కలిగించువాడు సూర్యుడు కదా ! అట్లే శత్రువులను చీకట్లను తొలగించుట కూడ సూర్యుని కార్యమే. పద్మములుగా రూపించబడిన కనుల నిద్ర హరించువాడు కూడ సూర్యుడే. కనుక ప్రభువును సూర్యునిగా చెప్పకపోయినను ఈ అవయవ రూపణమువలన రాజు సూర్యుడు అను రూపకము తెలియుచున్నది. అందుచే దీనిని ఏకదేశ వివర్తిసావయవ రూపక మందురు.

× × ×

కేవలం యథా-

కేవల నిరవయవ రూపకమున కుదాహరణము.

భవత్ప్రతాపాగ్ని రలీక వృత్తాన్
కుర్వన్ సమాజేషు శిఖావలీఢాన్।
రామేశ కల్పద్రుమ తత్ప్రియాణాం
ముఖేషు సూతే బత కాలిమానమ్॥ 43

అత్ర ప్రతాపాగ్ని రిత్యవయవి నిరూపణమాత్రఏవ కవిసంరంభ విశ్రాంతేరిహ నిరవయవత్వమ్। ఏక దైవరూపణాత్కేవలంచ।

**అర్థము :**

రామేశ కల్పద్రుమ ! — రామేశ కల్ప వృక్షమా ! భవత్ ప్రతాపాగ్నిః — నీ ప్రతాపమను నగ్ని । అలీక వృత్తాన్ — చెడు ప్రవృత్తి గల వారిని । సమాజేషు — సభలలో । శిఖావలీఢాన్ — జ్వాలలచేత ఆక్రమించబడిన వారలనుగా । కుర్వన్ — చేయుచు । తత్ప్రియాణాం — వారి ప్రియురాండ్రయొక్క । ముఖేషు — ముఖముల యందు । కాలిమానం — నలుపును । సూతే — కలిగించుచున్నది । బత — ఆశ్చర్యము ।

**వివరణము :**

ఇచ్చట ప్రతాపమునందు అగ్ని తాద్రూప్యము చెప్పుటయందే కవికి తాత్పర్యము. కనుక ఇది నిరవయవ రూపకము. ఒకే రూపణ మున్నందున ఇది కేవల నిరవయవరూపక మనబడును.

× × ×

నిరవయవ మాలారూపం యథా —

నిరవయవ మాలా రూపకమున కుదాహరణము —

కాంతానాం మీనకేతుః కవివర విదుషాం కల్పవృక్షః కలానాం।
బ్రహ్మా జిహ్మేహిత శ్రీ సరసిరుహతతే రుగ్రనీహార పాతః।
సాధూనా మాప్త బంధుస్సకల గుణగణ శ్రీ గరిమ్ణాంచ సింధుః
శ్రీమద్విశ్వేశగర్భస్తన రసజలధేః కౌస్తుభోయం విభాతి॥ 44

ఇదం నిరవయవ మాలా రూపం, ఏకస్యైవానేకథా నిరూపణాత్।

**అర్థము :**

అయం — ఈ ప్రభువు । కాంతానాం — స్త్రీలకు । మీనకేతుః — మన్మథుడు । కవివర విదుషాం — కవులకు విద్వాంసులకు । కల్పవృక్షః — కల్పతరువు । కలానాం — విద్యలకు ।

బ్రహ్మా — బ్రహ్మదేవుడు । జిహ్మహితశ్రీ — నరసిరుహ తతేః — కపటముగల శత్రువులనెడు కమలముల సమూహమునకు । ఉగ్రనీహారపాతః — ఘోరమగు మంచువర్షము । సాధూనాం — మంచివారికి । ఆప్తబంధుః — ఆప్తబంధువు । సకలగుణగణశ్రీ గరిమ్ణాంచ — అన్ని గుణగణముల విలాసములకు । సింధుః—సముద్రము । శ్రీమద్విశ్వేశగర్భస్తనరసజలధేః — విశ్వేశుని వంశమనెడు పాలసముద్రమునకు । కౌస్తుభః — కౌస్తుభమణిగా । విభాతి — భాసించును ।

వి వ ర ణ ము :

ఇచట ఒకే రాజునందు మీన కేతుత్వాద్యనేక ధర్మములు ఆరోపించబడినందున ఇది మాలారూప నిరవయవ రూపకమని తెలియవలయును.

1తదుక్తం మదీయే భాగవత చంపూ ప్రబంధే కృష్ణం ప్రతి భీష్మవచనమ్

వి వ ర ణ ము :

ఇక్కడ కొంత గ్రంథపాత మేర్పడినట్లున్నది. అది ఇట్లుండ వచ్చును — అథ కేవల శ్లిష్ట పరంపరితం యథా — ఇక కేవల శ్లిష్ట పరంపరిత ముదాహరించబడుచున్నది. అది తన భాగవత చంపూ ప్రబంధములో కృష్ణుని గురించి భీష్మవాక్యముగా రచించబడిన శ్లోకమున కలదని ఆ శ్లోకమును గ్రంథకర్త ఇచ్చియున్నాడు.

గరుత్మాన్ 2 సాయకః కృష్ణలోకేశ ప్రహిత స్త్వయా ।
మూర్ధ్నః కుండలిన శ్శత్రు రాజ్ఞా మాశు నికృంతతి ॥ 45

3 అత్ర సాయకస్య గరుత్మత్వే రూపణం మూర్ధ్నః కుండలిత్వరూపణం ప్రతి నిమిత్త మభూదితి పరంపరితత్వమ్. ఉభయత్రాపి శ్లేషోల్లసనాత్ శ్లిష్ట శబ్ద నిబంధనత్వమ్। ఏకవార మేవరూపణా త్కేవలత్వంచ।

అ ర్థ ము :

లోకేశ — లోకప్రభువగు । కృష్ణ — ఓ కృష్ణా । త్వయా — నీచేత । ప్రహితః — వేయబడిన । గరుత్మాన్ — రెక్కలు గల — గరుడుడగు । సాయకః — బాణము । శత్రు

1. అథ కేవల శ్లిష్ట పరంపరితం యథా -పరిష్కర్త పూరణము. 2. నాయకః 3. అత్ర మూర్ధ్నః కుండలిత్వ రూపణం -మూలప్రతి: 'సాయకస్య గరుత్మత్వె రూపణం -పూరణము

రాజ్ఞాం — శత్రురాజుల యొక్క । కుండలినః — కుండలములు గల — సర్పములగు । మూర్ధ్నః — తలలను । ఆశు — త్వరగా । నికృంతతి — ఛేదించును ।

వి వ ర ణ ము :

కృష్ణుని బాణము శత్రువుల శిరస్సులను ఛేదించును బాణము ఇరువైపుల రెక్కలు గలది. కనుక గరుత్మాన్ అనవచ్చును. గురుత్తులనగా పక్షిరెక్కలు బాణ పత్రములు కూడ కావచ్చును. ఇట్లు బాణమును గరుత్మాన్ అనగా బాణము నందు గరుడ తాద్రూప్య మేర్పడి నది. గరుత్మాన్ అనుదానికి రెండర్థములు చెప్పికొనినందున ఇదియొక శ్లిష్ట శబ్దము. ఈ బాణము శత్రువుల శిరస్సుల ఛేదించును. గరుడుడు. సర్పముల ఛేదించును కదా। అందుచే శత్రు శిరస్సులను 'కుండలినః' అన్నాము. కుండలి శబ్దమునకు కుండలములు కలవి యనియు సర్పములనియు రెండర్థములు కలవు. ఇట్లు శిరస్సులను సర్పములుగా రూపించుటకు బాణము నందలి గరుడ తాద్రూప్యము నిమిత్తమైనది. ఒక రూపకమునకు మరొక రూపకము నిమిత్త మైనది పరంపరితము కదా. ఇది ఒకదానియందొక రూపణ మున్నందున కేవలము. ఇట్లీ శ్లోకము కేవల శ్లిష్ట శబ్ద నిబంధన పరంపరిత రూపకమున కుదాహరణ మగుచున్నది.

భూ భృద్వరోత్పీడన రైణుకేయః
తారా పతి ధ్వంసన కౌసలేయః
హంస ప్రభా సంహార సాంహికేయః
విభాతి రామేశ యశో విలాసః । 46

అత్రయశోవిలాసస్య రైణుకేయత్వాదిరూపణం భూభృద్వరస్య హిమ వతః ఉత్పీడనమేవ, భూభృద్వరాణాం మహీపతిశ్రేష్ఠానాం ఉత్పీడన కారణం జాతమితి పరంపరితత్వమ్ శ్లేష సముల్లాసాత్ శ్లిష్ట శబ్ద నిబంధ నత్వమ్ । ఏకస్య యశోవిలాసస్య అనేకధా రూపణా న్మాలారూపత్వంచ.

అ ర్థ ము :

రామేశ యశో విలాసః — రామేశ ప్రభువుయొక్క యశో విలాసము । భూభృద్వర — హిమాలయము యొక్క — రాజుల యొక్క — । ఉత్పీడన — పీడించుట యందు । రైణుకేయః — రేణుక కొడుకగు పరశురామునిగా । తారాపతి — చంద్రుని యొక్క — తారమగడగు వాలియొక్క ధ్వంసన — వినాశనమునందు । కౌసలేయః — కౌసల్య కొడు

కగు రాముడుగా । హంస ప్రభా — హంస కాంతిని — చంద్ర కాంతిని — పంహార — హరించుట యందు । సౌంహికేయః — రాహువుగా । విభాతి — భాసించును.

వి వ ర ణ ము :

ఇచ్చట కీర్తి విలాసమునందు పరశురామ రఘురామ రాహువుల అభేద మారోపించ బడినది. పరశురాముడు రాజుల పీడించినవాడు. కీర్తి విలాసము తన కాంతితో హిమాల యమును బాధించినది. అనగా మంచుకొండ కన్న కీర్తి తెల్లనిదని తాత్పర్యము । ఇట్లు కీర్తి విలాసమునందు ఆరోపించబడిన పరశురామాభేదము, కీర్తివిలాస మొనరించిన హిమాలయ పీడనమునందు పరశురాము డొనరించిన క్షత్రియ పీడనము యొక్క అభేదారోపమునకు నిమిత్త మగుచున్నది ఇట్లే రఘురామ రాహువుల ఆరోపములు చంద్రధ్వంసనము నందు వాలి ధ్వంసనారోపమునకు హంసకాంతి సంహరణమునందు చంద్రకాంతి సంహరణారోపమునకును వరుసగా నిమిత్తము లగుట జేసి ఈ శ్లోకమున పరంపరిత రూపకాలంకారమగు చున్నది. అదియును 'భూభృద్వర' 'తారాపతి' 'హంస' శబ్దముల శ్లేషమును బట్టి ఏర్పడినదిగావున 'శ్లిష్ట శబ్ద' నిబంధన మగుచున్నది. ఇట్లు ఒకే వస్తువునందు వరుసగా మూడారోపములు చేయబడినందున మాలారూపమును అగుచున్నది. ఇట్టిశ్లోకము మాలా రూప శ్లిష్ట శబ్ద నిబంధన పరంపరిత రూపకాలంకారమున కుదాహరణమగుచున్నది.

.... .... ....

ఇక మాలా రూపాశ్లిష్ట శబ్ద నిబంధన పరంపరిత రూపకాలంకారమున కుదాహరణ మిచ్చుచున్నాడు.

ప్రజృంభ త్ప్రతిపక్ష కీర్తి గరిమ క్షీరాబ్ధి కుంభోద్భవః
ప్రోచ్చం డారి విభూతి ఖాండవవనీ గాండీవ కాండాసనః।
త్వద్భవ్యాశ్రిత వర్గ మానస సరః పూర్త్యభ్ర సంఘ ప్రభః
శ్రీ విశ్వేశ తనూజ తే గుణనిధేః రాజ్ఞా సమాడంబరః॥ 47

ఏవ మష్టవిధ మపి రూపకం నిరూపితమ్। వ్యస్త సమస్తాది భేదానాం పృథ గ్వ్యే చిత్ర్యాభావా దనిరూపణమ్।

అ ర్థ ము :

శ్రీ విశ్వేశ తనూజ । — ఓ విశ్వేశ పుత్రుడా । గుణనిధేః — గుణనిధివగు । తే — నీయొక్క । ఆజ్ఞానమాడంబరః — ఆజ్ఞా విలాసము । ప్రజృంభత్ — పొంగుచున్న । ప్రతిపక్ష - శత్రువుల యొక్క । కీర్తిగరిమ — కీర్తిగౌరవమనెడు । క్షీరాబ్ధి — పాలకడలికి । కుంభో ద్భవః — అగస్త్యుడు । ప్రోచ్చండ — ఘోరమగు । అరి విభూతి — శత్రువుల సంపత్తి

యనెడు । ఖాండవ వనీ — ఖాండవ వనమునకు । గాండీవ కాండాసనః — అర్జునుడు । త్వత్ — నీయొక్క । భవ్యాశ్రితవర్గ — మంచి (ఆశ్రితుల) సమూహమనెడు । మానస సరః — మానస సరస్సు యొక్క । పూరి — నింపుట యందు । అభ్రసంఘ ప్రభః — మేఘముల గుంపు యొక్క కాంతి గలది ।

వి వ ర ణ ము :

ఇచ్చట ఆజ్ఞా విలాసము నందు అగస్త్యాద్యభేద మారోపించ బడినది. ఇది శత్రువుల కీర్త్యాదులయందు సముద్రాద్యభేదారోపమునకు నిమిత్తమగుచున్నది. కనుక నిది పరంపరిత రూపకమున కుదాహరణము. ఒక్క వస్తువునందు ఒకటికి మించిన యారోపములు చేయబడి యున్నందున నిది మాలారూప మగుచున్నది శ్లిష్ట శబ్దములు లేనందున అశ్లిష్ట శబ్ద నిబంధన మగుచున్నది. ఇచట మూడవది మేఘ సంఘాభేదారోప మగును. కాని మేఘ సంఘ ప్రభః అని మూలములో మేఘకాంతి గలదిగా పేర్కొనబడినందున ఈ మూడవ ఆరోపము పొసగు నట్లు లేదు. మూలములో 'మేఘ సంఘః' అని విసర్గాంత పాఠముండిన, 'ప్రభః అని పద విభాగముగాక' 'ప్రభో' యనియే పద విభాగము చేయవచ్చును. అపుడు 'ప్రభో' 'ఓ ప్రభూ' అని అర్థము చెప్పుకొనవలెను. ఈ విధముగా నిపుడు మూడవది యగు మేఘ సంఘాభేదారోపము కూడ పొసగ వచ్చును. ఇట్లు 8 విధముల రూపకములు నిరూపించబడినవి. ఇంకను వాక్యగతములు సమాసగతములు అని విభజించవచ్చును. కాని చమత్కారములో పెద్ద విశేషమేమియు లేదని నిరూపించలేదు.

ఇతి రూపకాలంకార ప్రకరణమ్

—

అథ పరిణామాలంకారః

ఆరోప్యమాణ రూపః పరిణమతి ప్రస్తుతోపయోగాయ।
విషయో యత్రాహు స్తం పరిణామం సద్విధా సమాదిష్టః॥ 48

విషయః ప్రస్తుత కార్యోపయోగాయ ఆరోప్యమాణ రూపతయా పరిణమతి ఇత్యనేన సర్వాలంకార వ్యావృత్తిః। రూపకేఽస్యారోప్యమాణస్య ప్రకృతో పరంజకత్వ మాత్ర విశ్రాంతత్వాత్। సమాసో_వప్యారోప్యమాణస్య ప్రకృతోపయోగిత్వేపి వాచ్యత్వాభావా త్తదభావః। అయమపి సామానాధికరణ్య వైయధికరణ్యాభ్యాం ద్వివిధోభవతి। క్రమేణ-సామానాధికరణ్యం యథా-

వి వ ర ణ ము :

విషయ మనగా ఉపమేయము. అది ప్రకృత యత్కించిత్కార్యమునకు ఉపయోగ పడుటకై ఆరోపించబడు ఉపమాన రూపముగా పరిణమించెనేని దానిని పరిణామాలంకార

మందురు. అదియు రెండు విధములుగా నుండును. రూపకములో నుపమేయము నందు ఉపమానముయొక్క అభేదము ఆరోపించబడును. ఈ అలంకారములోను అట్లే ఆరోపించ బడును. ఐనను రూపకమున ఆరోపణ మాత్రమే కాని ఆరోపించబడిన వస్తువునకు ప్రకృత కార్యోపయోగ మేమియు నుండదు. పరిణామమున ఉపమేయము ఉపమాన స్వరూపముగా పరిణమించి ప్రకృతమగు నేదేని కార్యమున కుపయోగపడును. ఇట్లు ప్రకృతోపయోగమే రూపకమున కంటె పరిణామమునకు భేదము నాపాదించుచున్నది. సమాసోక్తియందు ప్రకృత వృత్తాంతము నందు అప్రకృత వృత్తాంత మారోపించబడును. అదియు వాచ్యముగాదు కనుక సమాసోక్తి కంటెను పరిణామము విలక్షణ మని గ్రంథకర్త యభిప్రాయము.

వస్తుతః సమాసోక్తి యందు వృత్తాంత సమారోపమే కాని పదార్థసమారోపణము లేదు. ఈ ఆరోప్యమాణమగు వృత్తాంతము కూడ ప్రకృతోపరంజకము మాత్రమేగాని ప్రకృత కార్యోపయోగి కాదు. అందుచే సమాసోక్తికంటె పరిణామమునకు భేదము సమర్థించ వలసిన పని లేదు. ఈ పరిణామము గూడ సామానాధికరణ్యేనపరిణామ మని వైయధికరణ్యేనపరిణామ మని రెండు విధములుగా నుండును. వరుసగా నుదాహరణము — సామానాధికరణ్యేనపరిణామమున కుదాహరణము.

> రంభా పరీరంభ విజృంభమాణ కౌతూహలేభ్యో ద్విజపుంగవేభ్యః।
> సంప్రేషితా ధర్మసఖీ త్వయైవ రామేశ భూవాసవ! దక్షిణాఖ్యా॥ 49
>
> అత్ర యాగ దక్షిణా రంభా పరీరంభ రూప ప్రకృత కార్యోపయోగాయ ఆరోప్యమాణ సఖీరూపతయా పరిణమతి। అత్ర సంఖ్యాః కుట్టనీత్వ వర్ణనేన నాయకానాం ధీర లలితత్వం సంగచ్ఛతే।

అర్థము :

రామేశ భూవాసవ — ఓ రామేశ భూమీంద్రా? । రంభా పరీరంభ — రంభ యొక్క ఆలింగనమునందు । విజృంభమాణ — మిక్కుటమగుచున్న । కౌతూహలేభ్యః — కుతూహలము గలయట్టి । ద్విజ పుంగవేభ్యః — విప్రశ్రేష్ఠులకు । త్వయైవ — నీచేతనే । దక్షిణాఖ్యా — దక్షిణ యనెడు । ధర్మసఖీ — ధర్మపత్ని । సంప్రేషితా — పంపబడినది ।

వివరణము :

(ఇచ్చట అర్థ స్వభావముననుసరించి చూడగా మూలమున 'ధర్మ సఖీ' యని కాక 'నర్మసఖీ' యనియుండవచ్చునని పించును)యాగ దక్షిణయందు నర్మసఖీత్వమారోపించబడినది. ఈ ఆరోపిత నర్మసఖి రంభా సంభోగము నభిలషించు వారికి కుట్టినిగా నుపయోగ పడుచున్నది.

అందుచే ఇచట పరిణామము. ఇక సామానాధికరణ్య మనగా ఉపమానోపమేయ వాచక పదము లొకే విభక్తియం దుండుట అని యర్థము. ప్రకృత శ్లోకములో 'సఖీ' 'దక్షిణాఖ్యా' యనుశబ్దము లట్టివి. కనుక నిది సామానాధికరణ్యేన పరిణామ మని తెలిసికొనవలెను.

వైయధికరణ్యం యథా:—

రచితా కౌముదీ కీర్త్యా తవాఽమ్మన్నసురద్రుమ।
దారిద్ర్య తిమిరాంధానాం సతాం లోచన సంముదే॥ 50

అత్రాపి కౌముదీత్వేన పరిణతయాః కీర్త్యేః ప్రస్తుత లోచనాహ్లాద కార్యోపయోగిత్వమ్। ఇతి పరిణామాలంకారః।

ఆర్థము:

అమ్మన్న సురద్రుమ! — ఓ అమ్మన్న కల్ప వృక్షమా। తవ — నీ। కీర్త్యా — కీర్తి చేత। దారిద్ర్య తిమిరాంధానాం — దారిద్ర్యమనెడు చీకటితో గుడ్డివారైన। సతాం — సజ్జనుల యొక్క। లోచన సంముదే — కనుల సంతోషపరుచుటకు। కౌముదీ — వెన్నెల। రచితా — రచించబడినది.

వివరణము:

ఇచ్చట కీర్తియందు ఆరోపించబడిన వెన్నెల కనుల సంతోషపరుచుటయను ప్రకృత కార్యమున కుపయోగించినది. అందుచే ఇది పరిణామాలంకారము. వైయధికరణ్య మనగా ఉపమానోపమేయవాచక దపములు భిన్న విభక్తికములుగా నుండుట యని తాత్పర్యము. ఇచట 'కీర్త్యా', 'కౌముదీ' అను రెండు శబ్దము లట్టివి యని తెలిసికొనవలెను. ఇచట అంధులకు లోచన సమ్మోదము బాధితము.

అవధేయ విశేషము

ఈ పరిణామాలంకార ప్రతిపాదన పద్ధతి విలక్షణముగా నున్నది. సాధారణముగా పరిణామ మనగా మార్పు జెందుట యని అర్థము. ఉపమానము ప్రకృత కార్యోపయోగమునకై ఉపమేయముగా మార్పు జెందుట పరిణామాలంకార మని సాధారణముగా సర్వాలంకారికులు నిర్వచించుచున్నారు.

'పరిణామః క్రియార్థశ్చేత్ విషయీ విషయాత్మనా। ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా' అను చంద్రాలోకము నందలి పరిణామ లక్షణ లక్ష్యములను పరిశీలించిన మనకు పైవిషయము

స్పష్టమగును. ఉపమానము ప్రకృత కార్యమున కుపయోగించుటకై ఉపమేయముగా పరిణమించుట పరిణామమని ఈ శ్లోకములోని లక్షణార్థము. ఒక మదిరేక్షణ దృగబ్జముతో చూచుచున్నదని ఇచట పరిణామ ముదాహరింపబడినది. ఇచట దృక్కు-ఉపమేయము. అబ్జము ఉపమానము. ఈ ఆరోప్యమాణమగు అబ్జము యొక్క తాద్రూప్యము దృక్కునకు చెప్పబడి నందున ఇచ్చట రూపకము కావచ్చును. కానీ దృక్కు అబ్జ తాద్రూప్యమును పొంది అబ్జమే యైన యెడల దానికి చూచుచున్నది యను ప్రకృత క్రియతో అన్వయమే కుదరదు. అందుచే ఇచటి ఉపమేయమైన దృక్కుగా ఉపమానమగు అబ్జము పరిణమించవలసి యున్నది. ఇట్లు పరిణమించి ప్రకృతమగు వీక్షణమున తాను కరణముగా నన్వయించగలదు. కనుక నిచట ప్రకృత కార్యమున కుపయోగించుటకొరకు ఉపమేయముగా ఉపమానము మార్పు చెందుట యను లక్షణము కుదిరి ఇది పరిణామాలంకార మగుచున్నది. పండితరాజ పర్యంత మాలంకారికు లందరును ఇట్లే పరిణామము నుదాహరించి యున్నారు. ప్రకృత గ్రంథములో ఆరోపించబడిన నర్మసఖి మరియు వెన్నెల ఉపమేయములగు యాగ దక్షిణా కీర్తుల రూపముగా పరిణమించ కయే ప్రకృత కార్యమున కుపయోగ పడుచున్నవి. కనుక పైన పేర్కొనబడిన పరిణామ లక్షణోదాహరణములు ప్రాచీన గ్రంథ సంవాద దూరములుగా నున్నవని గమనించవలెను. విస్తరము పీఠికలో చూడుడు.

అథ సందేహాలంకారః

> కవి సమ్మత సాదృశ్యాత్ విషయో విషయీ చ యత్ర సందిగ్ధౌ।
> తత్రస్యాత్సందేహాలంకారః సోఽపి భిద్యతే త్రేధా॥ 51

> కవి సమ్మత సాదృశ్యా దిత్యనేన స్థాణు ర్వా పురుషో వేత్యాది సందేహ వ్యావృత్తిః తత్ర కవి ప్రతిభా సంరంభ మంతరేణైవ స్వరస వాహితయై వతత్ప్రవృత్తేః అయం త్రిధా భిద్యతే - శుద్ధః నిశ్చయగర్భః నిశ్చయాంతశ్చ ఇతి- తత్రాదౌ శుద్ధో యథా-

అర్థము :

యత్ర — ఎక్కడ । కవి సమ్మత సాదృశ్యాత్ — కవి సమ్మతమగు సాదృశ్యమును బట్టి । విషయః — ఉపమేయము । విషయీచ — ఉపమానము కూడ । సందిగ్ధౌ — సందేహ విషయము లగునో । తత్ర — అచ్చట । సందేహాలంకారః — సందేహాలంకారము । స్యాత్ — అగును । సోఽపి — అదియు । త్రేధా — మూడు విధములుగా । భిద్యతే — భిన్నమగుచున్నది.

వి వ ర ణ ము :

కవి సమయమువలన నేర్పడిన సాదృశ్యమును బట్టి ప్రకృత వర్ణనా విషయమగు వస్తువు దాని యుపమానముకాదగిన వస్తువుగా సందేహించబడెనేని అపుడు ప్రకృతా ప్రకృతములు రెండును సందేహ విషయములే యగును. అట్టిచోట సందేహాలంకారము. ఈ లక్షణములో కవి సమ్మత సాదృశ్యమును బట్టి అని యున్నందున సాధారణముగా కలుగు "మ్రానా" "మనిషియా" అను సందేహము అలంకారము కాదని, ఆ సందేహముకంటె ఈ యలంకారము విలక్షణమైనదని ఏర్పడును. మ్రానా, మనిషియా యని సందేహము కలుగుటకు కవి ప్రతిభ అవసరము లేదుగదా. ఈ సందేహాలంకారము శుద్ధమని, నిశ్చయ గర్భమని, నిశ్చయాంతమని మూడువిధములుగా నుండును. మొదట శుద్ధ సందేహమున కుదాహరణము—

కిమేష ధనదేశ్వరో (సమ్మదా) వితరతి ద్విజేభ్యో ధనం
కి మేష మహసాంనిధి ర్విజయతే ప్రతాపోదయైః।
కిమేష రజనీకరః కువలయే తనోతి శ్రియం
జనైరితి విభావ్యతే జగతి విశ్వనాథాత్మజః॥

అత్ర సందేహ మాత్రస్య పర్యవసా నాచ్ఛుద్ధత్వమ్। 52

అ ర్థ ము :

ఏషః — ఇతడు । ధనదేశ్వరః కిం — కుబేర ప్రభువా ఏమి । ద్విజేభ్యః — విప్రులకు ధనం — ధనమును । వితరతి — ఇచ్చుచున్నాడు । ఏషః — ఇతడు । మహసాంనిధిః కిమ్ — తేజోనిధియగు సూర్యుడా ఏమి । ప్రతాపోదయైః — ప్రతాపాభ్యుదయములచేత । విజయతే — అందరికన్న మిన్నగా నున్నాడు । ఏషః — ఇతడు । రజనీకరః కిం — చంద్రుడా ఏమి । కువలయే — భూమియందు (కలువయందు)। శ్రియం — శోభను । తనోతి పెంచుచున్నాడు । ఇతి — అని । జగతి — ప్రపంచమునందు । జనైః — జనులచేత । విశ్వనాథాత్మజః — విశ్వనాథ ప్రభువు కుమారుడు । విభావ్యతే — అనేక విధములుగా అనుకొనబడుచున్నాడు ।

వి వ ర ణ ము :

(శ్లోకములో ధన తరువాత సమ్మదా యని ఉన్నది. అర్థము కుదరనందున దేశ్వరో యని వ్రాయబడినది) ఇచట రామేశ ప్రభువు వర్ణనావిషయమగువాడు. కుబేరాదు లుపమానములు కాదగినవారలు. వీరలు సందేహ విషయములైనారు. కనుక నిది సందేహాలంకారము. కేవల సందేహమునందే పర్యవసానము కనుక నిది శుద్ధ సందేహాలంకారమునకుదాహరణము.

నిశ్చయ గర్భో యథా:—

నిశ్చయ గర్భ సందేహాలంకారమున కుదాహరణము:—

దేవేంద్రః కి మయం స చే ద్వితనుచే గోత్ర ప్రభేదం సదా
మందారః కి మయం స చే దపగత స్వాస్థ్యాయ నాభీష్టదః।
శీతాంశుః కి మయం స చే దకమ లోల్లాసీతి విఖ్యాపితః
సర్వత్రేతి వితర్క్యతే బుధజనైః రామేశ్వరాఖ్య ప్రభుః॥ 53

అత్ర సమాన ధర్మాతిరిక్త విశేష ధర్మోల్లేఖాత్ నిశ్చయ గర్భత్వమ్।

అర్థము :

అయం — ఇతడు । దేవేంద్రః కిం — ఇంద్రుడా । స చేత్ — ఆ ఇంద్రుడే ఐన । సదా — ఎల్లప్పుడు । గోత్ర ప్రభేదం — పర్వత భేదమును— వంశ భేదమును । వితనుతే — చేయును । అయం — ఇతడు । మందారః కిం —కల్ప వృక్షమా ఏమి । స చేత్ – ఆ వృక్షమే ఐన । అపగత స్వాస్థ్యాయ — స్వర్గ నివాసము లేని వానికి — తనయధీనమున లేనివానికి । అభీష్టదః — ఇష్టముల నిచ్చునది। న — కాదు । అయం — ఇతడు । శీతాంశుః కిం — చంద్రుడా ఏమి । సచేత్ — ఆచంద్రుడే ఐన । అకమలోల్లాసీ — కమలములకు వికాసము కలుగ జేయడు — లక్ష్మీ విలాసము లేనివాడు । ఇతి — అని । విఖ్యాపితః — విరుద్ధప్రసిద్ధిపొందించ బడిన । రామేశ్వరాఖ్య ప్రభుః — రామేశుడను ప్రభువు । బుధజనైః — విద్వాంసులచేత । సర్వత్ర — అందరి విషయములోను । ఇతి — పైన పేర్కొనిన ప్రకారముగా । వితర్క్యతే— వివిధముగా సందేహించబడుచున్నాడు।

వివరణము:-

(ఇచ్చట "సమాన'' యను పదము మూలములోలేదుకాని అవసరమని వ్రాయబడినది.) ఇట ప్రభువు ఇంద్రాది రూపముగా సందేహించ బడినాడు. కాని ఇంద్రాదులకంటె విరుద్ధ ధర్మాలు ప్రభువునందు కనిపించినవి. ఇంద్రుడు గోత్ర భేదము చేయును. ప్రభువు గోత్ర వర్ధనుడు కాని గోత్ర భేది కాడు. ఇట్లే మందార చంద్రులకంటెను విరుద్ధ ధర్మములు ప్రభువునకున్నందున సందేహము సందేహ మాత్రమున పర్యవసించక, నిశ్చయమును గూడ స్పష్టముగా చెప్పక నిశ్చయ గర్భ సందేహాలంకార మగు చున్నది.

నిశ్చయాంతో యథా:—

నిశ్చయాంత సందేహాలంకరమున కుదాహరణము:—

హేమాద్రిః కి మయం నహీష దపి యం సంశ్రితాసిన స్సంశ్రితాః
దిగ్దంతీ కి మయం నహి ప్రసహతే భవ్యం హరే ర్నామ సః।
భోగీంద్రః కిమయం నహి ప్రకుపితో లోకే సయజ్జిహ్మగః
సందిహ్యేతి చిరాయ రామవిబుధః పశ్చా ద్వినిశ్చీయతే॥ 54

అత్ర విశేష ధర్మోల్లేఖ మాత్రాతిరేకేణ అయమే వేత్యంతే నిశ్చయా దయం నిశ్చయాంత స్సందేహః ।

**అర్థము :**

ఇచట మొటటి పాదములో 'సంత్రాసిన ః'అనుపదము ఉపపన్నముగా కనుపించనందున 'సన్యాసినః' అను పదమును తత్ స్థానములో పఠించి అర్థము వ్రాయబడుచున్నది. అయం — ఇతడు । హేమాద్రిః కిం — బంగారు కొండయా । ఈషదపి —కొంచెము కూడ । నహి — కాదు । యం — ఏ ఇతనిని- సన్యాసినః — విరాగులు । సంశ్రితాః — ఆశ్రయించి యున్నారో । అయం — ఇతడు । దిగ్దంతీ కిమ్ — దిగ్గజమా । నహి — కాదు । సః ఆ ప్రభువు । భవ్యం — కల్యాణ మగు । హరేః — విష్ణువుయొక్క, సింహముయొక్కయు నామ — పేరును । ప్రసహతే — సహించుచున్నాడు । అయం — ఇతడు । ప్రకుపితః — కోపగించిన । భోగీంద్రః కిమ్ — నాగుబాము (శేషుడా)। నహి —కాదు ।యత్ —ఎందుకన। నః — ఆ నాగుబాము । లోకే — లోకమున । జిహ్మగః — కుటిల గతి గలది, కపట ప్రవర్తన గలది । ఇతి — ఈ ప్రకారముగా । సందిహ్య — సందేహించి । పశ్చాత్ — తరువాత । చిరాయ — చాలకాలమునకు । రామవిబుధః — రామేశుడు । వినిశ్చీయతే నిశ్చయించబడు చున్నాడు.

**వివరణము :-**

ఇచట ప్రభువును బంగారు కొండగా, దిగ్గజముగా,నాగేంద్రముగా సందేహించివాని వాని విరుద్ధ ధర్మముల విశేష దర్శనముతో చివరకు ప్రభువని నిశ్చయించుట జరిగినది. కనుక నిది నిశ్చయాంత సందేహాలంకారమగుచున్నది. బంగారు కొండను ఐశ్వర్యార్థులు భోగులు ఆశ్రయింతురు. కాని విరాగులు ఆశ్రయించరు. ప్రభువును విరాగులు కూడ సత్సంగ మను బుద్ధితో నాశ్రయించి యున్నారు. కావున నితడు హేమాద్రికాదు. ఇట్లే దిగ్గజము హరి — సింహ — నామమును సహించదు. ప్రభువు హరి - విష్ణు —నామమును సహించును. కనుక నితడు దిగ్గజము కాదు. మరి నాగుబాము కుటిలగతి — వంకరగా పోవునది ప్రభువుకుటిల గతికాక ఋజు వర్తనుడు. అందుచే నాగుబాము కాదు. ఇట్లు చివర నిశ్చయము కలిగి యున్నదని తెలిసికొనవలయును.

ఇతి సందేహాలంకారః

అథ భ్రాన్తి మదలంకారః:—

ఇక భ్రాంతి మదలంకారము:—

కవి కుల సమ్మత సామ్యాత్ విషయే పిహితాత్మని స్ఫురే ద్యత్ర।
ఆరోప్యమాణ గోచర విజ్ఞానం భ్రాంతిమంత మాహుస్తమ్॥ 55

అతస్మిం స్తద్రూపావభాసః భ్రాంతిః। తద్వాన్ భ్రాంతిమాన్। కవి సమ్మత సాదృశ్య మూలత్వేప్యస్య తతోల్లేఖాభావాత్ విరోధ పూర్త్యభావాచ్చ।

స స్మరణ సందేహాంతర్భావ సందేహః । యథా—

**అర్థము:**

యత్ర — ఎక్కడ। పిహితాత్మని — ఆచ్ఛాదించ బడిన స్వరూపము గల । విషయే — ఉపమేయమునందు । కవికుల సమ్మత సామ్యాత్ — కవి సముదాయమున కభిమతమగు సాదృశ్యమును బట్టి। ఆరోప్యమాణగోచర విజ్ఞానమ్ — ఉపమాన విషయక జ్ఞానము స్ఫురేత్ — కలుగునో । తం — దానిని । భ్రాంతిమంతం — భ్రాంతి మదలంకారముగా ఆహుః — చెప్పుదురు ।

**వివరణము:**

ఉపమేయమును విడిగా గుర్తించనపుడు ఉపమేయము యొక్క స్వరూప మాచ్ఛాదించ బడినదిగా తెలిసికొనవలెను. అట్టి ఉపమేయమును ఉపమాన స్వరూపముగానే భావించి తరను గుణ ప్రవృత్త్యాదులు ఏర్పడినట్లుగా వర్ణించబడిన నది భ్రాంతిమదలంకార మగును. అది కాని దానియందు తద్రూపముయొక్క జ్ఞానమును భ్రాంతి యందురు. సర్పము కాని త్రాడు నందు సర్పస్వరూప జ్ఞానము భ్రాంతి. ఐనను ఈ సర్పభ్రాంతి కవి సమ్మత సామ్యమును బట్టి ఏర్పడినది కాదు. కనుక నిది యలంకారము కాదు. సామ్యమున్నప్పటికిని ఆ స్మరణ సందేహములయం దున్నట్లుగా ఇందు స్మృతి సందేహములు చెప్పబడనందున, విశేష దర్శనముతో (విరుద్ధ ధర్మ జ్ఞానముతో) విరోధము గూడ పూర్తిగా వర్ణించ బడనందున ఈ భ్రాంతి మదలంకారమును స్మృతి సందేహాలంకారములలో అంతర్భావింప చేయు ప్రసక్తిలేదు.

ఈ భ్రాంతిమదలంకారమున కుదాహరణము —

జిహ్వా శ్చంచలయంతి కంచుకి గణా దుగ్ధైక బుద్ధ్యా ముహుః
సప్తాంభోనిధయః స్పృశంతి గగనం జ్యోత్స్నాధియా సర్వదా।

కించి త్కుంచిత చంచు రంచతి బిసభ్రాంత్యాజ పక్షీశ్వరః
శ్రీరామేశ యశో విలాస విభవే లోకత్రయ వ్యాపిని॥ 56

అర్థము :

శ్రీరామేశ యశో విలాస విభవే – రామేశ ప్రభువు కీర్తి విలాస సమృద్ధి । లోకత్రయ వ్యాపిని – మూడు లోకముల యందును వ్యాపించుచుండగా । కంచుకి గణాః – కంచుకి జనుల సమూహములు । దుగ్ధైక బుద్ధ్యా – పాలు అను భావనతో । ముహుః – మాటి మాటిక । జిహ్వాః – నాలుకలను । చంచలయంతి – కదల్చుచున్నారు । సప్తాంభోనిధయః – ఏడు సముద్రములు । సర్వదా – ఎల్లప్పుడు । జ్యోత్స్నా ధియా – వెన్నెల యను భావనతో । గగనం – ఆకాశమును । స్పృశంతి – తాకుచున్నవి । అజ పక్షీశ్వరః – బ్రహ్మదేవుని వాహనసమగు హంస । బిస భ్రాంత్యా – తామరతూడు లను భ్రమతో । కించిత్కుంచిత చంచుః – కొంచెము వంచిన ముక్కు గలదియై । అంచతి – తిరుగును ।

వివరణము :

ఇచట కీర్తి స్వరూప మాచ్ఛాదితమై కంచుకి జనమునకు పాలుగా సముద్రములకు వెన్నెలగా, హంసకు తామరతూడుగా గోచరించినది. ఆ భ్రమ కనుగుణముగా నాలుకలు కదల్చుటయు, ఆకాశమెత్తు పొంగుటయు, ముక్కు వంచుటయు అను ప్రవృత్తులు కూడ వర్ణించబడినవి కనుక నిది భ్రాంతి మదలంకారము.

ఇతి భ్రాంతి మదలంకారః

---

అథోల్లేఖా లంకారః–

ఇక ఉల్లేఖాలంకారము:–

శ్లేషార్థయోగ రుచిభిః స్యా దేకస్యాప్యనేకధోల్లేఖః।
యత్రి గ్రహీతృ భేదా దుల్లేఖం నామ తం బుధా బ్రువతే॥ 57

వివరణము :

శ్లేషమును బట్టి గాని, అర్థము కుదురుటను బట్టి గాని, తమ రుచిని బట్టి గాని ఒకే వ్యక్తిని అనేకులు అనేక విధములుగా అనుకొనినట్లు వర్ణించబడెనేని అది ఉల్లేఖాలంకార మని తెలియవలెను. ఇది సాధారణముగ రెండు రకములుగ నుండును. ఒక్కరే అనేక

విధములుగా ననుకొనుట అనేకులు అనేకవిధములుగా ననుకొనుట యని. ఈ గ్రంథకర్త రెండవ రకమునకు జెందిన ఒక్కదానిని మాత్రమే ఉదాహరించుచున్నాడు :—

అర్థయోగ రుచిభ్యాం యథా:-

పుమాకృతి ర్వాగితి సత్కవీంద్రాః
ధర్మశ్చ సాకార ఇతి ద్విజేంద్రాః ।
లక్ష్మీ విలాస స్తనుమానితి క్ష్మా
నాథా స్సదాఽమ్మన్న విభుం స్తువంతి ॥ 58

అర్థము :

సత్కవీంద్రాః — మంచి కవులు । పుమాకృతిః — పురుషాకారముగల । వాక్ — సరస్వతి । ఇతి — అని । ద్విజేంద్రాః — విప్రోత్తములు । సాకారః — రూపుదాల్చిన । ధర్మః — ధర్మము । ఇతిచ — అనియు । క్ష్మానాథాః — భూపతులు । తనుమాన్ — దేహ ధారియగు — లక్ష్మీవిలాసః — లక్ష్మీ విలాసము । ఇతి — అని । సదా — ఎల్లపుడు । అమ్మన్న విభుం — అమ్మన్న ప్రభువును । స్తువంతి — స్తుతించుచున్నారు ।

వివరణము :

అర్థము ప్రజ్ఞాదిరూపము కుదురుటను బట్టియు తమ తమ రుచిని బట్టియు కవులు మొదలగువారు అమ్మన్న ప్రభువును వాగ్దేవతాది రూపమున అనేక విధములుగా నుల్లేఖించుట చేత నిది ఉల్లేఖాలంకార మగుచున్నది.

ఇతి ఉల్లేఖాలంకారః

---

అథా పహ్నవాలంకారః :-

ఇక అపహ్నవాలంకారము :—

విషయాపహ్నుతి సహితం విషయిణ ఆరోపణం భవేద్యత్ర।
కవయోఽపహ్నుతి మాహుః తామేతస్యా స్త్రియో భేదాః॥ 59

1. ఆరోప తిరస్కారాపహ్నుతిః 2. ఆరోప పూర్వికాపహ్నుతిః.
3. ఛలాదిశబ్దై రసత్యత్వ ప్రతిపాదనరూపా చేతి.

1. ఆరోప తిరస్కారాపహ్నుతి ర్యథా:—

వి వ ర ణ ము :

ఉపమేయస్వరూపాచ్ఛాదనతో ఎక్కడ ఉపమానమారోపించబడునో అది అపహ్నవాలంకారము. అదియు విషయ తిరస్కార రూపము, ఆరోప పూర్వకము, ఛల కపటాది శబ్దములతో అసత్యత్వ ప్రతివాదనరూప మని మూడు విధములు.

మొదటిదానికి ఉదాహరణము :—

వికాసి నీలోత్పల కాంతి కోమలః
కలానిధౌ వేష న కృష్ణ రోహితః।
వృథైష రామేశ యశః స్థితావితి
స్ఫుటో మషీబిందు రజేన రోపితః॥ 60

అత్ర న కృష్ణ సార ఇత్యపహ్నుత్యనంతరం మషీ బిందో రా రోపః కృత ఇతి ఆరోప తిరస్కారాపహ్నుతిత్వమ్।

అ ర్థ ము :

వికాసి నీలోత్పల కాంతి కోమలః — వికసించు నల్ల కలువ కాంతివలె అందమగు। కలానిధౌ — చంద్రుని యందలి। ఏషః — ఈ నలుపు। కృష్ణరోహితః — కృష్ణమృగము న — కాదు। రామేశ యశః స్థితౌ — రామేశుని కీర్తి యుండగా। ఏషః — ఈ చంద్రుడు। వృథా — వ్యర్థము। ఇతి — అని। అజేన = బ్రహ్మదేవునిచేత। స్ఫుటః — స్పష్టమగు। మషీ బిందుః —మసియొక్క చుక్క। రోపితః — ఉంచబడినది।

వి వ ర ణ ము :

చంద్రుని యందలి నలుపు జింక యని కొంద రందురు. కాని అది కృష్ణ మృగము కాదు. మరే మన రామేశ ప్రభువు కీర్తి యుండగా చంద్రుని యవసరములేదని బ్రహ్మదేవుడు తాను సృష్టించిన చంద్రునిపై పెట్టిన నల్లని మసి బిందువు అని కృష్ణమృగమును తిరస్కరించి మసి బిందువు యొక్క ఆరోవము చేయబడినందున నిది మొదటి అపహ్నవము.

ద్వితీయో యథా :

రెండవ రకము అపహ్నుతికి ఉదాహరణము :—

– – – – –
– – – – భోగో న చాయం శశీ।
ముదాశ్రి కాలియ శాసనాంఘ్రి కమల ద్వంద్వస్య నాయం మృగః
స్ఫూర్జద్ధాటకపేటికా పున రిదం నాండం చ పైతామహమ్॥

అత్రాదౌ ఫణికాయ ఇత్యారోపానంతరం నేయం గంగే త్యపహ్నవః కృత
ఇతి ఆరోప పూర్వకాపహ్నుతిత్వమ్।

**అర్థము :**

(ఇచ్చట మొదటి పాదము, రెండవ పాదములో అధిక భాగము గ్రంథపాతమైనది). ఇచ్చట సర్పమును గంగయం దారోపించి తరువాత ఇది గంగ కాదని యనుటచే ఆరోప పూర్వకాపహ్నవ మనబడును. ఇట్లే మూడవ పాదమున చంద్రుని యందలి నలుపు కృష్ణుని అడుగు జాడలే కాని జింక కాదని, 4వ పాదములో ఇది బంగారు పెట్టెయే కాని బ్రహ్మాండము కాదని వర్ణించి యున్నందున నిది ఆరోపపూర్వకాపహ్నుతికి ఉదాహరణము.

ఛలాది శబ్దై రసత్యత్వ ప్రతిపాదన రూపాయథా:-

ఛలాది శబ్దములతో నసత్యత్వమును ప్రతిపాదించునట్టి మూడవది యగు అపహ్నుతి

**ఉదాహరణము :—**

రామేశ విప్రేంద్ర భవచ్ఛలేన ప్రకాశతే పన్నగ సార్వభౌమః।
నచేత్కథం విశ్వపతి (తే) ర్భుజంగః కథం చ భోగై ర్బహుభి ర్విభాసి॥ 61

**అర్థము :**

రామేశ విప్రేంద్ర — రామేశ విప్రోత్తమా । భవచ్ఛలేన — నీనెపముతో । పన్నగ సార్వభౌమః — ఆదిశేషుడు । ప్రకాశతే — భాసించుచున్నాడు । నచేత్ — కాని యెడల । విశ్వపతిః — భూపతివగు నీవు । కథం — ఎట్లు । భుజంగః — పాము వగుదువు — విటుర వగుదువు । కథంచ — మరి యెట్లు । బహుభిః — అనేకములగు । భోగైః — కుబుసముల చేత — భోగముల చేత । విభాసి — ప్రకాశింతువు ? ।

**వివరణము :**

రామేశప్రభు వను నెపముతో ఆదిశేషుడే భాసించుచున్నాడు. కానిచో ఈ భుజంగత్వము, ఈ బహు భోగవత్త్వము ప్రభువున కెట్లు కుదురును—అని తాత్పర్యము. ఇచ్చట భుజంగత్వ మనగా విటత్వము—సర్పత్వము అని రెండర్థములు. రాజునందుగల విటత్వమును సర్పత్వార్థమైన సానముచే నేకము చేసిన సర్పత్వమను ధర్మ మొక్కటియే యగును. అది సర్పమునకే కాని రాజునకు కుదరదు. అందుచే రాజు వస్తుతః రాజుకాదు — ఆదిశేషుడే యని ఛల శబ్దముచేత రాజున కసత్యత్వము చెప్పబడినది. ఇట్లే భోగపదమునకు కుబుసమనియు, సుఖమనియు

నర్థము. కుటుసము కూడ రాజునకు కుదరదు. కనుక రాజు ఆదిశేషుడే యని అర్థము, ఇట్లిది మూడవ అపహ్నుతికి ఉదాహరహరణ మగుచున్నది, మూలములో 'తే' యను దానిని అర్థసౌకర్యమునకు 'తి' యని సవరించనైనది.

ప్రథమో యథావా :-

మొదటి రకపు అపహ్నుతికి మరియొక ఉదాహరణము

[1]నేయం భూర్యువయో స్స్వధర్మవిలసత్కీర్త్యోస్తు వైవాహికీ
[2](వేదీ నాంబర) మావితాన లలితం భూభృత్తటం చత్వరమ్।
నేయం తారకసంహతి ర్విరచితా ముక్తావలీ నో శశీ
గుచ్ఛస్తత్ర నివేశిత స్స మధుపో నాంకస్తు రామప్రభో॥ 62

అర్థము :

ఈ శ్లోకము మొదటి పాదములో ''భూ'' తరువాత నాలుగక్షరములు లేవు. ఆ నాలుగక్షరములను ''యువయోస్స్వ'' అని పూరించికొని అర్థము వ్రాయబడుచున్నది. అట్లే రెండవ పాదములోని మొదటి ఐదక్షరములు తికమకగా నున్నవి వానిని అథోదీపికలో సూచించి అర్థమునకు సరిపోవు నక్షరములు కూర్చబడినవి. ఇక అర్థము.

ఇయం – ఇది। భూః – భూమి। న–కాదు। రామప్రభో – ఓ రామేశ ప్రభూ। తు – కాని। స్వధర్మవిలసత్కీర్త్యోః స్వధర్మానుష్ఠానముచేత ప్రకాశించు కీర్తిగల। యువయోః – మీదంపతులయొక్క। వైవాహికీ – వివాహమునకు సంబంధించిన। వేదీ – గద్దియ। (తత్ – అది। ఈపదము శ్లోకమున లేదు ఐనను చేర్చుకొని అర్థము చెప్పుకొనవచ్చును) అంబరం – ఆకాశము। న –కాదు। ఆవితాన లలితం – అంతటను వితానము యొక్క శోభకలిగిన। భూభృత్తటం – పర్వతము యొక్క ఉన్నత ప్రదేశము। చత్వరం – ఇంటి ముంగిలి భాగము। ఇయం – ఇది। తారక సంహతిః – నక్షత్ర సముదాయము। న – కాదు। విరచితా – కూర్చబడిన। ముక్తావలీ – ముత్తెముల హారము। (అయం – ఇతడు। ఈ పదము చేర్చుకొనబడినది) శశీ – చంద్రుడు। నో – కాదు। తత్ర – అక్కడ। నివేశితః – ఉంచబడిన। గుచ్ఛః – పూలగుత్తి। సః – అది। అంకస్తు – కళంకము మాత్రము। న – కాదు। మధుపః – తుమ్మెద।

1. నేయం భూ............ 2. వేదానింబరమా

వి వ ర ణ ము :

ఇందు మొదట ఇది భూమి కాదని నిషేధించి పిదప వివాహవేదియని ఆరోపించబడి నందున మొదటిరక మపహ్నుతియే అలంకారము. ఐనను కవికి ఈ శ్లోక భావములోని రామణీయకముగూడ ప్రకాశింప చేయవలెనను భావమేర్పడి మరల నుదాహరించుట జరిగినది. వస్తుతః భూమి పెండ్లి గద్దెయని, ఆకాశము పందిరి యని, నక్షత్రములపంక్తి ముత్యాల సరాలని, చంద్రుడు వానిలోని పూలగుత్తి యని కళంకమందులోని తుమ్మెద యని తెలుపు నీభావము కడురమణీయముగా నున్నది గదా !

ప్రాచీనాలంకారికులు ఈ సందర్భమున నుదాహరించు నీశ్లోకమిచట గుర్తుకు రాక మానదు గమనింతుము గాక !

"నేదం నభోమండల మంబురాశిః నేమాశ్చ తారాః నవఫేనపుంజాః।
నాయం శశీ కుండలితః ఫణీంద్రః నాయం కళంక శ్శయితో మురారిః॥"

ఇది ఆకాశము కాదు, సముద్రము. ఇవి తారలు కావు, నురుగులు. ఇతడు చంద్రుడు కాడు, గుండ్రముగా చుట్టుకొనిన ఆదిశేషుడు. ఇది కళంకము కాదు. పడుకొనిన విష్ణువు. అని పై శ్లోక తాత్పర్యము.

## అథ ఉత్ప్రేక్షాలంకార ప్రకరణమ్

అన్యత్వా ధ్యవసాయో యత్ర ప్రకృతస్య ధర్మ సంబంధాత్।
ఉత్ప్రేక్షా సా కథితా జాత్యాదిభ్యో భవే చ్చతుర్భేదా॥ 63

అధ్యవసాయస్య ఆరోపాంతర్గతత్వాత్ ఆరోపగర్భాలంకారనిరూపణానన్తరం ఉత్ప్రేక్షా నిరూపణం యుక్తమ్। అభిన్నత్వ ప్రతీతి రధ్యవసాయః। అస్య చ నిమిత్తమనుగత ధర్మ సంబంధః । ధర్మః క్వచిద్గుణః, క్వచిత్ క్రియాభవతి, తథాచాయ మధ్యవసాయః। జాతిగుణ క్రియా ద్రవ్య గోచరత్వేన చతుర్విధోఽభవన్। తా మపి చతుర్ధా వ్యవస్థాపయతి। తత్ర జాత్యుత్ప్రేక్షాయాః స్వరూప హేతుఫలత్వాకారైః ప్రథమం త్రైవిధ్యమ్। తత్రాపి స్వరూపోత్ప్రేక్షాయాః భావాభావ రూపతయా ద్వివిధాయా అపి నిమిత్తోపాదానానుపాదానాభ్యాం ద్వైవిధ్యే చాతుర్విధ్యమ్।

ఏవమేవ గుణ క్రియా ద్రవ్యాణామపి ప్రత్యేకం చాతుర్విధ్యే ద్వాదశ విధత్వమ్। వాచ్యోత్ప్రేక్షాయాః వాచకాస్తు మన్యే శంకే ఇత్యేవ మాదయః। తదుక్తమ్ –

మన్యే శంకే ధ్రువం నూనం ప్రాయ ఇత్యేవ మాదయః।
ఉత్ప్రేక్షా వ్యంజకా జ్ఞేయా ఇవశబ్దోఽపి తాదృశః॥

తదప్రయోగే ప్రతీయమానా భేదాః పృథక్చమత్కారాతిశయాభావాత్, న పరిగణ్యంతే। యథాయోగం దిఙ్మాత్ర ముదాహ్రియతే।

వివరణము :

ప్రకృతమనగా ఉపమేయము. ఈ ఉపమేయమును ఇతర ధర్మసంబంధమును బట్టి ఇతరముగానే సంభావించుట ఉత్రేక్ష యని ఈ ఉత్ప్రేక్షాలంకార లక్షణసారము.

అధ్యవసాయము గూడ నొకరకమగు అభేదమే కనుక అభేదమూలకాలంకారములలో ఆరోప గర్భములగు రూపక పరిణామములు తరువాత ఈ యుత్ప్రేక్షను నిరూపించుట సంగతమే అధ్యవసాయ మను పదమునకు సాధారణముగా అభేద ప్రతిపత్తి యనియే అర్థము. ఉభయ సాధారణమగు అభేద ప్రతిపత్తి యనియే అర్థము. ఉభయ సాధారణమగు అనుగత ధర్మ మున్నందుననే ఉపమానాభేదము ఉపమేయమునకు చెప్పబడును. అధ్యవసాయ నిమిత్తమైన ఈ అనుగత ధర్మము గుణరూపము లేదా క్రియారూపము కూడ కావచ్చును. ఈ విధముగా జాతి గుణ క్రియా ద్రవ్యములను నాలుగింటిని ఉత్ప్రేక్షించువట జరుగవచ్చును. కనుక ఉత్ప్రేక్ష మొదట నాలుగు విధములు 1. జాత్యుత్ప్రేక్ష 2. గుణోత్ప్రేక్ష 3. క్రియోత్ప్రేక్ష 4. ద్రవ్యోత్ప్రేక్ష. వీనిలోను స్వరూప మాత్రము నుత్ప్రేక్షించిన స్వరూపోత్ప్రేక్ష యనియు. హేతువుగా నుత్ప్రేక్షించినచో హేతూత్ప్రేక్షయనియు ఫలముగా నుత్ప్రేక్షించిన ఫలోత్ప్రేక్షయనియు వ్యవహరింతురు. ఈవిధముగా స్వరూపమును నుత్ప్రేక్షించుట అనగా భావస్వరూపమును గావచ్చును. లేదా అభావ స్వరూపమును గూడకావచ్చును. ఇట్లే గుణ క్రియా రూప నిమిత్తములుచెప్పబడవచ్చును, చెప్పబడకను పోవచ్చును, అందుచే స్వరూపోత్ప్రేక్ష నాలుగు రకములు కావచ్చును. ఉదా : 1. ఉక్త నిమిత్త భావస్వరూపోత్ప్రేక్ష 2. అనుక్త నిమిత్త భావస్వరూపోత్ప్రేక్ష 3. ఉక్త నిమిత్తాభావస్వరూపోత్ప్రేక్ష 4. అనుక్త నిమిత్తాభావ స్వరూపోత్ప్రేక్ష. ఇట్లే గుణ క్రియా ద్రవ్యముల ఉత్ప్రేక్షలను కూడ ఒక్కొక్క దానిని నాలుగు రకములుగా విభజించిన నివియు పది రెండు విధములగును. ఇట్లు స్వరూపోత్ప్రేక్షలే పదియారుగా నేర్పడు చున్నవి. (హేతూత్ప్రేక్షలను ఫలోత్ప్రేక్షలను గ్రంథకారుడు విభజించలేదు). ఇవి యన్నియు "మన్యే" "శంకే" "ధ్రువం" "ప్రాయః" మొదలగు శబ్దము లున్నచో వాచ్యోత్ప్రేక్షలనియు ఆ శబ్దములు లేనిచో 'ప్రతీయమానోత్ప్రేక్ష'లనియు వ్యవహరించబడుచున్నవి. గొప్ప చమత్కారమేమియు లేనందున తాను ప్రతీయమానోత్ప్రేక్షలను ప్రత్యేకించి పేర్కొనుటలేదని పేర్కొనినవానిలోను కొన్నిటిని మాత్రమే యుదాహరింతుననియు గ్రంథకారుడు నుడువు చున్నాడు.

ఉపాత్త గుణనిమిత్త జాతి భావ స్వరూపోత్ప్రేక్షా యథా:-

అంగాన్యనిష్ట ప్రభు కామినీనాం రామేశ కాంచిత్కలయంతి కాంతిమ్।
భవత్ప్రతాపేన వియోజితాస్యైః స్మితై రివాభా న్యనులేపవంతి॥ 64

అత్రాంగ శబ్దో జాతివచనః। కాంతిశబ్దో గుణ వచనః। అనులేపవంతి భాంతీతి శబ్దో భావ స్వరూపవచనః।

అర్థము :

ఉపాత్త గుణ నిమిత్త జాతి భావ స్వరూపోత్ప్రేక్ష ఉదాహరించబడుచున్నది. రామేశ—ఓ రామేశప్రభూ।అనిష్ట ప్రభు కామినీనాం—శత్రు స్త్రీల యొక్క । అంగాని – శరీరములు । కాంచిత్ – విలక్షణమైన । కాంతిం – శోభను । కలయంతి నంతి – కలిగించుకొనుచున్నవియై । భవత్ ప్రతాపేన – నీ పరాక్రమము చేత । వియోజితాస్యైః – వేరు చేయబడిన మొగములుగల । స్మితైః – చిరునగవులచేత । అనులేపవంతి ఇవ – అనులేపము గలవి యనునట్లు। ఆభాంతి – ప్రకాశించుచున్నవి ।

వివరణము :

రామేశప్రభువు శత్రుస్త్రీల శరీరములు చాల అందమైనవి. అవి చిరునగవులతో అలముకొనిన శరీరముల వలె భాసించుచున్నవి. చిరునగవులు మొగములయందే ఉండవలెను. కాని ఈ ప్రభువు పరాక్రమము వారల మొగము నుండి చిరునగవును విడదీసినది. అనగా ఈయన శత్రువుల హతమొనర్చినందున శత్రుస్త్రీల మొగములపై దరహాసములు చిందులాడుటలేదు. మరి యా దరహాసము లేమైనవి? ఒడలునిండ నలముకొనినవి. అందుకే వారల శరీరములు అంత అందము గలవిగా నున్నవి. అని శ్లోక భావము.

ఇచట శరీరములు ఉపమేయములు. చిరునవ్వులతో నలముకొనిన శరీరములు ఉపమానములు. ఈ శరీరములు అనేకము లుండవచ్చును కనుక జాతిగా పేర్కొనబడును. చంద్రుడు ఒక్కడే కనుక జాతిగాకాక ద్రవ్యముగా పేర్కొనబడును. ఇది జాతికి ద్రవ్యమునకు ఆలంకారికులు చెప్పికొను భేదము. ప్రకృతములో కాంతిమంతములగు శరీరములు స్మితానులేపవంతములగు శరీరములుగా నుత్ప్రేక్షించబడుచున్నవి. శరీరముల యొక్క అభావమును గాక భావ స్వరూపమునే ఉత్ప్రేక్షించుటవలన ఇది జాతి భావ స్వరూపోత్ప్రేక్ష. ఇట్లు ఉత్ప్రేక్షించుటవలన ఇది జాతి భావ స్వరూపోత్ప్రేక్ష. ఇట్లు ఉత్ప్రేక్షించుటకు నిమిత్తమగు కాంతి యను గుణము చెప్పబడినందున నిది ఉక్త గుణ నిమిత్త జాతి భావ స్వరూపోత్ప్రేక్ష కుదాహరణము.

ఉపాత్త క్రియా నిమిత్త జాతి భావ స్వరూపోత్ప్రేక్షా యథా:—
రామేశ నేత్రయుగలం సూర్యాలోక వికస్వరమ్।
లక్ష్మీ లీలాస్పదత్వేన మన్యేఽహం తవ పంకజమ్॥ 65

అర్థము :

రామేశ — ఓరామేశ ప్రభూ । సూర్యాలోక — సూర్యుని ప్రకాశము చేత (సూరి — విద్వాంసుల । ఆలోక — దర్శనముచేత) వికస్వరం — వికసించునట్టి । తవ — నీయొక్క । నేత్రయుగలం — కన్దోయిని । లక్ష్మీలీలాస్పదత్వేన — లక్ష్మీ విలాసములకు స్థానమగుటచేత అహం — నేను । పంకజం — కమలమునుగా । మన్యే — తలచుచున్నాను.

అత్ర పంకజశబ్దో జాతి వచనః లీలాశబ్దః క్రియావచనః।
ఇచ్చట పంకజ శబ్దము జాతివాచకము. లీలా శబ్దము క్రియా వాచకము।

వివరణము :

రామేశ ప్రభువు కనుచూపు లెవరిపైన ప్రసరించునో వారు శ్రీమంతు లగుట జేసి ఈ ప్రభువు కనులలో లక్ష్మీ విలాసములున్నవి యని తలపవలసి యున్నది. లక్ష్మీదేవి కమలాలయ యని ప్రసిద్ధి. మరి ఈతని కందోయియందు లక్ష్మీ విలాసము లున్నందున ఈ కందోయిని ఇచట కమలముగా కవి యుత్ప్రేక్షించుచున్నాడు. ఇచట కన్గవ ఉపమేయము. కమలము ఉపమానము. ఇది జాతియే కనుక నిచట జాతి భావ స్వరూపోత్ప్రేక్ష. ఇట్లు ఉత్ప్రేక్షించుట కిచట లక్ష్మీవిలాసరూపక్రియ నిమిత్తముగా నుపాత్తమైనది. అందుచే ఇది ఉపాత్త క్రియా నిమిత్త జాతి భావ స్వరూపోత్ప్రేక్షకు ఉదాహరణము.

అనుపాత్త నిమిత్త జాతి భావ స్వరూపోత్ప్రేక్షా యథా—
విచిత్ర చారిత్రజ బుద్ధి భాజః
రామేశ్వరస్యాద్య యశ స్సమంతాత్
జగత్త్రయీశోభన సంవిధాన
వితానిత క్షౌమ నిభం విభాతి॥

అత్ర క్షౌమ శబ్దో జాతి వచనః

అర్థము :

విచిత్ర — విచిత్రమైన । చారిత్ర — చరితమువలన । జ —ఏర్పడిన । బుద్ధి — బుద్ధిని । భాజః — కలిగియున్న । రామేశ్వరస్య — రామేశ ప్రభువుయొక్క । యశః — కీర్తి । అద్య — ఈ వేళ । సమంతాత్ — అంతట । జగత్త్రియా — మూడు లోకములకు । శోభన — భద్రమును । సంవిధాన — చేయుటయందు । వితానిత — మేల్కట్టుగా చేయబడిన । క్షౌమనిభం — పట్టు వస్త్రముతో సమానముగా । విభాతి — భాసించుచున్నది । ఇచ్చట క్షౌమ శబ్దము జాతివాచకము ।

వివరణము :

రామేశ్వరుని కీర్తి మూడు లోకముల పైకట్టు — చాందిని - వలె భాసించుచున్నది. ఇచట కీర్తి వితానవస్త్రము —చాందినిగా— ఉత్ప్రేక్షించబడినది. కీర్తి ఉపమేయము. వస్త్రము ఉపమానము. వస్త్రము జాతి. ఇట్లుత్ప్రేక్షించుటకు నిమిత్తమగు తెలుపుదనము మొదలగు నిమిత్త మేదియు చెప్పబడలేదు. అందుచే ఇది అనుపాత్త నిమిత్త జాతి భావస్వరూపోత్ప్రేక్ష కుదాహరణము. ఇచ్చట శ్లోకములో ''క్షౌమ నిభం'' అని ''నిభ'' శబ్దము ప్రయోగించబడినది. ''నిభ'', ''సంకాశ'', ''నీకాశ'', ''ప్రతీకాశ'' మొదలగు శబ్దములు ఉపమా వాచకములుగా ప్రయుక్తము లగుచుండును. ఇచట ఉత్ప్రేక్ష ఉదాహరణ సందర్భములో ఈ ''నిభ'' శబ్ద ప్రయోగము అంత ఉచితముగా కన్పించదు. ''క్షౌమ పటో విభాతి'' యనురీతిగా ''నిభ'' స్థానమున 'పట' శబ్ద పాఠమున్న బాగుండును.

అనుపాత్త నిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష యథా —

అత్యద్భుతై రఖిల సజ్జన వర్ణనీయైః
దాక్షిణ్య పుణ్య నిలయై ర్జగదేక సారైః।
రామేశ ధీర భవత శ్శుచిభి శ్చరిత్రైః
కాల శ్చతుర్థయుగ శూన్య ఇవావభాతి॥
అత్ర చతుర్థయుగ శూన్య ఇతి జాత్యభావ ఉత్ప్రేక్షితః। 67

అర్థము :

ధీర — ధీరుడవగు । రామేశ — రామేశ ప్రభూ । అత్యద్భుతైః — ఆశ్చర్యకరము లగునట్టి । అఖిల సజ్జన వర్ణనీయైః — సమస్త సజ్జనులచేత వర్ణించదగినట్టి । దాక్షిణ్య పుణ్యనిలయైః — దయకును మంచికిని స్థానములగు । జగదేక సారైః — ప్రపంచముయొక్క ఒకే ఒక సారస్వరూపములగు । శుచిభిః — పవిత్రములగు । భవతః — నీ యొక్క ।

చరిత్రైః — చేష్టలచేత । కాలః — కాలము । చతుర్థ యుగ శూన్య ఇవ - కలియుగము లేనిది వలె । అవభాతి — భాసించుచున్నది। ఇచ్చటి "చతుర్థయుగ శూన్యః" అనుటవలన జాత్య భావోత్ప్రేక్ష.

వి వ ర ణ ము :

రామేశుని సత్ప్రవర్తనవలన కాలము కలియుగము లేనిదానివలె భాసించినది. ఇచ్చట చతుర్యుగములుగా విభక్తమగు కాలమునందు కలియుగమను జాతియొక్క అభావ స్వరూప ముత్ప్రేక్షించ బడినందును, దానికి నిమిత్త మేమియు చెప్పనందునను ఇది అనుపాత్త నిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష యని గ్రంథకర్త తాత్పర్యము.

వస్తుతః ఇచ్చట కాలమునకును, కలియుగాభావమునకును ఎట్టి ఉపమానోపమేయ భావము పొసగుట లేదు. కనుక ఈ యుదాహరణ ముపేక్షణీయము. ఔపమ్య స్ఫూర్తి లేని అరోపాప హ్నవ స్మరణ సందేహ సంభావనలు అలంకార పదవి నధిరోహించ జాలవని ఆలంకారికుల సమయము కదా! అందుచే ఈ యుదాహరణ కుదరదు.

బాహుజానాం సమస్తానా మభావఇవ మూర్తిమాన్।
జయ త్యతిబలో లోకే జామదగ్న్యః ప్రతాపవాన్॥

ఇది పండితరాజు జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష కిచ్చిన యుదాహరణము. పరశురాముడు క్షత్రియు లందరి అభావమే శరీరము దాల్చినదా యనునట్లున్నాడని భావము. ఇచట పరశు రాముడు ఉపమేయము. శరీరము దాల్చిన క్షత్రియధ్వంస భావము ఉపమానము. ఆకృతి దాల్చిన క్షత్రియాభావముగా పరశురాముడు ఉత్ప్రేక్షించబడినాడు. ఇది జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష.

జాతి హేతు స్వరూపోత్ప్రేక్షా యథా —

అశ్రాంత విశ్రాణన దీక్షితేన
రామేశ భూమీతల వాసవేన।
మహీతలోద్య త్సురభూరుహేవ
విహన్యతే మానుషలోక దైన్యమ్॥ 68
అత్ర భూరుహేతి జాతి హేతుత్వమ్।

అ ర్థ ము :

ఆక్రాంత విశ్రాణన దీక్షితేన — అనవరతము దాన దీక్షగల । రామేశ భూమీతలవాస వేన — రామేశుడను భూమీంద్రునిచేత । సుహితలోద్యత్సుర భూరుహేవ — భూమియం దుదయించు కల్పవృక్షముచేత వలె । మానుష లోకదైన్యమ్ — మనుష్య లోకములోని విషాదము । విహన్యతే — తొలగించబడుచున్నది. ఇచట భూరుహా అనునది జాతికి హేతుత్వ మును సూచించుచున్నది.

వి వ ర ణ ము:

మహాదాత యగు రామేశ ప్రభువు కల్పవృక్షమువలె లోకుల దుఃఖమును పోగొట్టు చున్నాడు. లోకుల దైన్య నివారణ హేతువుగా కల్పవృక్షము నుత్ప్రేక్షించినట్లుగా భావించి, కవి ఇందులో జాతిని హేతువుగా ఉత్ప్రేక్షించుట జరిగినదని హేతూత్ప్రేక్ష యన్నాడు. కాని ఇచట రామేశునియందు కల్పవృక్ష సామ్యమే భాసించుచున్నందున ఇది యుపమయే కావచ్చును. ''ఇవ''శబ్దము ఉత్ప్రేక్షకును గమకమే కనుక రామేశుని కల్పవృక్షముగా నుత్ప్రే క్షించినాడనియు ననవచ్చును. అపుడు జాతి స్వరూపోత్ప్రేక్షయే కావచ్చును. కాని జాతిని హేతువుగా నుత్ప్రేక్షించుట యిందులో లేదు.

'త్వత్ప్రతాప మహాదీపశిఖా విపులకజ్జలైః ।
నూనం నభస్స్థలే నిత్యం నీలిమా నూతనాయతే॥

ఇది రసగంగాధరములోని జాతి హేతూత్ప్రేక్ష కుదాహరణ శ్లోకము. ఒక మహా రాజు పరాక్రమమనెడి దీపశిఖ యొక్క మసిచేతనే ఆకాశములోని ఈ నలుపు నిత్యనూతన ముగా నున్నది అని దీని తాత్పర్యము. ఇచ్చట ఆకాశములోని నలుపుదనమునకు రాజపరా క్రమదీపశిఖామషిని హేతువుగా ఉత్ప్రేక్షించుట జరిగినది. అందుచే ఇది జాతిహేతూత్ప్రేక్ష.

జాతి భావ ఫలోత్ప్రేక్షా యథా –

శ్రీరామేశ క్షితిప భవతో విద్విషన్మానుషౌఘాః
సర్వే నూనం సరసిజభువా తీర్థయాత్రాయ సృష్టాః ।
నస్యాదేవం యది కథ మసౌ ఫాలపట్టేషు తేషాం
యాత్రిం వర్ణై రలిఖ దిహ భవ త్కోప విస్ఫూర్జితాంతమ్॥ 69

లోక దిగ్గతి మంత్రేషు యాత్రం యాత్రాచ వాచ్యవదితి విశ్వః। అత్ర మానుషజాతేః ఫలం తీర్థయాత్రా।

ఆర్థము :

శ్రీరామేశ క్షితిప – రామేశ ప్రభూ । భవతః – నీయొక్క । విద్వేషన్మానుషౌఘాః – శత్రుజన సమూహములు । సర్వే – అందరును । సరసిజభువా – బ్రహ్మచేత । తీర్థయాత్రాయ – తీర్థయాత్రకొరకు । సృష్టాః – సృష్టించబడినారు । నూనం – నిశ్చయము । ఏవం – ఇట్లు । న స్యాద్యది – కానియెడల । అసౌ – ఈ బ్రహ్మ । తేషాం – వారియొక్క । ఫాలపట్టేషు – నుదుటిపట్టము లయందు । వర్ణైః – అక్షరములచేత । ఇహ – ఈలోకమునందు । యాత్రం – యాత్రను । భవత్ – నీయొక్క । కోప – కోపము యొక్క । విస్ఫూర్తికాంతం – అతిశయమే అంతముగా గలదిగా । కథం – ఎందుకు । అలిఖత్ – వ్రాసెను। లోకము దిక్కు గతి మంత్రము అను నర్థములలో యాత్ర శబ్దము స్త్రీలింగ నపుంసకలింగములలో నుండ వచ్చునని విశ్వనిఘంటువు చెప్పుచున్నది. ఇచట మనుష్య జాతికి ఫలము తీర్థయాత్ర ।

వివరణము :

రామేశ ప్రభువుయొక్క శత్రువులు తీర్థయాత్రకై సృష్టించబడినారనియు, ఆతీర్థయాత్రయు ప్రభువునకు కోపము కలుగునంతవరకే యనియు భావము. (ఈశ్లోకచతుర్థపాదమున గణభంగము గమనించదగినది) ఇచట మానవ జాతికి తీర్థయాత్ర ఫలముగా నుత్ప్రేక్షించబడినది. అందుచే ఇది జాతి భావ ఫలోత్ప్రేక్షయని గ్రంథకర్త భావము.

వస్తుతః జాతిని ఏదో ఒకదానికి ఫలముగా ఉత్ప్రేక్షించినపుడే జాతిఫలోత్ప్రేక్షయగును కాని జాతికిఒకానొక ఫలము నుత్ప్రేక్షించినపుడు కాదు. అందులోను ఇచట మానవజాతికి తీర్థయాత్ర ఫలమని యుత్ప్రేక్షించుటగాని, దానికి కవి చెప్పిన కారణముగాని అట్టి చమత్కారకము కాదు. అందుచే ఇది జాతి ఫలోత్ప్రేక్ష కుదాహరణముగా నుపాదేయముగాకున్నది.

''దివానిశం వారిణి కంఠదఘ్నే దివాకరారాధన మాచరంతీ।
వక్షోజతాయై కిము పక్ష్మలాక్ష్యా స్తపశ్చరత్యంబుజ పంక్తి రేషా॥''

అహర్నిశము కంఠము లోతుగల నీట నిలుచుండి సూర్య సేవ సేయుచున్న ఈ కమల సముదాయము ఒకానొక సుందరాంగి యొక్క స్తనమగుటకు తపస్సు చేయుచున్నదనియు ఆ తపస్సునకు కామినీకుచమగుటయే ఫలము కాబో లనియు ఉత్ప్రేక్షించబడినది. స్తనత్వ జాతిని కమల తపస్సునకు ఫలముగా నుత్ప్రేక్షించినందున ఇది జాతి భావఫలోత్ప్రేక్ష. ఈ యుదాహరణము ''రసగంగాధరములోనిది''.

జాత్యభావ ఫలోత్ప్రేక్షా యథా –

నూనం కలంకాభావాయ తవ రామేశ కీర్తివత్ ।
నవీకరో త్యజ శ్చంద్రం ప్రతిమాసం ప్రియత్నతః ॥ 70

అత్ర కలంకాభావాయ ఇతి జాత్యభావస్య ఫలత్వమ్ ।

అర్థము :

రామేశ — రామేశప్రభూ । తవ — నీయొక్క । కీర్తివత్ — కీర్తికివలె । కలంకాభావాయ — కలంకము లేకపోవుటకొరకు । అజః — బ్రహ్మ । ప్రతిమాసం — ప్రతినెల । ప్రయత్నతః — ప్రయత్నమువలన । చంద్రం — చంద్రుని । నవీకరోతి — కొత్తగాచేయు చున్నాడు । నూనం — నిశ్చయము । ఇచ్చట కలంకాభావమనునది జాత్యభావము. దానిని ఫలముగా నుత్ప్రేక్షించుట యైనది.

వివరణము :

ప్రతినెల మొదట క్రొత్త చంద్రుడు కన్పడును. ఇట్లు ప్రతినెల బ్రహ్మదేవుడు క్రొత్తగా చంద్రుని ఎందుకు సృష్టించుచున్నాడు ? అనిన మన రామేశప్రభుకీర్తివలె నిష్కలంకత కొరకే కాబోలని తాత్పర్యము. ఇచట ప్రతిమాస చంద్రనవీకరణమునకు కలంకరూప జాత్యభావము ఫలముగా నుత్ప్రేక్షించబడినందున నిది జాత్యభావఫలోత్ప్రేక్ష.

క్రియా స్వరూపోత్ప్రేక్షా యథా-

త్వద్విద్వద్వర కామినీ పరి పతత్ క్రీడాపదాన శ్రమ
శ్వాసోద్వృద్ధ భుజార్జితాతివిలస ద్యుష్మత్ప్రతాపాగ్నినా ।
మన్యే షోడశ రాజకీర్తి రజతారబ్ధశ్శశీ శ్యామికా
విద్ధ శ్శుద్ధతరాత్మకీర్తి విభవ శ్రీవిశ్వనాథాత్మజ ॥ 71

అత్ర రజతారబ్ధ ఇతిక్రియాస్వరూపమ్ ।

అర్థము :

శుద్ధతరాత్మ కీర్తి విభవ — పరిశుద్ధ కీర్తి వైభవముగల । శ్రీ విశ్వనాథాత్మజ — విశ్వనాథ ప్రభు కుమారా! । త్వద్ — నీ । విద్వద్వర — పండితపుంగవుల । కామినీ — స్త్రీల చేత । పరిపతత్ — పఠించబడు । క్రీడాపదాన — విలాసములు వీరచేష్టితములు గలవార లగుట చేతనైన । శ్రమ — అలసటచేత కలిగిన । శ్వాస — ఉచ్ఛ్వాసములచేత । ఉద్వృద్ధ — పెరిగిన । భుజార్జిత — భుజములచేత సంపాదించబడిన । అతి విలసత్ — బాగుగా ప్రకాశించు । యుష్మత్ — మీయొక్క । ప్రతాపాగ్నినా — ప్రతాపరూపమగు అగ్నిచేత । శ్యామికావిద్ధః —

వలపుచేత సంబద్ధుడైన । శశీ — చంద్రుడు । షోడశరాజకీర్తి — పదియారు రాజుల కీర్తి యనెడు । రజత — వెండిచేత । ఆరబ్ధః — చేయబడినాడు । మన్యే — అని తలచుచున్నాను। ఇచ్చట రజతారబ్ధః యనుటచేత క్రియాస్వరూప ముత్ప్రేక్షించబడినది.

వి వ ర ణ ము :

మహారాజు నాశ్రయించిన పండితులు రాజుయొక్క లీలలను వీరచేష్టితములను వర్ణించుచు పాటలు రచించగా వానిని ఆ పండితుల స్త్రీలు పఠించుచుందురు. అట్లు పాడి పాడి అలసిన ఆ స్త్రీల శ్వాసవాయువులచేత ఈ రాజుయొక్క భుజ బలార్జిత పరాక్రమాగ్ని విజృంభించును. ఈ ప్రతాపాగ్నియొక్క మసియే చంద్రునికి కలంకముగా మారినది. చంద్రుడు పదియారు మహారాజుల కీర్తియను వెండిచేత తయారుచేయబడినాడు. ఇంతటి అభిప్రాయమును తెలుపుశ్లోక రచన కొంచెము విసంష్ఠులముగా నున్నది. 'ఇచ్చట చంద్రుడు కీర్తిరజతముచేత ఆరంభించబడినాడని తలంచెదను' అను అంశమే ఉత్ప్రేక్ష కుదాహరణము. ఆరంభమను క్రియాస్వరూప మిచ్చట ఉత్ప్రేక్షితము.

క్రియాభావ స్వరూపోత్ప్రేక్షా యథా—

సృష్ట్వా ముకుంద వరకచ్ఛప కామధేను
కల్పద్రుమాన్ వితరణే చ విలోక్య ధాతా।
సంతోష మాత్మని పరం న వహన్నివ శ్రీ
రామేశమత్ర వినియుజ్య నిరాధి రాస్తే ॥ 72
అత్ర నవహన్నివేతి క్రియాయా అభావః ।

అ ర్థ ము :

ధాతా — బ్రహ్మదేవుడు । ముకుంద — విష్ణువును । వరకచ్ఛప — శ్రీకూర్మనాథుని । కామధేను — కామధేనువును । కల్పద్రుమాన్ — కల్పవృక్షములను । సృష్ట్వా — సృష్టించి । వితరణేచ — దాన విషయమున । ఆత్మని — తనయందు । పరం — గొప్పదైన । సంతోషం — సంతోషమును । న వహన్నివ — వహించని వానివలె । విలోక్య — విచారించి । అత్ర — ఈ దానవిషయమున । శ్రీరామేశం — రామేశ ప్రభువును । వినియుజ్య — నియమించి । నిరాధిః — విచారము లేనివాడుగా । ఆస్తే — ఉన్నాడు । ఇచ్చట 'నవహన్నివ' యని క్రియయొక్క అభావము చెప్పబడును.

వి వ ర ణ ము :

బ్రహ్మదేవుడు అడిగిన వస్తువుల నడిగినవారి కిచ్చుటకు విష్ణ్వాదులను సృష్టించియు, సంతోషపడక మరల ఆలోచించి, రామేశ ప్రభువును సృష్టించి తృప్తి పడినాడు. విష్ణ్వాదుల

కంటె రామేశ ప్రభువు గొప్పదాతయని తాత్పర్యము. ఇచ్చట సంతోషమును వహించకపోవుటనునది క్రియయొక్క అభావమే కాని తత్స్వరూపము రామేశ ప్రభు సృష్టికి నిమిత్తముగా — హేతువుగా — చెప్పబడినందున ఇది క్రియాభావహేతూత్ప్రేక్ష కావచ్చును. కాని క్రియాఽభావ స్వరూపోత్ప్రేక్ష యగుటలేదు. కాని బ్రహ్మదేవునియందు తాదృశ సంతోషవహన రూప క్రియ యొక్క అభావమును ధర్మముగా ఉత్ప్రేక్షించుటయందే తాత్పర్య మని యన్నచో నదియు కావచ్చును.

క్రియా హేతూత్ప్రేక్షా యథా -

విరోధి చక్ర విశ్లేష స్తత్ర తత్రోపలక్ష్యతే।
శ్రీరామేశ విభోః స్ఫార యశశ్చంద్రోదయా దివ ॥ 73

అత్ర ఉదయా దితి క్రియాయా హేతుత్వమ్ ।

**అర్థము :**

విరోధి చక్ర — శత్రువు లనుచక్రవాకములయొక్క । విశ్లేషః — వియోగము । శ్రీ రామేశ విభోః — రామేశ ప్రభువుయొక్క । స్ఫార — గొప్పదగు । యశః — కీర్తి యనెడు । చంద్ర — చంద్రుని । ఉదయా దివ — ఉదయించుట వలననేమో । తత్ర తత్ర — అచ్చటచ్చట । ఉపలక్ష్యతే — కనబడుచున్నది । ఇచ్చట ఉదయ మను క్రియ హేతువుగా నున్నది.

**వివరణము :**

చంద్రోదయము వలన చక్రవాకములు విడిపోయినట్లు రామేశ ప్రభువు కీర్తియొక్క ఉదయమువలన విరోధులు విడిపోయినా రని భావము. చంద్రోదయము చక్రవాక వియోగమునకు హేతువుగా ప్రసిద్ధమే కనుక దానిని ఉత్ప్రేక్షించు టనుట పొసగదు. కనుక వేరే ఉదాహరణము చూపవలెను.

క్రియాభావ హేతూత్ప్రేక్షా యథా -

దైన్యాని విదుష స్త్యక్త్వా ఆశ్రియంతే నిరాకులమ్।
రామేశ త్వద్విషద్వర్గం తత్రానుగ్రహలోపతః॥ 74

అత్ర సమీప ప్రాపణ క్రియా హేతుత్వాత్ హేత్వభావః ।

**అర్థము :**

రామేశ — రామేశప్రభూ । దైన్యాని — దీనభావములు । విదుషః — విద్వాంసులను । త్యక్త్వా — విడిచి । త్వద్విష ద్వర్గం — నీశత్రు వర్గమును । తత్ర — ఆశత్రువర్గమునందు ।

అనుగ్రహాలోపతః – నీయనుగ్రహము లోపించినందున । నిరాకులం – అడ్డులేకుండ । ఆశ్రయంతే – ఆశ్రయించుచున్నవి ।

వి వ ర ణ ము :

ప్రభువు అనుగ్రహమున్నందున విద్వాంసులు దుఃఖదూరులైనారు. ప్రభువు అనుగ్రహము లోపించినందున శత్రురాజులు దుఃఖితులైనారని తాత్పర్యము. దగ్గరకు చేర్చుకొనుటకు హేతువు అనుగ్రహము. అది పండితుల కున్నది. శత్రువుల కీయనుగ్రహము లేదు. అందుచే వారిని విషాదము లాశ్రయించినవి. ఇచ్చట మూలములో 'సమీప ప్రాపణ క్రియా హేతుత్వాత్ హేత్వభావః' అని యొక పంక్తి కలదు. ఆ వాక్యమున 'అనుగ్రహస్య' అను పదమును తెచ్చిపెట్టుకొనవలెను. అపుడు 'అనుగ్రహస్య' = అనుగ్రహము, సమీపప్రాపణ క్రియా హేతుత్వాత్ = దగ్గిరకు చేర్చుకొనుటయను క్రియకు కారణము కనుక । హేత్వభావః – అట్లు కారణమైన అనుగ్రహము యొక్క అభావము ఇచట క్రియా భావము. దానిని విషాదములు శత్రువర్గము నాశ్రయించుటకు హేతువుగా వర్ణించినందున ఇది క్రియాభావమునకు హేతుత్వము నుత్ప్రేక్షించుట కుదాహరణమని గ్రంథకర్త తాత్పర్యము. కాని శత్రు దుఃఖములకు రాజానుగ్రహాభావము సిద్ధహేతువే కనుక ఇట ఉత్ప్రేక్షించుట ఏమియు నుండదు. అందుచే ఉదాహరణము మరియొకటి చూపవలసి యున్నది.

క్రియా ఫలోత్ప్రేక్షా యథా–

రామేశ కీర్తి సాదృశ్యం నేతు మిందు ప్రభాం విధిః।
నాసౌ విరమతేఽద్యాపి శోధితుం శరదంబరమ్॥
అత్ర శోధన క్రియాయాః ఫలత్వమ్। 75

అ ర్థ ము :

అసౌ – ఈ । విధిః – బ్రహ్మదేవుడు । ఇందు ప్రభాం – చంద్రకాంతిని । రామేశ కీర్తి సాదృశ్యం – రామేశప్రభువుయొక్క కీర్తి సామ్యమును । నేతుం – పొందించుటకు । అద్యాపి - ఇప్పటికిని । శరదంబరం - శరదృతువునందలి ఆకాశమును । శోధితుం – పరిశుభ్రమొనర్చుటకొరకైన । (యత్నాత్ – ప్రయత్నమునుండి. ఈ అంశము ఊహించవలెను) । న విరమతే – ఆగుటలేదు (ఇచ్చట శోధన క్రియకు ఫలితముగా సాదృశ్యనయనక్రియా స్వరూప ముత్ప్రేక్షించబడుచున్నది అను అంశము ఊహించుకొనవలెను.)

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు కీర్తియందు వెన్నెల వెలవెలబోయినది. ఐనను బ్రహ్మదేవుడు ఈ వెన్నెల కెట్లైన తత్కీర్తి సామ్యమును సంపాదించవలెనని ప్రయత్నించుచున్నాడు. ఈ

ప్రయత్నములో భాగమే ప్రతి శరదృతువులోను ఆకాశమును నిర్మలముగా చేయుట అని శ్లోక తాత్పర్యము. ఇచ్చట శరదృతువులో సహజమగు నైర్మల్యమునకు కీర్తి సాదృశ్యకరణ క్రియ ఫలితముగా నుత్ప్రేక్షించబడినందున ఇది క్రియాఫలోత్ప్రేక్ష కుదాహరణము. ఇచట ఇవ మొదలగునవి లేనందున ఇది ప్రతీయమానోత్ప్రేక్షయగుచున్నది.

క్రియా భావ ఫలోత్ప్రేక్షా యథా –

నలః ప్రదాతా ప్రథమే యుగేఽభూత్ రామో ద్వితీయే రవిజ స్తృతీయే।
అవిచ్ఛిదే నూన మజేన సృష్టః త్యాగస్య రామేశ విభు శ్చతుర్థే॥
అత్రావిచ్ఛిదే ఇతి క్రియాభావస్య ఫలత్వమ్। 76

అర్థము :

ప్రథమే – మొదటి । యుగే - యుగమునందు । నలః – నలుడు । దాతా - త్యాగి । అభూత్ – ఆయెను । ద్వితీయే – రెండవ యుగమున । రామః – రాముడు । తృతీయే – మూడవ యుగమున । రవిజః – కర్ణుడు । దాతా - త్యాగి । అభూత్ - ఆయెను । చతుర్థే - నాలుగవ యుగమున । త్యాగస్య - దానము యొక్క । అవిచ్ఛిదే - విచ్ఛేదము లేకపోవుటకై అజేన – బ్రహ్మచేత । రామేశ విభుః - రామేశ ప్రభువు । సృష్టః - సృష్టించబడినాడు । నూనం – నిశ్చయము ।

వివరణము :

కృత త్రేతా ద్వాపర యుగములలో వరుసగా నల రామ కర్ణులు దాతలుగా నున్నారు. కలియుగములో దాతలేనిచో దాతృ విచ్ఛేదము కలుగును. అందుచే బ్రహ్మదేవుడు రామేశ ప్రభువును సృష్టించినాడు. ఇచట సాధారణముగా జరిగిన రామేశప్రభు సృష్టికి దాతృవిచ్ఛేద రూప క్రియాఽభావమును ఫలితముగా నుత్ప్రేక్షించుటయైనది. నూనం అని ఉత్ప్రేక్షను చెప్పు శబ్ద మున్నది. కనుక ఇది క్రియాఽభావఫలోత్ప్రేక్ష వాచ్య మగుచున్నది.

గుణ స్వరూపోత్ప్రేక్షా యథా –

క్షోణీ చక్ర సుఖోదయం సుర నర కర్ణ్యాద లోక స్థిరం
నిత్యం సద్బుధ మానసాంబుజ సముల్లాస ప్రగల్భద్యుతిమ్।
శ్రీ రామేశ యశో హిమాంశు మభిత స్సంపశ్యత శ్శీతగోః
శోకాగ్న్యాహిత కాలిమేవ హృదయే విద్యోతతే రోహిణః॥ 77

అత్ర కాలిమేతిగుణ స్వరూపమ్।

**అర్థము :**

క్షోణీచక్ర — భూమండలమునకు — భూమి యందలి చక్రవాక పక్షులకును । సుఖోదయం — సుఖకరమగు ఉదయముగల । సుర నర క్రవ్యాదలోక — దేవ మనుష్య రాక్షసలోకములయందు । స్థిరం — స్థిరముగానున్న । నిత్యం - ఎల్లపుడు । సద్బుధ — మంచి విద్వాంసుల । మానసాంబుజ - మనస్సులనెడు కమలముల । సముల్లాస - వికాసమునందు । ప్రగల్భద్యుతిం - సమర్థమైన కాంతిగల । శ్రీరామేశ యశో హిమాంశుం — రామేశ ప్రభువుయొక్క కీర్తి చంద్రుని । అభితః - అంతట । సంపశ్యతః — చూచుచున్న । శీతగోః - చంద్రుని యొక్క । హృదయే — హృదయమునందు । శోకాగ్న్యాహిత కాలిమేవ — శోకమనెడు అగ్నివలననైన నలుపువలె । రోహిణః — కృష్ణమృగము । విద్యోతతే — ప్రకాశించుచున్నది.

**వివరణము :**

రామేశప్రభువుయొక్క కీర్తిచంద్రుని చూచి వాస్తవచంద్రునికి తాను వానివలె లేనైతినే అనుబాధ ఏర్పడినది. ఈ బాధ అను అగ్నియొక్క మసియేమో అన్నట్లుగా వాని నడుమ కళంక యున్నది. కీర్తి చంద్రునివలె తాను లేకపోవుట ఏమన తన ఉదయము భూమియందలి చక్రవాకములకు దుఃఖమును కలిగించును. మరి కీర్తి చంద్రోదయము భూచక్రమునకు సుఖమును కదా కలుగజేయుచున్నది. అట్లే కీర్తిచంద్రుడన్ని లోకములలోను స్థిరముగానున్నాడు. తాను క్షీణించుట వృద్ధి చెందుటలతో సతమతమగుచున్నాడు. కీర్తిచంద్రుడు విద్వన్మానస పద్మముల వికసింపచేయుచున్నాడు. తాను కమలముల వికసింప చేయలేకున్నాడు. అందుచే కీర్తి చంద్రుని చూచి వాస్తవ చంద్రుడు బాధపడుచున్నాడు. ఇచ్చట కేడిని శోకాగ్నిమషిగా నుత్ప్రేక్షించుట జరిగినది. నలుపు గుణము కనుక నిది గుణస్వరూపోత్ప్రేక్ష.

గుణాభావ స్వరూపోత్ప్రేక్షా యథా -
రామేశ కీర్తి ధావళ్యం త్రైలోక్య ముపలింపతి।
[1]బ్రహ్మ సృష్టిర్హి నైల్యాది శూన్యేవ పరిదృశ్యతే॥ 78
[2] అత్ర సృష్టిః నైల్యాది శూన్యేతి గుణాభావః॥

**గమనిక :**

మూలప్రతిలోని శ్లోక ఉత్తరార్థము కొంత విసంష్ఠులముగా నున్నది. దానిని "బ్రహ్మ సృష్టిర్హి నైల్యాది శూన్యేవ పరిదృశ్యతే" అను రీతిలో సవరించుకొని అర్థము చెప్పుకొనుచున్నాము. అట్లే చివర వాక్యమును గూడ "అత్ర సృష్టిః నైల్యాది శూన్యేతి గుణాభావః" అను రీతిలో సవరించుకొనవలెను.

1. బ్రహ్మ సృష్టి రియం శూన్యా నైల్యాది రివ దృశ్యతే । (మూ. పా.)
2. అత్ర నైల్యాది సృష్టిః శూన్యేతి గుణాభావః । (మూ. పా.)

అ ర్థ ము :

రామేశ కీర్తి ధావళ్యం — రామేశ ప్రభువు కీర్తి తెల్లదనము । త్రైలోక్యం — మూడు లోకములను । ఉపలింపతి — అలముచున్నది । బ్రహ్మ సృష్టిః హి — బ్రహ్మ సృష్టి యేయో, నైల్యాది శూన్యా ఇవ — నలుపు మొదలగు రూపములు లేనిదానివలె । పరిదృశ్యతే — కన్పడుచున్నది ।

వి వ ర ణ ము :

మూడు లోకములలోను రామేశ ప్రభువు కీర్తియొక్క తెలుపుదనమే నిండియున్నందున ఇక సృష్టిలో నలుపు మొదలగు వేరు రూపములు లేవు కాబోలు ననిపించుచున్నది. ఇచ్చట నలుపు అను గుణముయొక్క అభావ ముత్ప్రేక్షిత మైనందున నిది గుణాభావోత్ప్రేక్ష.

గుణహేతూత్ప్రేక్షా యథా —

శ్రీరామేశ తవ త్యాగః కర్ణాదీనాం యశఃపయః।
వికరోతి మిలత్స్వీయ చరితామ్లరసాదివ ॥ 79

అత్ర రసాదివేతి గుణస్య హేతుత్వమ్।

గమనిక :

మూలప్రతిలోని శ్లోకము మొదటి పాదములో "ద్వంద్వ" అను నొకపదము అనన్వితముగా నున్నది. అందుచే దాని స్థానమున "త్యాగః" అని చేర్చబడినది.

అ ర్థ ము :

శ్రీరామేశ — శ్రీ రామేశప్రభూ । తవ — నీయొక్క । త్యాగః — దానము । కర్ణాదీనాం — కర్ణుడు మొదలగువారి । యశః పయః — కీర్తియను పాలను । మిలత్ — కలియుచున్న । స్వీయ — తన । చరిత — చరితమనెడు । అమ్లరసాదివ — పులుపు రసమువలనవలె । వికరోతి — వికారము గలదిగా చేయుచున్నది ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు దానగుణము పరుల నోరు ఊరించు పులుపు రసము గలది. అది కర్ణాదుల కీర్తి యను పాలలో కలిసి ఆ కీర్తి దుగ్ధమును విరుగ గొట్టుటయో లేక గడ్డకట్టించుటయో చేయుచున్నది. ఇచ్చట కర్ణాదుల కీర్తికి వికారము గలుగుటకు రామేశ దానగుణామ్ల రసమను గుణమును హేతువుగా నుత్ప్రేక్షించినందున ఇది గుణ హేతూత్ప్రేక్ష. ఇచట కర్ణాదుల కీర్తికి వికార మేర్పడినట్లు ప్రసిద్ధిలేదు. సిద్ధమగు నొక కార్యమునకు వాస్తవిక కారణ

మగు దానికంటె నతిరిక్తమగు దానిని హేతువుగా నుత్ప్రేక్షించుట సాధారణముగా జరుగు చుండును. ఇచ్చట కర్ణాది కీర్తికి వికార మేర్పడినట్లు ఈ వర్ణనను బట్టియే మనము భావించ వలెను. ఆ వికారము రామేశుని కీర్తి ముందు వెలవెల బోవుటయే అని గ్రంథకారుని భావముగా భావించవలసియున్నది.

[1]గుణాభావ హేతూత్ప్రేక్షాయథా-

అసామార్థ్యాదివార్థిభ్యః స్పర్శనే కల్పభూరుహః ।
శ్రీరామేశ భుజాకారః కారితః పద్మయోనినా॥ 80

అత్ర అసామర్థ్యా దితి గుణాభావస్య హేతుత్వమ్।

అర్థము :

స్పర్శనే — యాచకుల నందుకొనుటయందు । కల్ప భూరుహః — కల్ప వృక్షమునకు అసామర్థ్యాదివ — సామర్థ్యము లేకపోవుటవలననేమో । పద్మయోనినా — బ్రహ్మదేవునిచేత అర్థిభ్యః — యాచకులకొరకు । శ్రీరామేశ భుజాకారః — శ్రీ రామేశుని భుజమే ఆకారము గలదిగా (కల్పవృక్షము) । కారితః — చేయబడినది ।

వివరణము :

కల్ప వృక్షము యాచకులందరికిని అందుబాటులో లేదని భావించి కాబోలు బ్రహ్మ దేవుడు రామేశుని భుజము ఆకారములో దానిని కల్పించినాడు. ఇచట రామేశ భుజాకారముగా కల్పవృక్ష మున్నది అని మొదట సిద్ధము చేసికొని అట్లుండుటకు కారణముగా ప్రసిద్ధ కల్ప వృక్షమునకు సర్వయాచక స్పర్శసామర్థ్యమను గుణము లేకపోవుటను ఉత్ప్రేక్షించుటయైనదని చెప్పకొనవలెను. అందువలన నిది గుణాభావ హేతూత్ప్రేక్ష కుదాహరణము.

గుణ ఫలోత్ప్రేక్షా యథా-

త్వదన్య శ్రీముగ్ధ ప్రభు చరిత తాపాతిలులిత -
త్రిలోకీ శైత్యార్థం సరసిజ భవో నూన మసృజత్।
భవత్కీర్తి జ్యోత్స్నాం మహిత గుణరామేశ వితతాం
నిరాతంక స్తస్యాః కువలయ వికాసో విజయతే॥ 81

అత్ర శైత్యార్థ మితి గుణస్య ఫలత్వమ్।

1. గుణ హేత్వభావోత్ప్రేక్షా (మూ. పా.)

అ ర్థ ము :

మహితగుణ — ప్రశ స్తగుణములుగల । రామేశ — రామేశ ప్రభూ ! । సరసిజభవః — బ్రహ్మదేవుడు । త్వత్ — నీకన్న । అన్య — వేరగు । శ్రీముగ్ధ — సంపత్తి మూఢులగు । ప్రభు — రాజుల । చరిత — చేష్టల చేతనైన । తాప — సంతాపముచేత । అతి లలిత — చాల బాధపడెడు । త్రిలోకీ — మూడు లోకములలోని జనులకు । శైత్యార్థం — చలువకొరకు । వితతాం — విస్తీర్ణమగు । భవత్ — నీయొక్క । కీర్తి జ్యోత్స్నాం — కీర్తియనెడు వెన్నెలను । అసృజత్ — సృష్టించెను । నూనం — నిశ్చయము । తస్యాః — ఆ వెన్నెలకు । కువలయ — భూమండలముయొక్క — కలువలయొక్క । వికాసః — వికసింపజేయుట । నిరాతంకః — నిస్సంకోచముగా । విజయతే — కొనసాగుచున్నది ।

వి వ ర ణ ము :

ధనమదాంధులగు రాజుల చేష్టలవలన తపించు మూడు లోకములలోని జనులకు చలువ కలిగించుటకు బ్రహ్మదేవుడు రామేశప్రభు కీర్తి యనెడు వెన్నెలను సృష్టించినాడు. ఇపు డది చంద్రకాంతి కలువల వికసింపజేయునట్లు భూమండలములోని జనులను సంతోష పరుచుచున్నది. ఇచట రామేశ ప్రభు కీర్తి జ్యోత్స్నను మొదట సిద్ధపరుచుకొని దానికి ఫలిత ముగా త్రిలోకీ శైత్యమును ఉత్ప్రేక్షించుట జరిగినది. కనుక నిది గుణ ఫలోత్ప్రేక్ష కుదాహరణము.

గుణాభావ ఫలోత్ప్రేక్షా యథా —

దూరం గతే శర్వగురౌ హిమాచలే
ధైర్యే త్వయా సామ్యవిరోధ హానయే।
[1]తవాహితా ద్రావిడ సార్వభౌమ
విహాయ ధైర్యాణి తథైవ నిర్వృతాః॥ 82
అత్ర విరోధ హానయ ఇతిగుణాభావస్య ఫలత్వమ్।

అ ర్థ ము :

ద్రావిడ సార్వభౌమ — ద్రవిడ మహాప్రభూ । శర్వగురౌ — శివుని మామయగు । హిమాచలే — హిమాలయము వంటి । ధైర్యే — (నీ) ధైర్యము । దూరంగతే సతి — దూర మైన దగుచుండగా । త్వయా — నీచేతనైన । సామ్య — పోలికకు । విరోధ — విరోధమును । హానయే — పోగొట్టుకొనుటకు । తవ — నీయొక్క । అహితాః — శత్రువులు । తథైవ — అదేవిధముగా । ధైర్యాణి — ధైర్యములను । విహాయ — వదలి । నిర్వృతాః — సంతో షించిరి ।

1. తథాహితా (మూ. పా.)

వివరణము

మహారాజు హిమాలయ మంతటి తన ధైర్యమును ఒకానొక సందర్భములో దూరము చేసికొనినాడు. అపుడు అతని శత్రువులుకూడ ఈ మహారాజుతోగల సామ్యమునకు విరోధ మేర్పడగూడ దను భావముతో తమ ధైర్యములనుకూడ విడిచి మహారాజుతో సామ్యము సంరక్షించబడినది గదా యని సంతోషించినారు. వీరు ధైర్యముల విడనాడుటకు సామ్య విరోధ పరిహారమును గుణాభావమును ఫలముగా నుత్ప్రేక్షించినందున నిది గుణాభావఫలో త్ప్రేక్ష కుదాహరణము. ఇచట ధైర్యములనుగాక పరహింసా క్రోధలోభాదులను విడిచిపెట్టు టను వర్ణించిన నింతకంటె ఉచితముగా నుండునని గమనించ వచ్చును.

ద్రవ్య స్వరూపోత్ప్రేక్షా యథా-

ప్రతిభట బలభేదన ప్రవీణః కర విహరచ్ఛతకోటి దాన కీర్తిః,
బహు విలసతి విప్రసార్వభౌమ స్త్వపర ఇవేహ సుపర్వ సార్వభౌమః॥
అత్ర [1] సుపర్వ సార్వభౌమ ఇతి ద్రవ్యస్వరూపోత్ప్రేక్షా। 83

అర్థము :

ప్రతిభట — శత్రువుల। బల — బలము యొక్క — బలాసురుని యొక్క। భేదన — భేదించుటయందు। ప్రవీణః — సమర్థుడైనట్టియు। కర — చేతియందు। విహరత్ — కద లాడు। శతకోటి — వందలకోట్ల — వజ్రముకలవాడును। దాన — దానముచేతనైన। కీర్తిః — కీర్తిగలవాడునగు। విప్రసార్వభౌమః — విప్రశ్రేష్ఠుడు। అపరః — మరియొక। సుపర్వసార్వభౌమః ఇవ — దేవరాజువలె। ఇహ — ఇక్కడ। బహు — బాగుగా। విలసతి— ప్రకాశించుచున్నాడు।

వివరణము :

మహారాజు వేరొక ఇంద్రుని వలె ప్రకాశించుచున్నాడు. ఇంద్రుడు బలుడను రాక్షసుని సంహరించినాడు. మహారాజు శత్రు బలమును నశింపచేసినాడు. ఇంద్రుని చేతిలో శతకోటి ఆయుధ మున్నది. మహారాజు చేతిలో శతకోటి ధనమున్నది. అందుచే ఇచట మహారాజును ఇంద్రునిగా నుత్ప్రేక్షించుట జరిగినది. కనుక నిది ద్రవ్యస్వరూపోత్ప్రేక్ష.

ద్రవ్య హేతుత్ప్రేక్షా యథా-

పృథివ్యాం జిహ్మగా ఏతే నేత్రేణ పరిభర్త్సితాః ।
శ్రీరామేశ విభో మన్యే అన్యేనేవ గరుత్మతా॥ 84

1. విప్ర (మూ. పా.)

**అర్థము :**

శ్రీరామేశ విభో — ఓ రామేశ ప్రభూ । పృథివ్యాం — పృథివియందు । ఏతే — ఈ । జిహ్మగాః — దుర్జనులు — పాములు । అన్యేన — మరియొక । గరుత్మతా ఇవ — గరుడుని చేతవలె । నేత్రేణ — (నీ) కంటితో । పరిభర్త్సితాః — బెదరించబడినారని । మన్యే — తలచుచున్నాను ।

**వివరణము :**

ప్రభువు తన దృష్టితో దుర్జనులను బెదరించుట గరుత్మంతుడు పాముల బెదరించి నట్లున్నది. ఇచట ప్రభువు నేత్రమును మరియొక గరుత్మంతుడుగా నుత్ప్రేక్షించుట జరిగినది. అందుచే ఇదియు ద్రవ్య స్వరూపోత్ప్రేక్షయే. ఐనను నేత్రమువలన ఏర్పడిన జిహ్మగ పరి భర్త్సనక్రియకు గరుడుని హేతువుగా నుత్ప్రేక్షించుట జరిగినదని ద్రవ్య హేతూత్ప్రేక్ష యను కొనవచ్చును. కాని మరియొక గరుత్మంతు డనుటవలన నిచట హేతూత్ప్రేక్ష యనుటకు అవకాశములేదు. కనుక ద్రవ్యహేతూత్ప్రేక్షకు వే రుదాహరణము చెప్పుకొనవలెను.

[1]ద్రవ్యాభావహేతూత్ప్రేక్షా యథా —
రామేశ కీర్తిసూతోపలేప శుభ్రేణ మేరుణా
అకాంచనాద్రిణే వాబ్జసంభవో దుర్మనాయతే॥ 85

**అర్థము :**

రామేశ — రామేశ ప్రభువు యొక్క । కీర్తి — కీర్తియనెడు । సూత — పాదరసము యొక్క । ఉపలేప — పూతచేత । శుభ్రేణ — తెల్లనైన । మేరుణా — మేరు పర్వతము చేత । అకాంచనాద్రిణా ఇవ — బంగారుకొండ లేకపోవుటచేతవలె । అబ్జసంభవః — బ్రహ్మ దేవుడు । దుర్మనాయతే — దుఃఖించుచున్నాడు ।

**వివరణము :**

రామేశుని కీర్తియను పాదరసము వ్యాపించుట చేత బంగారుకొండ గూడ తెల్లబడినది. అపుడు తాను సృష్టించిన బంగారు పర్వతము లేక పోయినదేయని బ్రహ్మదేవుడు దుఃఖించి నాడు. ఇచట బ్రహ్మదేవుని దుఃఖమునకు మేరు పర్వతరూప ద్రవ్యముయొక్క అభావ మును హేతువుగా నుత్ప్రేక్షించినందున ఇది ద్రవ్యాభావహేతూత్ప్రేక్ష యని గ్రంథకర్త యభిసంధి; ఐనను మొదట బ్రహ్మదేవుని దుఃఖమును సిద్ధపరిచి దానికి ఈ మేరుపర్వతాభావ మును హేతువుగా నుత్ప్రేక్షించిన అది యుదాహరణ మయ్యెడిది. కాని ఇచట బ్రహ్మదేవుని

1. ద్రవ్య హేత్వభావోత్ప్రేక్షా (మూ. పా.)

దుఃఖమునకు కాంచన పర్వతాభావమే వాస్తవిక కారణముగా కన్పించుచున్నది. ధనము పోగొట్టుకొనిఏడ్చువాని దుఃఖమునకు ధనపహరణమును హేతువుగా నుత్ప్రేక్షించుట జరుగదు గదా. అట్లే ప్రకృతమున కాంచన పర్వతాభావము బ్రహ్మదుఃఖమునకు వాస్తవిక కారణమే కనుక ఇచట ద్రవ్యాభావ హేతూత్ప్రేక్ష కుదరదు. దానికి మరియొక ఉదాహరణము చెప్పుకొనవలెను.

ద్రవ్యఫలోత్ప్రేక్షా యథా –

కైలాస బృందాయ యతంతి రుద్రాః
మరాళసంఘాయ యతంతి వేధసః।
క్షీరార్ణ వౌఘాయచ పద్మనాభాః
దృష్ట్వా స్ఫుటం రామ విభో ర్యశోభరమ్॥ 86

అత్ర కైలాస బృందాయ ఇత్యాదౌ ద్రవ్యస్య ఫలత్వమ్।

అర్థము :

రామవిభోః – రామేశ ప్రభువు యొక్క । యశోభరం – కీర్తి సముదాయమును ; దృష్ట్వా – చూచి । రుద్రాః – రుద్రులు । కైలాస బృందాయ – కైలాసముల గుంపుకొరకు । యతంతి – ప్రయత్నించుచున్నారు । వేధసః – బ్రహ్మదేవులు । మరాళ సంఘాయ – హంసలసంఘముకొరకు । యతంతి – ప్రయత్నించుచున్నారు । పద్మనాభాః – విష్ణువులు । క్షీరార్ణవౌఘాయచ – పాల సముద్రముల సమూహముకొరకు । యతంతి – ప్రయత్నించుచు న్నారు । స్ఫుటం – నిశ్చయము ।

వివరణము :

రామేశుని కీర్తితో అన్ని పర్వతాలు, అన్నిపక్షులు, అన్ని సముద్రాలును తెల్లబడినందున రుద్రులు కైలాసములకొరకు, బ్రహ్మదేవులు హంసలకొరకు, విష్ణుదేవులు పాల సముద్రములకొరకు ప్రయత్నముచేసి వెదకికొనవలసి వచ్చినది. ఇచట రుద్ర బ్రహ్మ విష్ణువుల ప్రయత్నములకు కైలాస మరాళ క్షీరార్ణవములను ఫలముగా నుత్ప్రేక్షించినందున ఇది ద్రవ్య ఫలోత్ప్రేక్షయని గ్రంథకారుని యభిప్రాయము. కాని ఇచ్చట కైలాస ప్రాప్తి మొదలగు నవి వారల ప్రయత్నములకు వాస్తవిక ఫలములే కనుకను, వారల ప్రయత్నముకూడ సిద్ధము కాదు కనుకను ఇచట ఉత్ప్రేక్ష లేదు. మరి దీనికిని మరియొక ఉదాహరణము వేరుగా చెప్పు కొనవలెను. ఇచట రుద్రులు పదకొండుగురని యనుకొనినను కైలాసవాసి యొక్కడే యైనందునను, సృష్టికర్తయగు బ్రహ్మకూడ ఒక్కడే కనుకను, విష్ణువుకూడ ఒక్కడే కనుకను బహువచనము పూజ్యార్థములోకాని, కల్పభేద ప్రయుక్త బహుత్వమును బట్టి కాని ప్రయోగించబడిన దని గమనించవలెను. ఇక "యత" ధాతువుయొక్క పరస్మైపద ప్రయోగము చింత్యమే.

ద్రవ్యాభావ ఫలోత్ప్రేక్షా యథా –

ఫణీంద్ర కైలాస పయఃపయోధి స్వర్దంతినా మప్యవిలక్షణానామ్।
జగత్యభావాయ భవద్యశశ్శ్రీః రామేశ సర్వం ధవళీకరోతి॥ 87

ఏవమన్యేపి భేదా ఉదాహరణీయాః।

**అర్థము :**

రామేశ – ఓరామేశ ప్రభూ । భవద్యశశ్శ్రీః – నీకీర్తి సంపత్తి । అవిలక్షణానాం అపి – విలక్షణములు కానట్టి । ఫణీంద్ర – ఆదిశేషుని యొక్క । కైలాస – కైలాసము యొక్క । పయః పయోధి – పాల సముద్రముయొక్క । స్వర్దంతినాం – ఐరావతము యొక్క । జగతి – ప్రపంచమునందు । ఆభావాయ – అభావముకొరకు । సర్వం – మొత్తమును । ధవళీకరోతి – తెల్లగాచేయుచున్నది ।

**వివరణము :**

రామేశ ప్రభువు కీర్తి ప్రపంచములోని ప్రతి వస్తువును తెల్లగా చేసివేయుచున్నది. ఎందుకనగా ఆదిశేష కైలాసాదులు కూడ లేకపోవుట కొరకేమోయని ఇచట ధవళీకరణ క్రియలకు ఆదిశేషాద్యభావము అనగా ద్రవ్యాభావము ఫలముగా నుత్ప్రేక్షించబడినది. అందుచే ఇది ద్రవ్యాభావ ఫలోత్ప్రేక్ష. అన్నిటిని ధవళముగా చేసినందున ఆదిశేష కైలాసాదులు తామే తెల్లగా నున్నవను నొక ప్రత్యేక వైశిష్ట్యము కోల్పోవును. అందుచే వాని యభావము ఇచట పేర్కొనబడుచున్నది. ఇట్లు మిగిలిన ఉదాహరణములు గూడ చూచుకొనవలెనని గ్రంథకారు డుత్ప్రేక్షాలంకార ప్రకరణమును ముగించుచున్నాడు.

అథ అతిశయోక్త్యలంకారః—

అనుపాదానం విషయస్యారోప్యస్యైవ యదుపాదానమ్।
సాతిశయోక్తిర్జ్ఞేయా భేదాశ్చస్యా భవంతి చత్వారః॥ 88

యత్రారోప విషయస్యానుపాదానాత్ ఆరోప్యమాణ ముపనిబధ్యతే । సేయ మతిశయోక్తిః । అస్యాశ్చత్వారో భేదాః– 1 భేదే సత్యభేదః 2 అభేదేపతి భేదః 3 అసంబంధే సతి సంబంధః 4 సంబంధే సతి అసంబంధః। క్రమేణో దాహరణాని।

వివరణము :

ఉపమేయమును చెప్పక ఉపమానమును మాత్రమే చెప్పినపుడు అతిశయోక్తి అలంకారమగును. ఇది [1]భేదముండగా నభేదము చెప్పుట [2]అభేదముండగా భేదము చెప్పుట [3]సంబంధము లేకపోయినను సంబంధము చెప్పుట [4]సంబంధమున్నను అసంబంధము చెప్పుట అని నాలుగు రకములుగా నుండును. వరుసగా వీనిని ఉదాహరించుట జరుగును.

భేదే సతి- అభేదః యథా —

విశ్వేశాంక సుఖోపలాలితతయా త్వేకాంతతస్త్వం గుహః
ఆర్యాహ్లాదన కారణేన చ గుహో జజ్ఞే భవానే వసః।
భేదోఽయం జితవాన సౌ పరుషయా శక్త్యా క్వచిత్తారకం
శ్రీరామేశవిభో తయైవ నితరాం సంరక్షసే తారకమ్॥ 89

అత్ర తారక శబ్ద వాచ్యయోర సురమహా మంత్రయోర్వేదేసత్య భేదః।

అర్థము :

విశ్వేశాంక — విశ్వేశ ప్రభువుయొక్క — శివునియొక్క — యొడియందు । సుఖ — సుఖముగా । ఉపలాలితతయా — లాలించబడిన వాడవగుటచేత । త్వంతు — నీవేమో । ఏకాంతతః - నియతముగా । గుహః — కుమారస్వామివి । ఆర్యాహ్లాదన కారణేనచ — ఆర్యులకు — పార్వతీదేవికిని - ఆహ్లాదము కలిగించుటచేత । సః — ఆ । గుహఏవ — కుమారస్వామియే । భవాన్ — నీవుగా । జజ్ఞే — పుట్టెను । అయం — ఇది । భేదః — భేదము । అసౌ — ఈ కుమారస్వామి । పరుషయా — కఠినమైన । శక్త్యా — శక్తిచేత । క్వచిత్ — ఒకానొకచోట । తారకం — తారకుడను రాక్షసుని । జితవాన్ - జయించెను । శ్రీరామేశవిభో - ఓరామేశ ప్రభూ! (త్వం — నీవు) । తయైవ — ఆ శక్తిచేతనే । నితరాం — బాగుగా । తారకం — తారక మంత్రమును । సంరక్షసే - రక్షించుచున్నావు ।

వివరణము ;

విశ్వేశుడనగా రామేశ ప్రభువు తండ్రి, పరమ శివుడు అనియు అర్థము. అట్లే ఆర్య అనగా పూజ్యులు, పార్వతీదేవి అనియు అర్థము. ఇపుడు కుమారస్వామికి రామేశ ప్రభువునకు కూడ విశ్వేశాంకోపలాలనము ఆర్యాహ్లాదనము అను రెండు ధర్మములు సమానములైనవి. అందుచే ఆ కుమారస్వామియే ఈ ప్రభువు రూపములో జన్మించినాడని చెప్పుచున్నాడు ఐనను కొంత భేదముకూడ ఉన్నది. అదేమనగా ఈ కుమారస్వామి తారకనామముగల రాక్షసుని సంహరించినాడు. ఈ రామేశ ప్రభువేమో తారక నామముగల మహామంత్రమును రక్షించుకొనినాడు. ఇచ్చట తారక శబ్దమున కర్థములగు రాక్షస, మహా మంత్రములకు

వస్తుతః భేదమున్నను అభేదము చెప్పబడినందున ఇది భేదే అభేదాతిశయోక్తి. ఇక్కడ రక్ష ధాతువున కాత్మనే పదప్రయోగము చింత్యము. ప్రస్తుతః ఇచ్చట తారక సంహర్తయొకరు. తారక రక్షకుడొకరు అను భేదమున్నప్పటికి గుహ ప్రభువులక భేదము చెప్పబడినందున భేదే అభేదాతిశయోక్తియని గ్రహించదగును (జేనే 'జజ్ఞే' గా సవరించబడినది).

యథావా –

రామేశ త్వం తు దిగ్దంతీ కరపుష్కర లాంఛనాత్।
అనాత్త గంధం తే దానం ఆత్త గంధంతు దంతినః॥ 90
అత్ర రామేశ దిగ్దంతినోః భేదే సత్యభేదః।

అర్థము :

రామేశ – ఓరామేశ ప్రభూ। త్వం తు – నీవేమో। కరపుష్కర లాంఛనాత్ – చేతియందు పద్మ చిహ్నమున్నందున, తొండమునందు కమలమను చిహ్నమున్నందున। దిగ్దంతీ – దిగ్గజమవు। తే – నీయొక్క। దానం – దానము। అనాత్త గంధం — స్వీకరించని గంధము గలది। దంతినః – దిగ్గజముయొక్క। దానం – మదము। ఆత్తగంధం స్వీకరించిన గంధముగలది।

వివరణము :

భేదే అభేదాతిశయోక్తికిమరియొక ఉదాహరణమిచ్చుచున్నాడు. దిగ్గజముయొక్క తొండమందు కమలమున్నది. రామేశ ప్రభువు చేతియందు కమల చిహ్నమున్నది. ఇట్లు కరకమల లాంఛనమును బట్టి ప్రభువు దిగ్గజములకు అభేదము చెప్పబడుచున్నది. ఐనను కొంత భేదము కూడ కలదని చెప్పుచున్నాడు. దానమనగా వితరణ మనియు, ఏనుగు మదమనియు నర్థము. ప్రభువు దానమునకు గంధము లేదు, కాని దిగ్గజ దానమునకు గంధ మున్నది. ఇట్లు దిగ్గజ ప్రభువులకు పరస్పర భేదమున్నను అభేదము చెప్పబడినది. కావున నిదియు భేదే అభేదాతిశయోక్తికి ఉదాహరణమని చెప్పుచున్నాడు.

ద్వితీయో యథా – అభేదేసతి భేదః –

కిమప్యన్య ద్ధైర్యం కిమపి మహదన్యద్వితరణం
కిమప్యన్య త్తేజః కిమపి పునరౌన్నత్యమధికమ్।
తవ శ్రీరామేశ ప్రభుతిలక సర్వం నవమిదం
తతో నూనం సృష్టో న భవతి భవానంబుజ భువా॥ 91
అత్ర ధైర్యాదీనా మభేదేఽపి అన్యత్వేన భేదః కల్పితః।

అర్థము :

శ్రీరామేశ ప్రభుతిలకః — ఓరామేశ ప్రభుశేఖరా । తవ — నీయొక్క । ధైర్యం — ధైర్యము । కిమపి - ఏదో ఒక । అన్యత్ - వేరైనది । వితరణం — దానము । మహత్ — గొప్పది । కిమపి — చెప్పరానట్టి । అన్యత్ - వేరైనది । తేజః - పరాక్రమము । కిమపి — అనిర్వాచ్యమగు । అన్యత్ - వేరైనది । కిమపి పునః - ఏదో చెప్పరాని । ఔన్నత్యం - గొప్పదనము । అధికమ్ — వేరైనదియె । ఇదం — ఇది । సర్వం — అంతయు । నవం — క్రొత్తది । తతః — అందుచే । భవాన్ - నీవు । అంబుజ భువా — బ్రహ్మచేత । సృష్టః — సృష్టించబడిన వాడవు । న భవతి - కావు । నూనం — నిశ్చయము ।

వివరణము :

ఇచ్చట రామేశ ప్రభువు ధైర్యాదులు సర్వసాధారణములే, ఐనను లోక విలక్షణములుగా పేర్కొనబడినందున ఇచ్చట అభేదే భేదాతిశయోక్తి యలంకారమగుచున్నది.

అసంబంధే సంబంధః యథా—

భావత్కై స్తవ భర్మ హర్మ్యశిఖరే బద్ధోరు దీర్ఘధ్వజైః
అగ్రోదగ్రదుకూల విభ్రమ భరై రభ్రంలిహైస్తాడితా।
మందాకి న్యజనిష్ట బిందు నివహాకారా విహాయ స్థ్సలే
శ్రీరామేశ మహీంద్ర తానిహ జనస్తారాగణం మన్యతే॥ 92

అత్ర మందాకిన్యా ధ్వజై రసంబంధేఽపి సంబంధః।

అర్థము :

శ్రీరామేశ మహీంద్ర — ఓరామేశ ప్రభూ । తవ — నీయొక్క । భర్మ — బంగారు । హర్మ్య — మేడయొక్క । శిఖరే — అగ్రభాగమునందు । అభ్రంలిహైః — ఆకాశమునంటు నట్టియు । అగ్ర — పైభాగమునందు । ఉదగ్ర — విశాలమైన । దుకూల — పట్టువస్త్రము యొక్క । విభ్రమ భరైః — విలాసాతిశయములు గలవియగు । భావత్కైః — నీపరిజనుల చేత । బద్ధ — కట్ట బడిన । ఉరు — గొప్పనైన । దీర్ఘ — పొడవైన । ధ్వజైః — ధ్వజముల చేత । తాడితా — కొట్టబడినదియై । మందాకినీ — ఆకాశగంగ । విహాయస్థ్సలే — ఆకాశము నందు । బిందు నివహాకారా — బిందువుల గుంపు యొక్క ఆకారము గలదియై । అజనిష్ట — ఆయెను । తాన్ — ఆబిందువులను । ఇహ — ఇచ్చట । జనః — జనము । తారాగణం — నక్షత్ర సముదాయమునుగా । మన్యతే — తలచుచున్నది ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు మేడపై కట్టిన పతాకల కదలికల చేత ఆకాశగంగ నీరు చెదరి బిందువులుగా మారినది. ఆ బిందువులనే జనము నక్షత్రములని అనుకొనుచున్నారు. ఇట్లు గంగానదికి పతాకలతో సంబంధము లేకపోయినను సంబంధమున్నట్లు వర్ణించుటచేత అసంబంధే సంబంధాతిశయోక్తి అలంకారమగుచున్నది.

యథావా–

త్వద్దానాంబు మహాప్రవాహ మిలనాత్ సంవర్ధితే వారిధౌ
వ్యోమాగ్ర స్పృశి లీలయా సురనదీ భర్త్రా చిరాత్సంగతా।
కించ వ్యోమ్ని కుళీర మీన మకరా వృత్తిం గతాః కోటిశః
శ్రీవిశ్వేశ్వర గర్భనందన వన ప్రోద్భాసి కీర ప్రభో॥ 93

అత్ర సముద్రస్య సురనదీ సంబంధాభావేఽపి సంబంధః కథితః।

అ ర్థ ము :

శ్రీ విశ్వేశ్వర – విశ్వేశ ప్రభువుయొక్క । గర్భనందనవన - గర్భ మనెడు నందన వనమున । ప్రోద్భాసి – ప్రకాశించు । కీర ప్రభో – చిలుక వగు మహారాజా ! । త్వత్ – నీయొక్క । దానాంబు – దానజలము యొక్క । మహా ప్రవాహ – గొప్ప ప్రవాహము యొక్క । మిలనాత్ – కలయికవలన । సంవర్ధితే – వృద్ధి చెందించబడిన । వారిధౌ – సముద్రము । వ్యోమాగ్ర స్పృశి – ఆకాశపుటంచులనుతాకగా । లీలయా – విలాసముచేత । సురనదీ – ఆకాశగంగ । చిరాత్ – చాలా కాలమునకు । భర్త్రా – భర్తతో । సంగతా – కలిసినది । కించ – మరియును । కుళీర – ఎండ్రికాయలు – కర్కాటకములు । మీన – చేపలు – మీనరాశులు । మకరాః – మొసళ్ళు – మకర రాశులు । కోటిశః – కోట్లకొలది । వృత్తి – ఆజీవికను । గతాః – పొందినవి ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు దానోదకములచేత సముద్రము పొంగి పొరలి ఆకాశము యొక్క అంచుల వరకు పెరిగినది. అపుడక్కడనేయున్న ఆకాశగంగకు తన భర్తయగు సముద్రునితో సమాగమమేర్పడినది. ఇంతవరకు ఆకాశమున నున్న కర్కాటక (ఎండ్రి) మకర (మొసలి) మీన (చేప) ములకు బ్రతుకు తెరవగు నీరు లేకుండెను. ఇపుడు సముద్రపు నీరు ఆంతవరకు వ్యాపించుటచేత ఆకాశములోని కర్కాటకాదులకు చక్కని బ్రతుకు దెరువు కూడ ఏర్పడినది. ఇట్లు ఆకాశ గంగకు సముద్రముతో సంబంధములేక పోయినను ఉన్నట్లు వర్ణించుటచేత ఇదియు అసంబంధే సంబంధాతిశయోక్తియే.

.... .... ....

.... .... ....

.... .... ....

ఇచ్చట రెండు పుటల వరకు గ్రంథము చెడినదని మూల గ్రంథము యొక్క వ్రాత ప్రతిని తయారు చేసిన వారు చెప్పుచున్నారు —

... ... ...

అత్ర అహీశ్వరాదీనాం అప్రాకరణికత్వం ఉపమానత్వాత్।

ఇచట అహీశ్వరుడు మొదలగునవి ఉపమానములు కనుక అప్రాకరణికములు. అను — నీపంక్తిని బట్టి ముందు చెప్పు శ్లోకమును బట్టియు నిది తుల్యయోగితా లంకార ప్రకరణమని గమనించవచ్చును.

సురేభ్యో భూసురేభ్యశ్చ సదా వితరతి త్వయి।
రామేశ దివి లజ్జంతే మణిర్ధేనుశ్చ పాదపః॥
అత్ర లజ్జంత ఇతి క్రియా సాధారణ ధర్మః। 94

అ ర్థ ము :

రామేశ — రామేశప్రభూ । త్వయి — నీవు । సదా — ఎల్లపుడు । సురేభ్యః — దేవతలకు । భూసురేభ్యశ్చ — బ్రాహ్మణులకు । వితరతిసతి - దానము చేయువాడవగుచుండగా । దివి — స్వర్గమునందు । మణిః — చింతామణి । ధేనుః — కామధేనువు । పాదపశ్చ — కల్పవృక్షముకూడ । లజ్జంతే — సిగ్గుపడుచున్నవి ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభు దానమును చూచి చింతామణి - కామధేను - కల్పవృక్షములు సిగ్గు జెందుచున్నవి. ఇదియొక తుల్యయోగితాలంకారము. కేవల ప్రకృతములకు కాని, కేవలాప్రకృతములకు కాని ఏక సాధారణ ధర్మ సంబంధము వర్ణించబడినచో తుల్యయోగితాలంకారమగును. ప్రకృత శ్లోకములో చింతామణి కామధేను కల్పవృక్షములు అప్రకృతములు. వీనికి లజ్జారూపమగు నొకే సాధారణ ధర్మముతో సంబంధము చెప్పబడినందున ఇదియు నొకరకమైన తుల్యయోగితాలంకారమని గమనించవలయును.

అథ దీపకాలంకారః

గమ్యం స్యా దౌపమ్యం యత్ర పునస్సదృశ ధర్మ సంబంధాత్।
ప్రకృతాప్రకృతానాం సమ్మిలితానాం తత్తు దీపకం షోఢా॥ 95

యత్ర ప్రకృతా ప్రకృతానాం సంభూయ వర్తమానానాం సమాన ధర్మ సంబంధేన ఔపమ్యం గమ్యతే తద్దీపకమ్। అత్ర సాధారణ ధర్మస్య ఆది మధ్యాంత గతత్వేన త్రైవిధ్యే గుణక్రియారూపద్వైవిధ్యేన షడ్విధత్వమ్।

క్రమేణ యథా –

**వి వ ర ణ ము :**

ప్రకృతములకును అప్రకృతములకును కలిసి ఒకే ధర్మము యొక్క సంబంధము వర్ణించబడినందున ఎక్కడ సాదృశ్యము గమ్యమగునో అది దీపకాలంకారము. మొదట ధర్మము చెప్పబడిన నది ఆది దీపకము. మధ్యలో ధర్మము చెప్పబడిన నది మధ్య దీపకము. చివరిలో ధర్మము చెప్పబడిన నది అంత్య దీపకము. ఇట్లు దీపకము మూడు విధములు. ఈ ధర్మము కూడ గుణరూపము, క్రియారూపము అని రెండు విధములు. కనుక నీ దీపకము ఆరు విధములు. వరుసగా నుదాహరణములు.

విధత్తే ధనదం లోకే న కం రామేశ్వర ప్రభో!।
త్వత్కృపాలోక సరణిః కల్పవల్లి మతల్లికా॥ 96

అత్ర కృపాలోక సరణేః ప్రాకరణికత్వం కల్పలతాయాశ్చా ప్రాకరణికత్వమ్।

**అ ర్థ ము :**

రామేశ్వర ప్రభో – ఓ రామేశ్వర ప్రభూ। త్వత్ – నీయొక్క। కృపాలోక – కృపా దృష్టియొక్క। సరణిః – మార్గము। కల్పవల్లీమతల్లికా – శ్రేష్ఠమైన కల్పలత। లోకే – లోకమునందు। కం – ఎవరిని। ధనదం – కుబేరునిగా। నవిధత్తే – చేయదు ?।

**వి వ ర ణ ము :**

రామేశ ప్రభువు కృపా దృష్టియు, కల్పలతయు లోకములో ప్రతి వ్యక్తిని కుబేరునిగా మార్చివేయునని తాత్పర్యము. ఇచ్చట కృపాదృష్టి ప్రకృతము. కల్పలత అప్రకృతము. ఈ రెంటికిని "అందరిని కుబేరులుగా చేయుట" యను ఒకే ధర్మముతో సంబంధము చెప్పబడినది. ఇక్కడ ఈ ధర్మము క్రియా రూపము. అదియు "విధత్తే ధనదం" అని మొదట చెప్పబడినది. అందుచే ఇది క్రియారూప ధర్మము ఆదియందు గల ఆది దీపకము.

ఘర్మావసానేన ఘన స్సుసమ్మతాం
రామేశ ధారాధరతాం విధత్తే।

త్వత్కోప దృష్ట్యాఽహిత కామినీ దృక్
దానాంభసా త్వత్కర పుష్కరం చ॥ 97

అత్ర ఘన స్యాప్రాకరణికత్వం। ఇతరయోః ప్రాకరణికత్వమ్।
ధారాధరత్వరూప ధర్మస్య మధ్య ఉపాత్తత్వా న్మధ్యదీపకత్వం చ।

అర్థము :

రామేశ — రామేశప్రభూ । ఘనః — మేఘము । ఘర్మావసానేన — వేసవి అంతమగుటతో । సు సమ్మతాం — అందరికి నభిమత మగు । ధారాధరతాం — ధారా వృష్టికురియు మేఘ భావమును । విధత్తే — ధరించును । త్వత్కోపదృష్ట్యా — నీకోపదృష్టితో । అహిత కామినీ దృక్ — శత్రుస్త్రీల దృష్టి । దానాంభసా — దానోదకముచేత । త్వత్కర పుష్కరంచ — నీకరకమలము కూడ । ధారా ధరతాం — మేఘ భావమును । విధత్తే — ధరించును ।

వివరణము :

వేసవి ముగియుటతో మేఘము వర్షించునట్లు రామేశ ప్రభువు కోపదృష్టి పడుటతో శత్రుస్త్రీల కనులు, దాన జలముతో ప్రభువు హస్తముగూడ వర్షించునని తాత్పర్యము. ఇచట అప్రకృత మగు మేఘమునకు - ప్రకృతములగు శత్రుస్త్రీ నేత్ర రామేశ కరకమలములకు ఒకే క్రియతో సంబంధము చెప్పబడినది. అదియు నాద్యంతములలో గాక నడుమ చెప్పబడినది. అందుచే ఇది మధ్య దీపకాలంకారము.

పతగాధిపతౌ దివి ప్రదీప్తే ఫణిన స్త్వత్పద పంకజే సభాయామ్।
స్ఫురితే విమతాశ్చ గర్తమేవ త్వరయామ్మన్నవిభో! సమాశ్రయంతే॥ 98

అత్ర ఫణినామప్రాకరణికత్వం, ప్రకృత నాయకాని ష్టానాం తు ప్రాకరణికత్వమ్। గర్త సంశ్రయణం సమాన ధర్మః। ఏవమేవ గుణయోగేఽప్యుదాహార్యమ్।

అర్థము :

అమ్మన్న విభో — అమ్మన్న ప్రభూ । దివి — ఆకాశమునందు । పతగాధిపతౌ — సూర్యుడు । ప్రదీప్తే సతి — ప్రకాశించునంతనే । ఫణినః — సర్పములు । సభాయాం — సభయందు । త్వత్పద పంకజే — నీపాదపద్మము । స్ఫురితే సతి — కదలునంతనే । విమతాశ్చ — శత్రువులుగూడ । త్వరయా — తొందరగా । గర్తమేవ — గోతినే । సమాశ్రయంతే — ఆశ్రయించుచున్నారు ।

వి వ ర ణ ము :

సూర్యుడు ఉదయించగనే పాములు పుట్టలలోనికి జొరబడునట్లు, రాజు కాలు కదల్పగనే శత్రువులు గోతులలో దూరుచుందురని తాత్పర్యము. ఇచ్చట అప్రకృతములగు పాములకు ప్రకృత శత్రువులకును గర్త సమాశ్రయణ రూపైక ధర్మ సంబంధము చెప్పబడినది. అదియు చివరలో నున్నది. అందుచే ఇది అంత్యదీపకము. ఈ యుదాహరణములన్నిటిలోను క్రియ సాధారణ ధర్మము. ఇట్లే గుణము సాధారణ ధర్మముగాగల దీపకముల నుదాహరించుకొనవలెను.

అథ పదార్థ గతాలంకార నిరూపణా నంతరం వాక్యార్థ గతాలంకార ద్వయం నిరూప్యతే।

అథ ప్రతి వస్తుపమా-

యత్ర భవే త్సామాన్యం వాక్యార్థగతం పృథగ్వినిర్దిష్టమ్।
ఔపమ్యే యది గమ్యే సా ప్రతి వస్తూపమా ద్విధాదిష్టా॥ 99

యత్ర వస్తు ప్రతివస్తుతయా భిన్న వాక్య గతత్వేన సామాన్యం నిర్దిశ్యతే సా ప్రతివస్తూపమా। సాధర్మ్య వైధర్మ్యాభ్యాం ద్వేధా।

వి వ ర ణ ము :

పదార్థ గతకాలంకారము లింతవరకు నిరూపించబడినవి. ఇక వాక్యార్థ గతాలంకారములౌక రెండు నిరూపించబడును. వానిలోనిపుడు ప్రతివస్తూపమాలంకారము నిరూపించబడుచున్నది. సామ్యము ప్రతీత మగుచుండ, రెండు వాక్యముల యందు విడివిడిగా సామాన్య ధర్మము వస్తు ప్రతివస్తు భావముతో చెప్పబడిన నది ప్రతి వస్తూ పమాలంకార మనబడును. ఇది సాధర్మ్యముతోను, వైధర్మ్యముతోను ఏర్పడ వచ్చును. కనుక నీయలంకారము రెండు విధములు.

క్రమేణ యథా-

వరుసగా నుదాహరణములు :

విద్వ ద్దారిద్ర్య హననే ఏకో రామేశ్వరః ప్రభుః।
జగదాం ధ్యాపహరణే వివస్వాన్ కేవలం క్షమః॥ 100

అత్ర వాక్యద్వయే హనన మపహరణం ప్రభుః క్షమః ఇతి చైక
ఏవ ధర్మోవారద్వయ ముపాత్త ఇతి వస్తు ప్రతివస్తుత్వమ్।
రామేశ భాస్కర యోర్గమ్యత ఏవౌపమ్యమ్।

అర్థము :

విద్వత్ — విద్వాంసుల । దారిద్ర్య — దారిద్ర్యము యొక్క । హననే — తొలగించుటలో । ఏకః — ఒక । రామేశః — రామేశ ప్రభువే । ప్రభుః - సమర్థుడు । జగదాంధ్య— జగత్తులోని చీకటియొక్క । అపహరణే — నివారించుటలో । వివస్వాన్ కేవలం — సూర్యుడు మాత్రమే । క్షమః — సమర్థుడు ।

వివరణము :

విద్వాంసుల దారిద్ర్యమును రామేశ ప్రభువు మాత్రమే తొలగించగలడు. ప్రపంచములోని చీకటిని సూర్యుడు మాత్రమే తొలగించగలడు. ఇచ్చట రెండు వాక్యములలో విడివిడిగా హననాపహరణ క్షమప్రభు శబ్దములతో సామాన్య ధర్మము నిర్దిష్టమైనది. రాజునకు సూర్యునికి సామ్యముకూడ గమ్యమగుచున్నది. విరుద్ధ ధర్మముతోకాక సమాన ధర్మముతోనే ఇచ్చట సామ్యము గమ్యము కనుక నిది సాధర్మ్యేణ ప్రతివస్తూపమాలంకారమునకు ఉదాహరణము.

యథావా-మదీయే భాగవత చంపూ ప్రబంధే —

ఉద్దామోదయ గర్వ పర్వ తిమిర వ్యాలుప్త సర్వేంద్రియ
వ్యాపారక్షితి భృచ్ఛిరో విశసనే శ్రీకృష్ణ ఏకః ప్రభుః
సప్తస్థాన విసారి నిర్భరమదోద్రేకాంధ గంధ ద్విప
శ్రేణీ బంధుర కుంభ పీఠదలనే హర్యక్ష ఏవ క్షమః ॥ 101

అత్ర వాక్యద్వయే విశసనం-విదలన మితి, ప్రభుః క్షమ ఇతి,
ఏక ఏవ ధర్మో వారద్వయ ముపాత్త ఇతి వస్తుప్రతివస్తుత్వమ్।
కృష్ణ హర్యక్షయోః గమ్యత ఏవౌపమ్యమ్,

అర్థము :

ఉద్దామోదయ — గొప్ప వృద్ధిగల । గర్వ పర్వ — అహంకార దశలనెడు । తిమిర— చీకటిచేత । వ్యాలుప్త — లోపించిన । సర్వేంద్రియ — అన్ని ఇంద్రియముల । వ్యాపార — వ్యాపారములుగల । క్షితిభృత్ — రాజుల । శిరో విశసనే తలల — పగులగొట్టుటయందు ।

శ్రీకృష్ణః — శ్రీకృష్ణుడు । ఏకః - ఒక్కడే । ప్రభుః — సమర్థుడు । సప్తస్థాన — ఏడు ప్రదేశములందుండి । విసారి — స్రవించుచున్న । నిర్భర — అధికమగు । మహోద్రేక — మదాతిశయముచేత । అంధ — గ్రుడ్డివియగు । గంధద్విప — మదపుటేనుగుల । శ్రేణి — గుంపులయొక్క । బంధుర — కఠినమైన । కుంభపీఠ — పీఠములవంటి కుంభస్థలముల । దలనే — చీల్చుటయందు । హర్యక్షఏవ — సింహమే । క్షమః — సమర్థమైనది।

వి వ ర ణ ము :

మదపుటేనుగుల కుంభస్థలములను సింహము చీల్చునట్లు, దుర్మదాంధులగు రాజుల కంఠములను శ్రీకృష్ణుడే చీల్చగలడని తాత్పర్యము. ఇచ్చటను రెండు వాక్యములలో విడి విడిగా విశసన—విదళన. ప్రభు క్షమ శబ్దములచేత సామాన్య ధర్మము చెప్పబడినందున వస్తు ప్రతివస్తూ పమాలంకారము. కృష్ణ సింహములకు సామ్యము ఇక్కడ తెలియుచున్నది.

అనల్ప దర్పోద్ధత శత్రు భంగే ప్రగల్భతేఽమ్మన్న విభుస్త్వదన్యః।
గర్వోన్నమత్ పర్వత పక్షభేదే దక్ష స్స్వతః కోను మరుత్వతోఽన్యః॥102

అత్రాపి వైధర్మ్యేణ రామ దేవేంద్రయో రౌపమ్యం గమ్యతే।
ఇతి ప్రతివస్తూపమా—

అ ర్థ ము :

అనల్ప — గొప్పనైన । దర్ప - గర్వముచేత । ఉద్ధత — ఉద్ధతులై । శత్రు — శత్రువులయొక్క । భంగే — వినాశమునందు । అనన్యః - మరియొకడు సాయముగాలేని । అమ్మన్న విభుః — అమ్మన్న ప్రభువే । ప్రగల్భతే — సమర్థుడగుచున్నాడు । గర్వోన్నమత్ - గర్వముచేత పెరిగెడు । పర్వత - కొండలయొక్క । పక్షభేదే - రెక్కలు భేదించుటలో । స్వతః — స్వయముగా । మరుత్వతః — ఇంద్రునికంటె । అన్యః — మరియొకడు । కోను - ఎవడు । దక్షః - సమర్థుడు ।

వి వ ర ణ ము :

శత్రు వినాశమున అమ్మన్న ప్రభువే సమర్థుడు. పర్వత పక్షచ్ఛేదమున ఇంద్రుని కంటె మరి ఎవడు సమర్థుడు? అని వర్ణించుటవలన నిచ్చటగూడ రెండు వాక్యములలో విడి విడిగా భంగ—భేద—ప్రగల్భ—దక్ష—శబ్దములతో సామాన్య ధర్మము చెప్పబడినది. రాజునకు ఇంద్రునికిని సామ్యము గమ్యమగుచున్నది కనుక నిదియు పాధర్మ్యేణ వస్తు ప్రతివస్తూప మాలంకారమునకే యుదాహరణము. మూలమున 'వైధర్మ్యేణ' యని పొరపాటున పడి యుండవచ్చును — ఇది ప్రతి వస్తూపమ—

అథ దృష్టాంతాలంకారః—

బింబ ప్రతి బింబతయా యద్యుపమానోపమేయయోః సామ్యమ్।
పృథగాదిష్టం స స్యాత్ దృష్టాంతసోఽపి కీర్త్యతే ద్వివిధః॥ 103

యత్ర బింబ ప్రతిబింబ భావేన భిన్న వాక్యగతయో రుపమానోప మేయయోః సామాన్యం నిబధ్యతే స దృష్టాంతాలంకారః। సోఽపి సాధర్మ్య వైధర్మ్యాభ్యాం ద్విధా భవతి॥ క్రమేణయథా —

వివరణము :

వేరు వేరు వాక్యములలోని ఉపమానోపమేయములకు విడి విడిగా బింబ ప్రతి బింబ భావముగా సామాన్య ధర్మము చెప్పబడిన నది దృష్టాంతాలంకారమగును. ఇదియు సాధర్మ్యేణ వైధర్మ్యేణ యని రెండు రకములుగా నుండును. వరుసగా నుదాహరణములు.

సంత్వన్యే ప్రభవో లోకే ప్రభు రమ్మన్న ఏవ సః।
గ్రహా సర్వేఽపి వర్తంతాం ఆహ్లాదే చంద్ర ఏవ సః॥ 104

అత్ర రామేశ చంద్రయోఃఽబింబ ప్రతిబింబ భావేన ఔపమ్యం గమ్యతే। ప్రాభవాహ్లాదయో ర్భిన్న ధర్మత్వాత్ బింబ ప్రతిబింబ భావః

అర్థము :

లోకే - లోకమునందు । అన్యే - ఇతరులు । ప్రభవః - రాజులు । సంతు — ఉండనీ । సః- ఆ । అమ్మన్నఏవ — అమ్మన ప్రభువే । ప్రభుః - ప్రభుత్వముగలవాడు । గ్రహాః - గ్రహములు । సర్వేఽపి — అన్నియు । వర్తంతాం — ఉండనీ । ఆహ్లాది — ఆహ్లాదము గలిగించువాడు । సః — ఆ । చంద్రఏవ — చంద్రుడే ।

వివరణము ;

ప్రభువు లనేకు లున్నను విగ్రహానుగ్రహశక్తి రూపమగు ప్రభుత్వ సంపత్తి గలవాడు అమ్మన్న ప్రభు వొక్కడే. గ్రహము లెన్ని యున్నను అందరికిని అందించగల ఆహ్లాదము గలవాడు చంద్రుడొక్కడే. ఇచ్చట వేరు వేరు వాక్యములలోని ఉపమానోప మేయములగు చంద్ర—, ప్రభువులకు ఆహ్లాద ప్రభుత్వరూప భిన్నధర్మములు బింబ ప్రతిబింబ భావముతో నిర్దిష్టములైనవి. సామ్యముగూడ ప్రతీత మగుచున్నది. కనుక ఇది దృష్టాంతాలంకారము.

రామేశ కల్పద్రుమ మాశ్రితేషు విద్వత్సు దారిద్ర్యకథా కుత స్స్యాత్।
గాఢం తమ స్తిష్ఠతి తావదేవ యావ ద్రవిర్నాంచతి పూర్వశైలమ్॥ 105

అత్రాఽపి యథా రవే రుదయగిరి సమారోహణే నైశం తమో నాశము పైతి । తథా రామేశ కల్పద్రుమాశ్రయణేన విదుషాం దారిద్ర్యం నశ్యతీతి ఉపమా వైధర్మ్యేణాఽపి గమ్యతే । ఇతి దృష్టాంతః ।

అర్థము :

రామేశ కల్పద్రుమం — రామేశ కల్ప వృక్షమును । ఆశ్రితేషు — ఆశ్రయించిన । విద్వత్సు — విద్వాంసుల విషయములో । దారిద్ర్య కథా — దారిద్ర్యముయొక్క కథ । కుతః — ఎందుకు । స్యాత్ — ఉండును । యావత్ - ఎంతవరకు । రవిః — సూర్యుడు । పూర్వశైలమ్ - ఉదయ పర్వతమును । నాంచతి — చేరదో । తావత్ ఏవ — అంతవరకే । గాఢం — గట్టి । తమః — చీకటి । తిష్ఠతి — ఉండును ।

వివరణము :

రామేశుని ఆశ్రయించిన వారికి దారిద్ర్యము లేదు. సూర్యుడు ఉదయించనంతవరకే గదా చీకటి. ఇచ్చట రామేశ సూర్యులకు సామ్యము గమ్యమగుచున్నది. ఐనను దారిద్ర్య తమస్సులు బింబ ప్రతిబింబ భావముతో నిర్దిష్టములైనవి. దారిద్ర్యము ఉండదని, తమస్సు ఉండునని విరుద్ధముగా చెప్పబడినవి. ఐనను సూర్యుడు ఉదయించగనే చీకటి తొలగునట్లు, రాజు నాశ్రయించగనే దారిద్ర్యము తొలగునని తాత్పర్యమేర్పడుచున్నది. కావున నిది వైధర్మ్యేణ దృష్టాంతము.

## అథ నిదర్శనాలంకారః

ప్రకృత ప్రకృతేతరయోః అన్యత్రాయోగతోఽన్య ధర్మస్య।
ప్రతిబింబనస్య కరణం గమ్యం యది సా నిదర్శనా ద్వివిధా॥ 106

యత్రోపమానోపమేయయో ర్మధ్యే అన్య ధర్మస్యాన్య సంబంధా సంభవేన ప్రతిబింబనక్రియా ఆక్షిప్యతే సా నిదర్శనా । సా చ ద్వివిధా, ప్రకృత ధర్మస్య అప్రకృతసంబంధా సంభవమూలా, అప్రకృత ధర్మస్య ప్రకృత ధర్మాసంభవ మూలాచేతి । క్రమేణోదాహరణమ్।

వి వ ర ణ ము :

ఉపమానోపమేయములలో నొకదాని ధర్మముతో మరొక దానికి సంబంధము కుదర నందున బింబ ప్రతిబింబ భావ మాక్షేపించుకొనుట జరిగెనేని, అది నిదర్శనాలంకారమగును. ఇదియు రెండు విధములుగా నుండును. ప్రకృత ధర్మ సంబంధము అప్రకృతమునకు కుదర నందున నొకటి, అప్రకృత ధర్మ సంబంధము ప్రకృతమునకు కుదరనందున మరియొకటి. వరుసగా నుదాహరణములు :—

రాజద్రాజ గుణావలీ పరిమలోదంచ చ్చరిత్రాద్భుత
శ్రీరామేశ సముల్లసంతి భవతః కీర్తేః పరిస్ఫూర్తయః।
నీహారే చ హరేచ నిర్జరవరాహారే చ వాణీ స్మిత
వ్యాహారే చ హరాచలే చ పరితో హారేఽపి హీరేఽపి చ॥ 107

అత్ర కీర్తి పరిస్ఫూర్తీనాం నీహారాది ష్వసంభవేన సాదృశ్యాత్ నీహారా ద్యుపమాన ప్రతిబింబ కరణ మాక్షిప్యతే।

అ ర్థ ము :

రాజత్ — ప్రకాశించు । రాజగుణ — రాజు గుణముల । ఆవలీ — సమూహము యొక్క । పరిమళ — సుగంధముచేత । ఉదంచత్ — భాసించుచున్న । చరిత్ర — ప్రవర్తన చేత । అద్భుత — ఆశ్చర్యముగొలుపు । శ్రీరామేశ — ఓరామేశ ప్రభూ । భవతః — నీ యొక్క । కీర్తేః — కీర్తియొక్క । పరిస్ఫూర్తయః — విలాసములు । పరితః — అంతట । నీహారేచ — మంచునందును। హరేచ — శివుని యందును । నిర్జరవరా హారేచ — దేవతల ఆహారమగు అమృతము నందును । వాణీస్మిత వ్యాహారేచ — సరస్వతీ దేవి చిర్నగవుతో కూడిన మాట యందును । హరాచలేచ — కైలాసము నందును । హారేఽపి — ముత్యముల హార మందును । హీరేఽపిచ — వజ్రమణియందును । సముల్లసంతి — ప్రకాశించుచున్నవి ।

వి వ ర ణ ము ;

మహారాజు కీర్తి విలాసములు మంచు మొదలగు వానియందు భాసించుచున్నవి. ఇచ్చట ప్రకృతము కీర్తి. దాని ధర్మము విలాసము. ఈ విలాసముల సంబంధము అప్రకృత ములగు నీహారాదులకు కుదరదు. అందుకే నీహారాదులయందు కీర్తి విలాసముల వంటి విలా సములు చెప్పుకొనవలసి యుండును. కనుక నిది మొదటి రకపు నిదర్శన.

కనకమయ కలాపం రామభోగ్య గ్రయానం
బహూ (బహవఃః) జవవహ రూఢం సంసర ద్రాజధానీమ్।

వహతి వితత పక్షస్యాబ్జనాభాస్థితస్య
వ్రజభువ మభియాతుః పక్షిరాజస్య లక్ష్మీమ్॥ 108

అత్రోపమేయభూతాం దోలికాయాః పక్షిరాజలక్ష్మీసంబంధాసంభవేన పక్షిరాజలక్ష్మీసదృశీం లక్ష్మీం వహతీతి ప్రతిబింబకరణ మాక్షిప్యతే।

అర్థము :

కనకమయ కలాపం — బంగారు భూషణములు గలయట్టి । బహుజన వహరూఢం — అతివేగముగలవాహకుల నధిష్టించియున్న । రాజధానీం — రాజధానీ నగరమును । సంసరత్ — చేరుచున్న । రామభోగ్యాగ్రయానం — విలాసియగు రామేశ ప్రభువు పల్లకి । వితత పక్షస్య — విశాలమగు రెక్కలుగల। అబ్జనాభా స్థితస్య — శ్రీకృష్ణుడధిష్ఠించియున్న । వ్రజభువమ్ — వ్రేపల్లెను ; అభియాతుః — వెళ్లుచున్న । పక్షిరాజస్య — గరుత్మంతుని । లక్ష్మీం — శోభను । వహతి — వహించుచున్నది ।

వివరణము :

ఇచ్చట మహారాజుపల్లకి గరుత్మంతుని శోభను వహించుచున్నదని వర్ణించబడినది. ఇచ్చట ప్రకృతము పల్లకి. అప్రకృత గరుత్మంతుని శోభను వహించుట అనుపపన్నము. కనుక శోభవంటి శోభయని చెప్పుకొనవలెను. ఇది రెండవ రకమునకు చెందిన నిదర్శన కుదాహరణము. "బహువజ" "జవవహ" గా వఠరించబడినది.

అథ వ్యతిరేకాలంకారః

భేద ప్రాధాన్యే సతి ఉపమేయాధిక్య ముచ్యతే యత్రి।
ఉపమానాదయమార్యైః వ్యతిరేకో నాను కీర్త్యతేఽన్వర్థః॥ 109

యత్రోపమానాదుపమేయాధిక్యోపనిబంధేన భేద ప్రాధాన్యే ఔపమ్యం గమ్యతే స వ్యతిరేకాలంకారః।

వివరణము :

ఉపమానోపమేయములకు భేదము ప్రధానముగా గల సామ్యము తోచునట్లు, ఉపమానము కంటె నుపమేయమున కాధిక్యము వర్ణించబడినచో నది వ్యతిరేకాలంకారమగును.

సింహే కదాచిన్మకరే కదాచిత్ మేషేఽపి భాస్వాన్నివసత్యమందమ్ ।
రామేశవిద్వజ్జన కల్పవృక్షః సదా పరిస్ఫూర్జతి సింహవృత్తిః॥ 110

అర్థము :

భాస్వాన్ - సూర్యుడు । అమందం — త్వరగా । కదాచిత్ — ఒకప్పుడు । సింహే — సింహమునందు । కదాచిత్ — మరియొకప్పుడు । మకరే — మకరము (మొసలి)నందు । కదాచిత్ — మరియొకప్పుడు । మేషేఽపి — మేషమునందును । నివసతి — నివసించును । రామేశ విద్వజ్జన కల్పవృక్షః — రామేశుడను విద్వాంసులపాలిటి కల్పవృక్షము । సదా — ఎల్లప్పుడు । "సింహవృత్తిః" - సింహమునందు మాత్రమే ఉండువాడు — సింహము వంటి వ్యాపారము గలవాడు ।

వివరణము :

సింహ మకర మేషములు సూర్యుడు సంచరించుపదిరెండు రాశులలో కొన్నిటి పేర్లు. సూర్యుడు ఒక్కొక్క రాశియందు ఒకొక్క నెల ఉండును. కనుక సింహము నందే ఎల్లపుడు ఉండువాడుకాడు. ప్రభువేమో సింహము వంటి వృత్తి గలవాడు. కనుక ఎప్పుడూ "సింహవృత్తి" యే యని సూర్యుని కంటె ఆధిక్యము చెప్పబడినది. కనుక నిది వ్యతిరేకము.

యథావా -

హస్తే కదాచిచ్ఛ్రవణే కదాచిత్ కదాచిదాస్తే మృగమూర్ధ్ని చంద్రః।
రామేశ తే కీర్తిసుధాకరశ్చేత్ కదాఽపి నైవ శ్రవణం జహాతి॥ 111

అర్థము :

చంద్రః — చంద్రుడు । కదాచిత్ — ఒకప్పుడు । హస్తే — హస్తమునందు — హస్తమనుపేరుగల నక్షత్రమందు । కదాచిత్ — ఒకానొకప్పుడు । శ్రవణే — శ్రవణము — చెవియందు — శ్రవణమను నక్షత్రమందు । కదాచిత్ - మరియొకప్పుడు । మృగమూర్ధ్ని - మృగముపైన — మృగశీర్షమను నక్షత్రమునందు । ఆస్తే — ఉండును । రామేశ — ఓ రామేశ ప్రభూ! తే — నీయొక్క । కీర్తి సుధాకరః చేత్ — నీకీర్తియనెడు చంద్రుడైనను । కదాపి — ఎప్పుడును । శ్రవణం — చెవిని — శ్రవణ నక్షత్రమును । నైవ జహాతి — విడువనే విడువడు ।

వివరణము.

చంద్రుడు హస్త శ్రవణాది నక్షత్రములయందు సంచరించుచుండును. ప్రభువు యొక్క కీర్తిచంద్రుడెప్పుడు శ్రవణమును విడువడు. ఇచ్చట శ్రవణమనగా చెవి యనియు, నక్షత్రమనియు రెండర్థములు. ప్రభువు కీర్తి సదా శ్రవణమును అనగా లోకుల చెవిని విడనాడదు. చంద్రుడు శ్రవణమును అనగా ఆనక్షత్రమును విడచి హస్తాది నక్షత్రములలోను

తిరుగును. కనుక ఉపమానమగు చంద్రుని కంటెను ఉపమేయముగా నున్న కీర్తికే ఆధిక్యము చెప్పబడినందున నిదియు వ్యతిరేకమున కుదాహరణమే. శ్లోకములో 'తే' ప్రయోగము చింత్యము.

అథ సహోక్త్యలంకారః

ఏకస్యాః ప్రాధాన్యాదన్యస్య స్యాత్సహార్థత శ్చోక్తిః।
గమ్యే యద్యౌపమ్యే భవతి తదా సహోక్త్యలంకారః॥ 112

యత్రోపమానోపమేయయోః ఏకస్య ప్రాధాన్యేన నిర్దేశాత్ అన్యస్య సహార్థ నిబంధా చ్చౌపమ్యం గమ్యతే తత్ర సహోక్తి రలంకారః।యథా –

వి వ ర ణ ము :

ఉపమానోపమేయములలో నొకదానిని ప్రధానముగా మరియొకదానిని సహార్థ సంబంధిగా – అప్రధానముగా – నిర్దేశించుటను బట్టి ఔపమ్యముగూడ గమ్యమైనపుడు సహోక్తి యలంకారమందురు.

ఉదా –

త్వద్దానవారి కలశాబ్ధి సముద్గత శ్శ్రీరామేశ యుష్మదురుకీర్తి నిశాధినాథః।
సాకం త్వదీయగుణతారనయై ర్మనోజ్ఞై రుద్వేలయత్యతితరాం
కవితామృతాబ్ధిమ్ ॥ 113

రూపకానుప్రాణితేయం సహోక్తిః।

అ ర్థ ము :

శ్రీరామేశ - ఓరామేశప్రభూ । త్వద్దానవారికలశాబ్ధి – నీదానోదకసముద్రమునుండి । సముద్గతః – ఉదయించిన । యుష్మత్ – మీయొక్క । ఉరుకీర్తి – గొప్పకీర్తియనెడు । నిశాధినాథః – చంద్రుడు । మనోజ్ఞైః – అందమైన । త్వదీయగుణతారనయైః – నీగుణము లనెడు చుక్కల రీతులతో । సాకం - కూడ । కవితామృతాబ్ధిం– కవిత్వ మనెడు అమృతము యొక్క సముద్రమును । అతితరాం – మిక్కిలి । ఉద్వేలయతి – ఉప్పొంగజేయుచున్నడి।

వి వ ర ణ ము :

రామేశ ప్రభుదానోదకమను సముద్రమునుండి కీర్తియనెడు చంద్రుడు ఉదయించినాడు. ఈ ప్రభువు గుణములే నక్షత్రములు. ఈ నక్షత్రములతోకూడిన కీర్తి చంద్రుదు కవిత్వమను అమృత సాగరమును ఉప్పొంగునట్లు చేయుచున్నాడు. రాజుకీర్తి గుణములతో

పాటు కవిత్వమును పెంచుచున్నదని తాత్పర్యము. ఇచ్చట కవిత్వమును పెంచుట అను సాధారణ ధర్మమును బట్టి, కీర్తి గుణములకు సామ్యము గమ్యమగును. ఐనను ఈ రెంటిలో కీర్తిని ప్రధానముగా, గుణములను అప్రధానముగా, సహార్థ సంబంధిగా నిర్దేశించుట వలన విది సహోక్తియని, ఆదియు కీర్తిని చంద్రుడని గుణములను తారలని, చెప్పెడు రూపకాలంకారము చేత మిశ్రితమై యున్నది.

ఇచ్చట గుణములు—కీర్తి ఈరెండు ప్రకృతములే. వీనికి ఉపమానోపమేయభావము ఉండవలసిన అవసరము లేదని, అప్రాధాన్యమనునది కేవలము 'సహ' శబ్ద సంబంధముతో శాబ్దముగా చెప్పవలసినదియేయని రసగంగాధరములో పండితరాజు నిరూపించియున్నాడు. అంతేకాదు. ''పౌర్వాపర్య విపర్యయమూలాతిశయోక్త్యాదులే'' ఈ సహోక్తిలో చమత్కారకములని, అవి లేనిదే కేవల సహోక్తి ''పుత్రునితోకూడ తండ్రి వచ్చినా'' డను వాక్యము నందలి సహోక్తి వలె చమత్కారకము కానందున అలంకారము కాజాలదనియు పండితరాజు ప్రతిపాదించియున్నాడు. కనుక ఇచట లక్షణములో ఔపమ్యము గమ్యము కావలయునను నిర్బంధము కాని, రెండు వస్తువులు ఉపమానోపమేయములే కావలయునను నిర్బంధము కాని ఉండనవసరములేదు.

రామేశ క్షోణి మందార తవ సత్కీర్తి సంపదః।
ఉన్మీలయంతి కుముద మిందోర్దీధితిభి స్సహ॥ 114
అత్ర కుముత్కుముదయో రభేదాధ్యవసాయః।

**అర్థము:**

క్షోణిమందార — భూ కల్పవృక్షమగు । రామేశ – ఓరామేశ ప్రభూ! । తవ – నీ సత్కీర్తి సంపదః — మంచికీర్తి సంపత్తులు । ఇందోః — చంద్రుని । దీధితి భిస్సహ — కిరణములతోపాటు ।-కుముదం — కలువపూవును — చంద్రుని । ఉన్మీలయంతి — వికసింప చేయుచున్నవి ।

**వివరణము:**

రామేశ ప్రభుకీర్తి, చంద్ర కిరణములతోపాటు కలువను — చంద్రుని వికసింప చేయుచున్నవి ఇచ్చట కలువ, చంద్రుడు, ప్రధానముగా, చంద్రకిరణములు అప్రధానములుగా, సహార్థ సంబంధులుగా వివక్షించబడినవి. ఇచ్చట ఒకే 'కుముద' శబ్దముచేత కలువను చంద్రుని కూడ చెప్పినందున ఆరెంటికిని అభేదమధ్యవసితమైనది. కనుక అతిశయోక్తియు కలదని గ్రంథకారుడు చెప్పుచున్నాడు. ఇదియు సహోక్తికి ఉదాహరణమని తాత్పర్యము

అథ వినోక్త్యలంకారః

వినోక్తిస్స్యా ద్వినార్థోక్తేః యా స్యాదౌపమ్యగమ్యతా।

వివరణము :

వినార్థము చెప్పినందున ఔపమ్యముగమ్యమైన వినోక్తియలంకారము. 'వినా' అనుదాని యర్థము యొక్క సంబంధమే వినోక్తి యని ఏదేని లేనందున ప్రకృత వస్తువునకు రమణీయత్వముగాని తదభావముగాని వర్ణించబడిన నది వినోక్తి యని పండితరాజు, ఔపమ్యమవసరములేదు.

ఉదాహరణలు—

ఖలైర్వినా భాతి సభా త్వదీయా దోషైర్వినా భాంతి గుణా స్త్వదీయాః ।
రామేశ కల్పావనిజాతకల్ప వినైవ చాంచల్య మియం కృపా తే॥ 116

అర్థము :

కల్పావని జాతకల్ప - కల్పవృక్షముతో సమానమగు।రామేశ - రామేశ ప్రభూ । త్వదీయా — నీసంబంధియగు । సభా — సభ । ఖలైర్వినా — దుర్మార్గులు లేనిదియై । భాతి - భాసించుచున్నది । త్వదీయాః — నీకు సంబంధించిన । గుణాః — గుణములు । దోషైర్వినా — దోషములు లేనివియై । భాంతి — భాసించుచున్నవి । ఇయం — ఈ । తే — నీయొక్క । కృపా - దయ । చాంచల్యం వినైవ — చాంచల్యము లేక యే । భాతి — భాసించుచున్నది ।

వివరణము :

ఇచ్చట సభకు గుణములకు దయకు గూడ ఖలాదులు లేనందున రమణీయత్వము చెప్పబడినది కనుక ఇది వినోక్తియలంకారము.

యథావా—

వినా చంద్రేణ గగనం వినేంద్రేణ త్రివిష్టపమ్ ।
వినా మహీతలం చాఽపి రామేశేన న శోభతే॥ 117

అర్థము :

గగనం — ఆకాశము । చంద్రేణవినా — చంద్రుడులేక । త్రివిష్టపం — స్వర్గము । ఇంద్రేణ వినా — ఇంద్రుడు లేక । మహీతలంచాపి — భూమికూడ । రామేశేన వినా — రామేశ ప్రభువు లేక । న శోభతే — ప్రకాశించదు ।

వి వ ర ణ ము :

ఇచ్చట చంద్రాదులు లేనందున గగనాదులకు రమణీయత్వాభావము వర్ణించ బడినది కనుక నిదియు నొక రకపు వినోక్తి. ఒకే శ్లోకములో రెండు మూడు వినోక్తులున్నపుడు ఔపమ్యము కూడ గమ్యమగునని గ్రంథకర్త తాత్పర్యము. పై శ్లోకములో ఖలులు - దోషములు అను వానికి ఈ శ్లోకములో చంద్రునికి — ఇంద్రునికి— రామేశునికి ఔపమ్యము గమ్యమానము కావచ్చును.

అథ సమాసోక్త్యలంకార ప్రకరణమ్

విశేషణాన్యేవ పరం అర్థం వ్యంజయితుం యదా
ప్రకృతస్య సమర్థాని సమాసోక్తి స్తదా భవేత్॥ 118

ప్రకృతస్య విశేషణాన్యేవ అప్రకృతమర్థం గమయితుం శక్తాని నతు విశేష్య పదమపి తదా సమాసోక్తిః। సమాసేన — సంక్షేపేణ అర్థద్వయ స్యోక్తే రియమన్వర్థా। విశేషణ విశేష్యాభ్యా మర్థాంతరా ప్రతీతేః నశ్లేషతా ఇయం చ శ్లిష్ట విశేషణ మూలా అశ్లిష్ట విశేషణమూలత్వేన ద్వివిధాపి విశేషణానాం గుణ క్రియారూపత్వేన ద్వైవిధ్యే చాతుర్విధ్య మస్యాలం కారస్య క్రమేణ యథా—

వి వ ర ణ ము :

ప్రకృతార్థమునకు సంబంధించిన విశేషణములు అప్రకృత వృత్తాంతమును కూడ అభివ్యక్త మొనరించెనేని అది సమాసోక్తి యగును. సమాసమనగా సంక్షేప మని యర్థము. రెండర్థములను సంగ్రహముగా చెప్పుటచేత దీనికి సమాసోక్తి యని సార్థక నామము. విశేషణములే తప్ప విశేష్యము అర్థాంతరమును చెప్పదు కనుక నిది శ్లేషమనుటకు అవకాశము లేదు. ఇది శ్లిష్ట విశేషణ మూలయని, అశ్లిష్ట విశేషణ మూల యని రెండు రకములు. వాని లోను విశేషణములు గుణరూపములు - క్రియా రూపములు కూడ కావచ్చును. కనుక నీయలంకారము నాలుగు రకము లగుచున్నది. వరుసగా నుదాహరణములు : —

లాల్యమానాలకోపాంతా సదాలంకారసోత్సవా।
కరోపగ్రాహ్యమధ్యా భూః రామేశేనోపభుజ్యతే॥ 119

అత్ర శ్లేషోపస్థాపితానాం లాల్యమానాలకోపాంతత్వాదీనాం - గుణ రూపాణాం ధర్మాణాం తుల్యత్వ సామర్థ్యేన భువో నాయికాత్వం గమ్యతే।

నను బ్రాహ్మణానాం భూపతిత్వాభావేన సర్వస్య బ్రాహ్మణత్వేన తన్నాయి కాత్వ మస్యాః కథమితి చేత్, "అహం భూపతి రహం భువన పతి" రిత్యాది వేదవాక్యైః అస్యాపి 'భూపతిత్వ' మస్తీతి గృహాణ ।

ము :

లాల్యమానా — సవరించబడుచున్న । అలకోపాంతా — అలకానగర ప్రాంతముగల — ుగురుల ప్రాంతములుగల । సదా — ఎల్లపుడు । లంకా — లంకానగరమునందలి । రసో ా — ఆనందమును కలిగించు ఉత్సవ విశేషములుగల । సదా — ఎల్లపుడు । అలంకార - ంకారములుగల । సోత్సవా — ఆనందోత్సవములుగల । కరోపగ్రాహ్యమధ్యా — ్రముచేత గ్రహింపదగిన మధ్యభాగముగల - చేతితో గ్రహించదగిన నడుముగల। భూః - మి । రామేశేన — రామేశ ప్రభువుచేత । ఉపభుజ్యతే — అనుభవించబడుచున్నది ।

వరణము :

అలకాపత్తనను ఉత్తరావధిగా, లంకాపత్తనను దక్షిణావధిగా నున్న భూభాగము యు కిప్పము సిద్ధించుకొనుచు తన వశమునందుంచుకొని రామేశ ప్రభువు పాలించు న్నారని తాత్పర్యము. ఇచట ప్రకృత భూభాగమునకు చేసిన విశేషణములతో 'అలకా — ాది' శబ్దములు రెండర్థములు చెప్పుచున్నవి. రెండవ అర్థమగు ముంగురులు — అలంకార లు — చేతి కంపెను నడుము అనునవి అప్రకృత నాయికావృత్తాంతమును అభివ్యక్తము యుచున్నవి. కనుక ఇది శ్లిష్ట విశేషణమూలయగు సమాసోక్తి. ఈ విశేషణములు క్రియా పములుకాక గుణ స్వరూపములు గనుక నిది గుణ స్వరూప శ్లిష్ట విశేషణమూల సమా క్తి యగుచున్నది.

ఇచ్చట ప్రకృతము భూ భోగము. అభివ్యక్తమైన అప్రకృతము నాయికా భోగము. ాపతులు క్షత్రియులే కాని బ్రాహ్మణులు కారు. మరి బ్రాహ్మణుడగు రామేశునికి భూ ోగము వర్ణించవచ్చునా యని సంశయింప పనిలేదు. ఏమనిన నీ - అహంభూపతిః 'అహం భువనపతిః' అను వేదవాక్యములు బ్రాహ్మణునికిని భూపతిత్వమును చెప్పుచున్నవి.

దత్తే కువలయప్రీతిం ఉదయం నిత్యమశ్నుతే ।
యశో రామేశ భవతః సర్వజ్ఞ శిరసోహ్యతే ॥ 120

అత్రాపి శ్లేషోపస్థాపితానామేవ కువలయప్రీత్యాధానా దీనాం క్రియా రూపాణాం ధర్మాణాం, సామ్యమహిమ్నా యశసః చంద్రత్వం గమ్యతే ।

అర్థము :

రామేశ — ఓరామేశ ప్రభూ । భవతః — నీయొక్క । యశః — కీర్తి । కువలయ — భూమండలమునకు — కలువలకును । ప్రీతిం - సంతోషమును । దత్తే — ఇచ్చుచున్నది । నిత్యం — ప్రతిదినము । ఉదయం - అభ్యుదయమును — ఉదయమును । అశ్నుతే - పొందుచున్నది । సర్వజ్ఞశిరసా - అందరి విద్వాంసుల శిరస్సుచేత — శంకరుని శిరస్సుచేత । ఉహ్యతే — ధరింపబడుచున్నది ।

వివరణము :

ఇచ్చట రామేశుని కీర్తి ప్రకృతము. తద్విశేషణములలోని కువలయాది శబ్దములు శ్లిష్టములు. ఈ విశేషణముల వలన అప్రకృత చంద్ర వృత్తాంతము అభివ్యక్తమగుచున్నది. ఇచ్చట కువలయ ప్రీత్యాధానాది విశేషణములు క్రియాస్వరూపములు. కనుకనిది క్రియా స్వరూప శ్లిష్ట విశేషణమూల సమాసోక్తి.

పరిస్ఫుర త్పన్నగలోకపాదాం మహీనితంబాం సురసద్మవక్త్రామ్ ।
గాఢం పరిశ్లిష్యతి చ త్రిలోకీం రామేశ తే భవ్యయశః ప్రకాశః ॥ 121

అత్ర పన్నగలోకః పాదఇవ పన్నగలోకపాదా ఇత్యాద్యుపమా సమాస మహి మ్నావగత గుణరూపసమాన ధర్మసామర్థ్యేన యశః ప్రకాస్య త్రిలోక్యాశ్చ నాయికా-నాయక భావోఽవగమ్యతే। చతుర్థ భేదస్తు పృథక్చమత్కారకారిత్వాభావాన్ననిరూపితః।

ఇతి సమాసోక్తిః

అర్థము :

రామేశ — రామేశప్రభూ । తే — నీయొక్క । భవ్యయశః ప్రకాశః - చక్కని కీర్తి యొక్క ప్రకాశము । పరిస్ఫురత్పన్నగలోకపాదాం — ప్రకాశించు నాగలోకమే పాదములు గాగల । మహీనితంబాం - భూమియే మధ్య భాగముగాగల । సురసద్మ వక్త్రాం - స్వర్గమే ముఖముగాగల । త్రిలోకీంచ — త్రిలోకిని (మూడు లోకములను) । కూడ గాఢం - గట్టిగా । పరిశ్లిష్యతి - కౌగిలించుకొనుచున్నది।

వివరణము :

రామేశ ప్రభువు యశః ప్రకాశము మూడు లోకముల నాక్రమించుకొనుచున్నది. ఇచట త్రిలోక శబ్దముస్త్రీలింగము. ప్రకాశ శబ్దము పుంలింగము. అందులోను త్రిలోక విశేషణములలో పాదనితంబ ముఖములు త్రిలోకి యనుదానికి నాయికాత్వమును అభివ్యక్తముచేయుచు

ప్రకృతనాయికా – నాయక పరిష్వంగ వృత్తాంతమును అవగతమొనర్చును. ఇచ్చట సమాన ర్ణనములు క్రియారూపములు కావు. విశేషణములు శ్లిష్టములును కావు. కనుక నిది గుణ రూపాశ్లిష్ట విశేషణమూల సమాసోక్తి. ఇక క్రియా స్వరూపాశ్లిష్ట విశేషణమూల సమా క్తియు నిట్లే యుండును. విడిగా చమత్కారమేమియునుండదు. కనుక దాని నుదాహ ంపట లేదు

అథ పరికరాలంకారః

అథ ప్రసంగ సంగత్యా పరికరాలంకారం లక్షయతి।

సాభిప్రాయాణి స్యుః ప్రతీయమానే విశేషణానియథా।
స తదా పరికరనామాఽలంకారః కీర్త్యతే విపశ్చిద్భిః। 121

వరణము :

విశేషణములు గమ్యమగు నర్థమునందును తాత్పర్యము గలవియై యున్న పరికరా ంకారమగునని పండితులు చెప్పుచున్నారు.

యథా –

కల్పాంతోద్ధత కాలదండ విహస ద్దోశ్చంద్రహాసాయుధే
కాలీరూక్షకటాక్ష వీక్షణ కలా తీక్ష్ణ క్షురప్ర వ్రజే।
గోప్తుం త్వాం రఘునందనే విహరతి క్షోణ్యాం హి రామేశ తే
కేవా నామరభూరుహావలి కృతాతిథ్యం లభంతే ద్విషః॥ 123

అత్ర లభంతి ఏవేతి వ్యంగ్యం ప్రతి కల్పాంతోద్ధత కాలదండే త్యాదీనాం విశేషణానాం। [సాభిప్రాయత్వమ్]

అర్థము :

రామేశ – ఓ రామేశప్రభూ। కల్పాంత – ప్రళయ కాలమందలి। ఉద్ధత – కఠిన మగు। కాలదండ – యమదండమును। విహసత్ - వెక్కిరించునట్టి। దోః - చేతియందలి। చంద్రహాసాయుధే – చంద్రహాసమను ఖడ్గాయుధముగలవాడునగు। కాలీ - కాళికాదేవి యొక్క। రూక్ష – తీక్షణమగు। కటాక్షవీక్షణ కలా – క్రీగంటి చూపుల విలాసముల వంటి తీక్ష్ణ–తీక్ష్ణములైన క్షురప్ర – చిన్న ఆయుధముల। వ్రజే – గుంపు గలవాడునగు। రఘు నందనే – శ్రీరామచంద్రస్వామి। త్వాం – నిన్ను। గోప్తుం - రక్షించుటకు। క్షోణ్యాం–

భూమిపై । విహరతి - విహరించుచుండ । తే - నీయొక్క । ద్విషః — శత్రువులు । కేవా— ఎవరు । అమరభూరుహావలి — దేవతా వృక్షములచేత । కృత - చేయబడిన । ఆతిథ్యం — ఆతిథ్యమును । నలభంతే — పొందుటలేదు?।

వి వ ర ణ ము .

మృత్యుదండము వంటి ఖడ్గము చేతబూని కాళికాదేవి క్రోధ వీక్షణముల వంటి, (తీక్షణములైన)చిరు కటారులెన్నియోగల రామచంద్రస్వామి సర్వదా నిన్ను కాపాడుచుండగ నీశత్రువులు బ్రతికి యుండగలరా? అని అనుట వలన శత్రువులందరు నశించి తీరుదురను అర్థము వ్యంగ్యము. ఈ వ్యంగ్యము నందలి తాత్పర్యము చేతనే రఘునందనునికి విశేషణములు వేయబడినవి. కనుక ఇక్కడి విశేషణములు సాభిప్రాయములు । అందుచే నిది పరికరాలంకారము.

అథ పరికరాంకురాలంకారః —

వాచ్యార్థం ప్రతి యస్మిన్ సాభిప్రాయం విశేష్య మాభాతి।
తత్రాయం సంఖ్యావత్ ప్రవరై రాఖ్యాయి పరికరాంకురః॥ 124

వి వ ర ణ ము :

ఎచ్చట వాచ్యార్థమును గురించి విశేష్యము సాభిప్రాయముగా ప్రయుక్తమగునో అచ్చట పరికరాంకుర మలంకారమని పండితులు నుడువుచున్నారు.

రామేశ తవ బుద్ధిస్తు ప్రేరితా రాజమండలీమ్।
ముష్ణంతీ తద్యశోరాశిం ప్రాయో భూమండలీకృతా ॥ 125
అత్ర విశేష్య భూతా బుద్ధిః భూమండలం స్వాధీనం చకారేత్యర్థః —

అ ర్థ ము :

రామేశ — రామేశప్రభూ । తవ — నీయొక్క । బుద్ధిస్తు — బుద్ధియేమో । రాజమండలీం — రాజసముదాయమును గురించి । ప్రేరితా — పంపబడినదియై । తద్యశోరాశిం — వారల కీర్తి సముదాయమును । ముష్ణంతీ — అపహరించుచున్నదియై । భూ — భూమికి । మండలీకృతా — గుండ్రముగా చుట్టునుండు పరివేషముగా చేయబడినది । ప్రాయః — (నిజము) బహుశము ।

వి వ ర ణ ము :

రామేశునిబుద్ధి రాజుల నందరను జయించి భూమిచుట్టు పరిధివలె చేయబడినది. తన బుద్ధిని భూమిచుట్టు పెట్టినందున భూమియంతయు రామేశుని బుద్ధికి లోబడి యున్నదను నంశము

వాచ్యము. ఈ వాచ్యమునందు తాత్పర్యముండుట బట్టియే రామేశునిగాక అతని బుద్ధిని విశేష్య ముగా చెప్పుటయైనది. కావున నిది పరికరాంకురాలంకారమని తాత్పర్యము.

## అథ శ్లేషాలంకారః –

అథ విశేషణ మూలాలంకార ప్రస్తావే శ్లేషో నిరూప్యతే।

ప్రస్తుతయోః కేవల మప్రస్తుతయోర్వా విశేష్యయో స్సామ్యమ్।
యస్మి న్విశేషణానా మపి చ (టులైః) తులా శ్లేషఏవ నిర్దేశః ॥ 126

సమాసోక్తి తుల్యయోగితయోస్తు విశేషణమాత్ర సామ్యమేవ న పున ర్విశేష్యగత శ్లిష్టత్వమ్। అత్రతు విశేషణ విశేష్యోభయ సామ్యం ప్రయోజకమ్। విశేష్యయోశ్చాత్ర కేవల ప్రస్తుతయోర్వా, కేవలాప్రస్తు తయోర్వా భవతి శ్లేషః। నతు ప్రస్తుతాప్రస్తుతాయోః తథాహిః– ప్రస్తుతే అభిధా నియంత్రణే అప్రస్తుత ప్రతీతేర్వ్యంజక వ్యాపారాయత్తతయా శబ్దశక్తి మూలానురణన స్వరూప ధ్వనేరేవ విషయత్వాపాతాత్। ప్రస్తుతా ప్రస్తుతయోరపి విశేష్యగత శ్లేష పరిహారేణ విశేషణమాత్ర శ్లేషేఽపి శ్లేషాలంకార ఏవేతి న భ్రమితవ్యమ్। తతశ్చ కేవల ప్రస్తుత గతత్వేన, కేవలాప్రస్తుత గతత్వేన చ ద్వైవిధ్య మేవాస్యాలంకారస్య। క్రమేణ యథాః–

వివరణము :

విశేషణ మూలాలంకార సందర్భము ఏర్పడినందున శ్లేషాలంకారము నిరూపించబడు చున్నది. ఒక శబ్దముచేత రెండర్థములు చెప్పించుకొనుట శ్లేషము. ఈ రెండర్థములు విశేషణ ములు కావచ్చును లేదా విశేష్యములైనా కావచ్చును. ఐన సమాసోక్తితుల్యయోగితాద్యలంకార ములలో విశేషణములకు మాత్రమే శ్లేషముండును. విశేష్యమున శ్లేషము కేవల శ్లేషాలంకారము నందేగలదు. శ్లేషాలంకారమని యనుటకు విశేష్య విశేషణోభయ శ్లేషము ప్రయోజకము. ఈ ఉభయ శ్లేషము మరియొక చోట నుండదు. కనుక విశేష్య విశేషణోభయ వాచక పదములు రెండర్థముల చెప్పునవి పయుక్తములైన శ్లేషాలంకారములగునని తల్లక్షణము చెప్పవచ్చును. ఐన ఇచ్చట మరియొక యంశము గమనించవలసియున్నది. అదేమనిన రెండర్థములు ప్రస్తుతములు కావచ్చును. అప్రస్తుతములు కావచ్చును. అపు శ్లేషాలంకారమగును. అట్లుకాక రెండర్థములలో నొకటి ప్రస్తుతము, మరియొకటి యప్రస్తుతమైన అచట శ్లేషాలంకారము కాజాలదు. అట్టిచోట శబ్దశక్తి మూలానురణన ధ్వని అందురు. ఎందుకనగా అభిధావ్యాపారము

ప్రాకరణికార్థమును మాత్రము చెప్పి యూరకుండును. ఇక అప్రస్తుతార్థము కూడ చమత్కారమునకై వక్తకు వివక్షితమైనచో నాయప్రకృతార్థమును వ్యంజనా వ్యాపారము బోధించును. వ్యంజనాగమ్యమగు నర్థమునకు ప్రాధాన్యము వివక్షితమై యది ధ్వనికావ్యమగును. అచ్చట రెండర్థములకు సమప్రాధాన్యముండదు. రెండు ప్రస్తుతములనుగాని, రెండప్రస్తుతములనుగాని చెప్పినపుడు రెండర్థములకు ప్రాధాన్యము సమముగా నుండును. కనుక నది శ్లేషాలంకారమగును.

ఇట్లు విశేషణ వాచకపదములు రెండర్థముల చెప్పునవియై యుండి, విశేష్య వాచక పదము సమప్రాధాన్యము గల రెండు ప్రస్తుతార్థములను గాని, రెండప్రస్తుతార్థములను గాని చెప్పునదియైన నది శ్లేషాలంకార మగునని శ్లేషాలంకారమునకు పరిష్కృతమగు లక్షణమేర్పడుచున్నది. విశేష్య విశ్లేషము లేని కేవలవిశేషణ శ్లేషమున్నపుడు శ్లేషాలంకారమేమోయని ఏ మాత్రము భ్రమ పడవలసిన పనిలేదు. కనుక శ్లేషము రెండు విధములు మాత్రమే. ఒకటి ప్రస్తుత శ్లేషము. మరియొకటి అప్రస్తుత శ్లేషము.

వరుసగా ఉదాహరణములు :—

కాంతా రసానుభవన నియతస్వాంత విశ్రమమ్।
త్వయా రామేశ సర్వేఽపి లభంతే సుహృదో వనమ్॥ 127

అత్ర రామేశగతదాన నిగ్రహయోః గమ్యమానతయా సుహృదా మసుహృదాంచ ప్రాకరణికత్వమ్।

అర్థము :

రామేశ — రామేశప్రభూ। త్వయా — నీచేత। సుహృదః — స్నేహితులు। అసుహృదః — శత్రువులు। సర్వేఽపి — అందరును। కాంతా — స్త్రీలయొక్క। రసానుభవన — ఆనందానుభూతిలో। నియత — నిశ్చితమైన। స్వాంతవిశ్రమం — చిత్త విశ్రాంతిగల। కాంతార — అడవులలోని। సాను — చరియలనెడు। భవన — నివాసగృహములలో। నియత — నిశ్చితమైన। స్వాంతవిశ్రమం — చిత్తవిశ్రాంతిగల। వనం — వనమును। లభంతే — పొందుదురు।

వివరణము :

రామేశ ప్రభువు శత్రువులు - మిత్రులుగూడ వనముచేరుచున్నారు. శత్రువులేమో అడవులలోని కొండ చరియలపై నివాసమేర్పరచుకొనినారు. మిత్రులేమో ప్రియురాండ్రతో ఆనందానుభూతికై యుద్యానవనములచేరుచున్నారు. ఇచ్చట రామేశ ప్రభువు యొక్క దానము నిగ్రహముకూడ ధ్వనించుచున్నది. ప్రకృత మిచట రామేశప్రభువు. కనుక అతనికి

సంబంధించిన శత్రువులు - మిత్రులు రూప నిచట ప్రస్తుతములే. కనుక ఇది కేవల ప్రకృత శ్లేషము.

సుమనో మార్గణ రక్షణ ప్రావీణ్య కల్పితోత్సాహః।
రామేశ క్షితివాసవ భవాన్ సదాకిల వృషాకపిం జయతి॥ 128

అత్ర వృషాకపిశబ్ద వాచ్యయోః హరిహరయో రుపమానత్వే నాప్రాకరణి కత్వమ్।

అర్థము :

రామేశక్షితివాసవ — ఓ రామేశ భూమీంద్రా । సుమనోమార్గణ — విద్వాంసులనెడు — దేవతలనెడు, యాచకుల యొక్కయు — పూలు బాణములుగాగల మన్మథునియొక్కయు । రక్షణ — రక్షించుట యందు । ప్రావీణ్య — సామర్థ్యముచేత । కల్పితోత్సాహః — కల్పించబడిన ఉత్సాహముగల । భవాన్ — నీవు । సదా — ఎల్లప్పుడు । వృషాకపిం — విష్ణువును — శివుని కూడ । జయతికిల — జయించుచున్నావుకదా ।

వివరణము :

రామేశ ప్రభువు విద్వాంసులను, విష్ణువు దేవతలను, శివుడు తాను కాల్చి భస్మము చేసిన మన్మథుని రక్షించుట ప్రావీణ్యము కలవారలు. కనుక రామేశ ప్రభువు వారిద్దరిని జయించుచున్నాడని వర్ణించబడినాడు. ఇచట శివకేశవు లిద్దరును ఉపమానము లగుటచే అప్రాకరణికులు. కనుక ఇది 'కేవలా ప్రకృత శ్లేషము'. విశ్లేషించి మార్చి 'సుమనో మార్గణేత్యాది' విశేషణమును 'వృషాకపి' పదార్థముతో సమన్వయించజేసిన 'వృషాకపిశబ్దము' విశేష్యవాచక మగును. కనుక నిది విశేష్య విశేషణోభయశ్లేషముచ్చది యని భావించవలెను. ఇచ్చట శ్లోక చతుర్థ పాదమునకు పూరణార్థము 'సదాకిల' అనునది చేర్చనైనది. మూలమున లేదు.

అథాప్రస్తుత ప్రశంసాలంకారః —

అప్రస్తుతంతు వాచ్యం గమ్యం స్యాత్ ప్రస్తుతం పునర్యత్ర ।
అప్రస్తుత ప్రశంసా సేయం త్రివిధా బుధైస్సమాదిష్టా॥ 129

యత్రాప్రస్తుతేనవాచ్యేన ప్రస్తుతం గమ్యతే తత్రాప్రస్తుత ప్రశంసా। సాత్రివిధా। సామాన్య విశేష భావమూలా, కార్యకారణ భావమూలా, సారూప్యమూలాచేతి। తత్రాపి, ప్రాథమికస్య, భేదస్య, సామాన్యేన, విశేష ప్రతీతిః। విశేషేణ సామాన్య ప్రతీతిరితి ద్వైవిధ్యమ్। ద్వితీ

యస్యాపి భేదస్య, కారణేన కార్యప్రతీతిః। కార్యేణ కారణప్రతీతి రితి ద్వైవిధ్యమ్। సారూప్యేత్వేక ఏవ ప్రకారః। సంభూయ పంచధా। అప్రస్తుత ప్రశంసా క్రమేణ యథా-

వి వ ర ణ ము :

అప్రస్తుతము వాచ్యమై ప్రస్తుతము గమ్యమైన అప్రస్తుత ప్రశంసాలంకార మందురు. ఇది సామాన్య విశేషభావ మూలకమనియు, కార్యకారణ భావ మూలకమనియు, సారూప్య మూలకమనియు మొదట మూడు విధములు. వీనిలోను మొదటిది సామాన్యముతో విశేష ప్రతీతి రూపమని, విశేషముతో సామాన్య ప్రతీతిరూపమనియు రెండు విధములు. ఇట్టే రెండవదికూడ, కారణముతో కార్య ప్రతీతిరూపమనియు, కార్యముతో కారణ ప్రతీతి రూపమనియు రెండు విధములు. సారూప్య మూలక మొక్కటియే. ఇట్లు అప్రస్తుత ప్రశంస మొత్తము ఐదు విధములు. వరుసగా నుదాహరణములు.

యద్బాహ్యా కృతి శోభయైవ కలితో భోగీశ్వరః శ్రీధరః
యత్కాంత్యైవ నిశాకరోఽపి కలితః ప్రాజ్ఞేన వై వేధసా ।
సంచారక్రమ లీలయైవ రచితా దిక్కుంజరా స్సర్వతః
తద్రామేశ (రామేశాంశ) కలాం విహాయ కతి వా సృష్టానులోకత్రయే॥ 150

అత్ర మహదద్భుతం తవ సౌందర్యం ఇతి వర్ణనీయే ప్రస్తుతే అప్రస్తుత గజాది సృష్టి ర్నిరూపితేతి సామాన్యేన విశేష ప్రతీతిః॥

అ ర్థ ము :

యత్ — ఏరామేశుని । బాహ్యాకృతి — వెలుపలి ఆకారము యొక్క । శోభయైవ — శోభచేతనే । భోగీశ్వరః — విలాసవంతులలో శ్రేష్ఠుడగు । శ్రీధరః — విష్ణువు । కలితః — సృష్టి చబడినాడో । ప్రాజ్ఞేన — విజ్ఞుడగు । వేధసా — బ్రహ్మదేవునిచేత । యత్ — ఏరామేశునియొక్క । కాంత్యైవ — కాంతిచేతనే । నిశాకరోఽపి — చంద్రుడుకూడ । కలితః వై — సృష్టించబడినాడో । (యస్య — ఏరామేశునియొక్క) । సంచారక్రమ లీలయైవ — తిరుగునప్పుడు ఏర్పడు పాదవిక్షేపవిలాసముచేతనే । సర్వతః — అన్నివైపుల । దిక్కుంజరాః — దిగ్గజములు । రచితాః - సృష్టించబడినవో । తద్రామేశ కలాం — అట్టి రామేశుని భాగమును । విహాయ — వదిలి । లోకత్రయే — మూడు లోకములయందును । కతివా — ఎందరు । సృష్టాను ? - సృష్టి చబడినారు ?

వి వ ర ణ ము :

రామేశుని దేహసౌందర్యముయొక్క అంశముతోనే బ్రహ్మదేవుడు విష్ణువును సృష్టించినాడు. చంద్రుని సృష్టించినాడు. రామేశుని గమన సౌందర్యాంశముతో దిగ్గజములను సృష్టించినాడు. వస్తుతః మూడు లోకములలోని అందరు రామేశుని అంశముతో సృషించబడినవారలే ఇచ్చట విష్ణు చంద్ర - గజాది సృష్టి అప్రస్తుతము. దీనిచేత ప్రస్తుతమగు రామేశ సౌందర్యము చాల అద్భుతమను అంశము గమ్యమగును కనుక నిచట సామాన్యేన విశేష ప్రతీతి రూపమగు అప్రస్తుత ప్రశంస అలంకారమగుచున్నది. ఐనను ఇక్కడ విష్ణ్వాది సృష్టికిని గమ్యమగు సౌందర్యమునకును సామాన్య విశేషభావము చింత్యము. మూలములో 'రామేశాంశ' అను భాగము అర్థ సౌకర్యముకొరకు 'తదాత్రిమేశ' అనురీతిలో సవరించబడినది.



రామేశ క్షోణిదేవేంద్ర యశోవర్ణనయాంచితా ।
సత్కావ్యావలి రాధత్తే ప్రమోదం విదుషాం హృది॥ 131

అత్ర విదుషాం ప్రమోదసామాన్యే ప్రస్తుతే అప్రస్తుతః కావ్యావళ్యా ఇతి (సామాన్యేన) విశేషోఽభిహితః।



అ ర్థ ము :

రామేశ క్షోణి దేవేంద్ర — రామేశభూమీం దునియొక్క । యశో వర్ణనయా — కీర్తి వర్ణనచేత । అంచితా — కూడుకొనినట్టి । సత్కావ్యావలిః — మంచి కావ్యముల సముదాయము । విదుషాం — విద్వాంసుల । హృది — హృదయమునందు । ప్రమోదం — సంతోషమును । ఆధత్తే — కలిగించుచున్నది ।



వి వ ర ణ ము :

రామేశ ప్రభువుయొక్క కీర్తిని వర్ణించునట్టి కావ్యములు విద్వాంసులకు సంతోషమును కలిగించుచున్నవి. ఇచ్చట విద్వాంసులకు ప్రమోదసామాన్యము ప్రస్తుతమై యుండగా నొక కావ్యప్రయోజ్యమగు సంతోషము మాత్రమే (విశేషము మాత్రమే) అభిహితమైనది. ఈ విశేషముచేత ప్రస్తుతమగు సామాన్యము ప్రతీతమై యప్రస్తుత ప్రశంసయగునని తాత్పర్యము. ఈ యుదాహరణములోను వివక్షితమగు సామాన్య విశేష భావముగాని విశేషమునకు సామాన్య గమకత్వముగాని చింత్యము.

మణిమయ గృహశాంతా వ్యాస వాణీశ లీలాః
విరచిత బహుయాగాః కించ దేవేంద్ర భోగాః।
వితరణగుణ పూతాః త్వత్కటాక్షేణ జాతాః
దిశిదిశి విలసంతో ధీర రామేశ సంతః॥ 132

అత్ర సకల దిగంతగత విద్వదైశ్వర్యరూపాప్రస్తుత కార్యేణ నిరవధిక వితరణస్య కారణస్య ప్రస్తుతస్య ప్రతీతిః।

అర్థము :

ధీర — ధైర్యముగల । రామేశ — రామేశప్రభూ । మణిమయ గృహ శాంతాః — మణులతో నిర్మించబడిన గృహములలో శాంతులై । వ్యాస వాణీశలీలాః — వ్యాసుని, బ్రహ్మదేవుని విలాసములు గలవారలై । విరచిత బహుయాగాః — చేయబడిన అనేక యాగములు కలవారలై । కించ — మరియు । దేవేంద్ర భోగాః — ఇంద్రుని భోగములు కలవారలై । వితరణ గుణ పూతాః — దానగుణముచేత పవిత్రులై । దిశిదిశి — ప్రతిదిక్కునందు । విలసంతః — ప్రకాశించునట్టి । సంతః — సత్పురుషులు । త్వత్కటాక్షేణ — నీకటాక్షముచేత । జాతాః — అయిరి ।

వివరణము :

ఇచ్చట విద్వాంసులందరును ఇంతటి శ్రీమంతులగుట రామేశుని దానగుణమువలననే అని ఏర్పడును. పండితుల ఐశ్వర్యము కార్యము. రాజు దానము తత్కారణము. ఐనను ఇక్కడ రాజు గుణమును చెప్పలేదు. తత్కార్యమగు విద్వదైశ్వర్యమే వర్ణించబడినది. ఇది అప్రస్తుతము. ఇట్లిక్కడ అప్రస్తుత కార్యముచేత ప్రస్తుత కారణము గమ్యమగుచున్నందున నిది కార్యేణ కారణ ప్రతీతిరూపమగు అప్రస్తుత ప్రశంసయగును. ఐనను ఇచట 'త్వత్కటాక్షేణజాతా' అని వారి ఐశ్వర్యానికి రాజు కటాక్షము కారణము వాచ్యమయినది. కాని మరొక రకముగా వ్యంగ్యమగు చున్నదనియు చెప్పుకొని సమన్వయము చేసికొనవలెను.

అయి భషక మృగారే (దే) కిమ్ముదా ధావసీత్థం
న హి కదశనశేషం మృణ్మయం కుండమేతత్।
గురుభి రిహ మరందైః పూరిత స్త్వ ద్దురాపైః
కనకకలశ ఏషః కిం త్వయా పీయతేఽసౌ॥ 133

(ఇదం) సకల గుణగణ భాసురం రామేశవిభుం వంచయితుం సమాగతం మూర్ఖం ప్రతి ప్రాజ్ఞవచనమేతత్। అత్ర అప్రకృత శునక వృత్తాంతేన వాచ్యేన సారూప్యాత్ ప్రస్తుత దుర్విదగ్ధ వ్యాపారం ప్రతి సకలరసాభిజ్ఞోఽయం నాయక స్తవ వంచనా విషయో నభవతీతి తాత్పర్యార్థఃగమ్యతే।

అ ర్థ ము :

మృగారే — మృగశత్రువగు । అయి — ఓ । భషక — శునకమా । కిం — ఏమని । ఇత్థం — ఈవిధముగా । ముదా — సంతోషముతో । ధావసి — పరుగెత్తు చున్నావు । ఏతత్ — ఇది । కదశనశేషం — చెడు ఆహారము మిగిలియున్న । మృణ్మయం — మట్టిదియగు । కుండం — కుండ । న — కాదు । త్వద్దురాపైః — నీకు అందరాని । గరుభిః — గొప్పదైన । మరందైః — మధు రసములచేత । ఇహ — ఇచట । పూరితః — నింపబడిన । ఏషః — ఇది । కనకకలశః — బంగారు బిందె । అసౌ — ఇది । త్వయా — నీ చేత । పీయతేకిం — ఆస్వాదించబడునా?।

వి వ ర ణ ము :

ఎక్కడో పాచికూడు మిగిలియున్న మట్టి కడవ దగ్గరకు పరుగెత్త వలసిన కుక్క తేనెలతో నిండిన బంగారు భాండమువైపు పరుగెత్తుట భావ్యము కాదని తాత్పర్యము. మహా రాజు దగ్గరకైన చేరగల యోగ్యతలేని మూర్ఖుని వృత్తాంతము ప్రస్తుతము. అది అప్రస్తుత మగు శునక వృత్తాంతము చేత గమ్యమగుచున్నది. కారణమేమన శునక మూర్ఖ వృత్తాంతము లకు గల సారూప్యమే. సారూప్యమనగా సమాన స్థితి. ఇట్లు ఇక్కడ సారూప్య మూలకా ప్రస్తుత ప్రశంసాలంకారమగుచున్నది.

శ్లోక చతుర్థపాదమున "ఏషః కిం" అనుచోట సులోపాభావము ప్రామాదికము.

ప్రకాశమానామపి నాయకేందుం
తారావలిం వీక్ష్య నవాముదీతామ్।
హృష్యత్సు సర్వేష్వసహిష్ణు రుచ్చైః
ఉచ్చావచం బుక్కతి కోఽప్యలర్కః॥ 134

అత్ర రామేశ శోకలీలాభాసురాం కృతి ముదీక్ష్య హృష్యత్స్వపి సజ్జనేషు అస (హంతం) హమానం యంకంచన పురుషం ప్రతి ఫణ్యమాన వచన మేతత్। పూర్వశ్లోకవదర్థప్రతీతిః।

అ ర్థ ము :

ప్రకాశమానామపి — ప్రకాశించుచున్న । నాయకేందుం — చంద్రుని వంటి నాయకుడు గల — నాయకుడగు చంద్రుడుగల । నవాం — నూతనమైన । ఉదీతాం — ఉదయించిన । తారావలిం — నక్షత్ర సముదాయమును — రామేశ కీర్తి ప్రబంధమును । వీక్ష్య — చూచి । సర్వేషు — అందరు । హృష్యత్సు — సంతోష పడుచుండగా । అసహిష్ణుః — సహనము

లేని । కోఽపి — ఏదోయొక । అలర్కః — పిచ్చికుక్క । ఉచ్చైః — బిగ్గరగా । ఉచ్చావచం — అడ్డదిడ్డముగా । బుక్కతి — మొరుగును ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు కీర్తిని ప్రశంసించుచు నిబంధించబడిన తారావళియను ప్రబంధ విశేషమును చూచి అందరు ఆనందించగా నొక పిచ్చికుక్క మొరుగు చున్నది. ఇచ్చట అప్రస్తుతమగు చంద్ర తారాఽలర్క వృత్తాంతముచేత ప్రస్తుతమగు మహారాజ తారావళీ ప్రబంధ మూర్ఖపహాస హీన జన వృత్తాంతము గమ్యము, కనుక నిదియు పైశ్లోకమునందు వలెనే సారూప్యమూలకమగు నప్రస్తుత ప్రశంసాలంకారమగుచున్నది.

## అథ అర్థాంతర న్యాసాలంకారః

అథ ప్రస్తుతాప్రస్తుత ప్రస్తావేన అర్థాంతరన్యాసాలంకారో నిరూప్యతే ।
సామాన్యవిశేషత్వే ప్రస్తుతమప్రస్తుతాత్సమర్థ్యేత ।
యస్మిన్ సంఖ్యావద్భిః కథిత స్సోఽర్థాంతరన్యాసః॥ 135

యత్ర సామాన్యాద్విశేషః, విశేషాత్సామాన్యం, ప్రస్తుతం సమర్థ్యతే స ద్వివిధోఽప్యయమర్థాంతరన్యాసః । యథా —

వి వ ర ణ ము:

ప్రస్తుత మని - అప్రస్తుత మని ఒక ప్రస్తావ మేర్పడినందున అట్టి ప్రస్తుతాప్రస్తుతముల కాశ్రయమగు మరియొకటి అర్థాంతరన్యాసమను పేరుగల అలంకారము నిరూపించబడుచున్నది. సామాన్య విశేష భావము గల ప్రస్తుతాప్రస్తుతములు గలిగి అప్రస్తుతమువలన ప్రస్తుతము సమర్థించబడినపుడు అర్థాంతరన్యాసమను నలంకార మేర్పడును. అది సామాన్యము వలన విశేష సమర్థనము, విశేషము వలన సామాన్య సమర్థన మని రెండు రకములుగా నుండును.

ఉ దా హ ర ణ ము :

రామేశసంజాతయశ స్సమంతా దాహత్య సర్వామపి రాజ్యలక్ష్మీమ్।
హఠా దతిక్రామతి సర్వలోకాన్ గుణా నిదానానుగుణా హి కార్యే॥ 136

అత్ర "గుణా నిదానానుగుణా" ఇతి సామాన్యేన రామేశ యశో విలక్షణ కార్యేణ కారణవిశేషగుణానుగుణ్యం సమర్థ్యతే ।

అ ర్థ ము :

రామేశ వంజాత యశః — రామేశుని వలన కలిగిన కీర్తి । సమంతాత్ — అంతటను । సర్వాం — సమస్తమైన । రాజ్యలక్ష్మీం — రాజ్యలక్ష్మిని । ఆహత్య వశీకరించుకొని । హఠాత్ — బలాత్కారముగా । సర్వలోకాన్ — అన్ని లోకములను । అతిక్రామతి — అతిక్రమించుచున్నది । హి — అదియుక్తమే । కార్యే — కార్యము నందలి । గుణాః — గుణములు । నిదానానుగుణాః — కారణ గుణముల ననుసరించునవి ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు కీర్తి అన్నిలోకములను రాజ్యలక్ష్మిని కూడ ఆక్రమించినది. ఇది యుక్తమే. ఏమనిన రామేశ ప్రభువు అన్నిలోకములను రాజ్యలక్ష్మిని కూడ నాక్రమించుకొనినాడు కదా. మరి ఆయనవలన కలిగిన కీర్తికి ఆయన గుణము లబ్బి తీరును. సామాన్యముగా కార్యము నందలి గుణములు కారణ గుణముల బట్టియే కదా ఏర్పడుచుండును. ఇట్లిచ్చట కార్య గుణములు కారణ గుణానుగుణములను సామాన్యము చేత కార్యవిశేషమగు యశస్సు నందలి గుణములు కారణ విశేష మగు రామేశుని గుణముల కనుగుణములగుట సమర్థించబడినది. కనుక నిది మొదటి రకపుటర్థాంతరన్యాసము.

మహతా మపి ధీః క్వచిత్ స్ఖలిత్వా స్థిరతా మేతి యదబ్జభూ రరీణామ్।
అలికేషు విలిఖ్య భాగ్యవర్ణాన్ స తదామ్మన్నవిభో పునర్విమార్ష్టి॥ 137

అత్ర బ్రహ్మ ప్రథమం రామేశపాలదేశే భాగ్యవర్ణా న్విలిఖ్య తత్ప్రతిపక్షపాలదేశేషు దౌర్భాగ్యవర్ణా లేఖనీయా ఇతి మనస్యుద్దిశ్య లేఖనసమయే ప్రమాదాద్విపక్షపాలదేశేష్వపి భాగ్య వర్ణానాలేఖ్య పశ్చాదవబుద్ధ్య (తత్ క్రుద్ధేవ కృతమేధా) తత్ క్రుధాక్రుధ్ క్రోధః, తయా తానవమార్ష్టీత్యనేన, విశేషేణ, మహతా మిత్యాది సామాన్యం సమర్థితమ్।

అ ర్థ ము :

శ్లోకములోని నాల్గవ పాదము 'పున రమ్మన్న విభుక్రుధా విమార్ష్టి' అనురీతిలో నుండవలెనని శ్లోకము క్రింది వివరణమును బట్టి తెలిసికొనవచ్చును. మహతాం — గొప్పవారల । ధీరపి — బుద్ధికూడా । క్వచిత్ — ఒకప్పుడు । స్ఖలిత్వా — జారి । స్థిరతాం — నిలకడను । ఏతి — పొందును । యత్ — ఏమనగా । అబ్జభూః — బ్రహ్మదేవుడు । అరీణాం — శత్రువుల యొక్క । అలికేషు — ఫాల భాగములందు । భాగ్య వర్ణాన్ — భాగ్యము కలుగును అను వర్ణములను । విలిఖ్య — వ్రాసి । పునః - మరల । అమ్మన్న విభుక్రుధా — అమ్మన్న ప్రభు క్రోధముతో । విమార్ష్టి — తుడిచివేయుచున్నాడు ।

వివరణము :

ఇట బ్రహ్మదేవుడు మొదట అమ్మన్న ప్రభువు నుదుట భాగ్యవర్ణములను, తద్విపక్షుల నుదుట దౌర్భాగ్య వర్ణములను వ్రాయవలెననుకొని పొరపాటున శత్రు ఫాల భాగమునే కూడ భాగ్యవర్ణముల వ్రాసి పిదప అతని క్రోధముతో వాటిని తుడిచివైచినాడట. దీనితో పెద్ద వారలబుద్ధికూడ అపుడపుడు చలించి మరల స్థైర్యము జెందునను సామాన్యము సమర్థించబడి నది. కనుక నిది రెండవ రకపు టర్థాంతరన్యాసము.

అథ పర్యాయోక్తాలంకారః

ప్రస్తుతహేతుర్యత్ర ప్రస్తుతకార్యోపవర్ణనాద్ గమ్యః।
పర్యాయోక్తం నామాలంకారం తం విపశ్చితో బ్రువతే॥ 138

ప్రతీయమానప్రస్తావాదేవాత్ర నిరూపణమేతస్య। అత్రాప్రస్తుతప్రశం సాయామపి కార్యాత్కారణస్య గమ్యత్వేఽపి ద్వయోః ప్రస్తుతత్వాభావా దితో వివిక్త ఏవతస్య విషయః।

యథా –

వివరణము :

అప్రకృత కార్యమును వర్ణించుటచే ప్రకృత హేతువు గమ్యమైన నది పర్యాయోక్తమను నలంకార మగును. ప్రతీయమానముల సందర్భము ఏర్పడినందుననే ఇచ్చట పర్యాయోక్తము నిరూపించబడుచున్నది. అప్రస్తుత ప్రశంసలోను కార్యము వలన కారణము గమ్యము కావ చ్చును. ఐనను అందునొకటి ప్రస్తుతము —మరియొక్కటి అప్రస్తుతము. పర్యాయోక్తములో రెండును ప్రస్తుతములే. కనుక పర్యాయోక్తముకంటె అప్రస్తుత ప్రశంసకు విషయ భేదము చెప్పుకొనవచ్చును.

ఉదాహరణము—

రామేశ సంతర్పిత మార్గణానా మితస్తత స్సంచరతాం జనానామ్।
భవంతి మార్గే బహుధా నివాసా గేహాన్యరి క్ష్మాపతి సజ్జితాని॥ 139

అత్ర ప్రతిపక్ష గేహానాం రామేశయాచక జన ప్రతి శ్రయ లక్షణకార్యో పవర్ణనేన ప్రస్తుతేనైవ రామేశదానకాలఏవ శత్రవస్స్వసహానేన బహుకాల సజ్జీకృతాన్యపి భవనాని విహాయ పలాయితా ఇతి ప్రస్తుతకారణం గమ్యతే । కార్యకారణయోః పర్యాయేణోక్తిరితి అన్వర్థోఽయ మలంకారః।

అర్థము :

రామేశ — రామేశప్రభువుచేత । సంతర్పిత - సంతోషపెట్టపడిన । మార్గణానాం । యాచకులకు । ఇతస్తతః - ఇటునటు । సంచరతాం — తిరుగునట్టి । జనానాం - జనులకు - మార్గే — దారిలో । అరిక్ష్మాపతి సజ్జితాని - శత్రురాజులచేత నలంకరింపబడిన । గేహాని — భవనములు । బహుధా — అనేకములుగా । నివాసాః — నివాస స్థానములుగా । భవంతి — అగుచున్నవి ।

వివరణము :

రామేశ ప్రభువు కోరికలన్నిటిని తీర్చగా నిటునటు తిరుగు యాచకజనులకు శత్రువుల భవనము లనేకములు నివాస స్థానము లగుచున్నవి. ఇట్లు వర్ణించుట చేత ప్రభువు యాచకులకు చేయు దానమును చూచినంతనే అసహనముతో శత్రు రాజులు తమ తమ భవనముల విడిచి పారిపోయిరి - అనెడు మరియొక ప్రస్తుతాంశము వ్యంగ్యమగుచున్నది. ఈ వ్యంగ్యము వాచ్యార్థమగుదానికి హేతువు. ఏమనిన శత్రువులు ఇల్లనువిడిచిపెట్టిననేకదా యాచకు లాక్రమించుకొనగలుగుట. ఇవ్విధముగా ప్రస్తుతవాచ్యమునకు ప్రస్తుతవ్యంగ్యము హేతువుగా నున్నందున నిచట పర్యాయోక్తాలంకారము. కార్య కారణములు వరుసగా చెప్పబడినందున పర్యాయోక్తమని దీనికి సార్థకనామమేర్పడినది. 'పర్యాయ'మనగా 'వరుస'గా అని ఇచట అర్థము.

అథ వ్యాజస్తుత్యలంకారః:-

స్తుతి నిందా రూపత్వే ప్రస్తుత మప్రస్తుతాత్ప్రతీయేత।
యది సా వ్యాజ స్తుతి రితి ఆఖ్యాతా కవివరైస్తథా ద్వివిధా ॥ 140

యత్రస్తుతౌ ప్రస్తుతాయాం అప్రస్తుతానిందాభిధీయమానా తస్యామేవ విశ్రామ్యతి । తథైవ నిందాయాం ప్రస్తుతాయాం అప్రస్తుతా స్తుతి రభిధీయమానా తస్యామేవ విశ్రామ్యతి । తత్రేయం ద్వివిధా వ్యాజస్తుతిః । క్రమేణ యథా:-

వివరణము :

స్తుతి రూపమో నిందారూపమో అగు ప్రస్తుతము, అట్టి నిందారూపమో స్తుతిరూపమో అగు నప్రస్తుతము వలన, అవగతమయిన నది వ్యాజస్తుతియలంకారము. ఇది అప్రస్తుత నిందాభిధానము ప్రస్తుతస్తుతిగా పర్యవసించుటయని — అప్రస్తుత స్తుత్యభిధానము ప్రస్తుత నిందగా పర్యవసించుట యని రెండు విధములు. వరుసగా ఉదాహరించబడుచున్నవి.

దారిద్ర్య దైన్య ముఖ బంధుజనై ర్వియోగం
సంప్రాపయన్ బుధగణా (న్భృ) చ్ఛ్రితభూతి మాత్రాన్।
రామేశ ధీర కలయన్ కరుణాసముద్రే
సంప్రక్షిపన్ బుధజనే చ కథం దయాళుః ? ॥ 141

అత్ర విశ్రాంతయా నిందయా నాయకస్య కరుణాసముద్రత్వం గమ్యతే।

**అర్థము :**

ధీర — ధీరుడవగు। రామేశ—ఓరామేశప్రభూ। దారిద్ర్య — దారిద్ర్యము। దైన్య — దీనభావము। ముఖ — మొదలగు। బంధుజనైః — చుట్టములతో। వియోగం — విశ్లేషమును। సంప్రాపయన్ — పొందింపజేయుచు। బుధగణాన్ — విద్వత్సమూహములను। శ్రిత భూతి మాత్రాన్ - ఆశ్రయించిన ఐశ్వర్యము — భస్మము — మాత్రమే కలవారలనుగా। కలయన్ - చేయుచు। కరుణా సముద్రే — దయయనెడు సముద్రమున। సంప్రక్షిపన్ - వేయుచు। (భవాన్ నీవు)। బుధజనేచ — విద్వజ్జనుల యందు। కథం — ఎట్లు। దయాళుః — దయ గలవాడివి?।

**వివరణము :**

విద్వాంసులకు చుట్టములుగానున్న దారిద్ర్యదైన్యాదుల తరిమివేసి, కేవల భూతియే మిగులునట్లు చేసి, చివరగా కరుణయను సముద్రములో వారల వేయుచున్నవాడని, రామేశుని నిందారూపముగా నున్న వాచ్యార్థము వలన, విద్వాంసుల నైశ్వర్యవంతులుగా చేసి, తన దయకు పాత్రులనుగా చేయుచున్నాడను స్తుతి గమ్యమగుచున్నది. అప్రస్తుతమగు నీనింద ప్రస్తుత స్తుతి రూపమున పర్యవసించుచున్నది. కనుక నిది మొదటి రకపు వ్యాజస్తుతి.

త్వాం విద్విషంతి భువి పుణ్య జనాస్తు యేవై
బర్హి ర్ముఖత్వ ముపలభ్య హిమాచలాగ్రే।
తత్రత్యసింహశరభై స్సహ లబ్ధ భోగాః
శూన్యం ప్రియాం త్యహహ రామవిభో విభుత్వమ్ ॥ 142

అత్ర శ్లేష మహిమ్నా ప్రక్రాంతయా స్తుత్యా నిందాఽభివ్యజ్యతే।

**అర్థము :**

రామవిభో — ఓరామేశ ప్రభూ। యేవై — ఎవరైతే। పుణ్యజనాస్తు — పుణ్యముగల జనులు — రాక్షసులు। భువి - భూమియందు। త్వాం — నిన్ను। విద్విషంతి — ద్వేషించు

చున్నారో। (తే – వారలు)। జర్జిర్మఖత్వం – దేవభావమును – గడ్డి నోటగలవారగుటను।
ఉపలభ్య – పొంది। హిమాచలాగ్రే – హిమాలయముపైన। తత్రైవ – అక్కడనున్న।
సింహశరభైస్సహ – సింహ శరభములతోపాటు ।లబ్ధభోగాః – పొందిన భోగములు గల
వారలై । శూన్యం – ఏమి (కలత)లేని । విభుత్వం - ప్రభుత్వమును । ప్రయాంతి - పొందు
చున్నారు । అహహ – ఆశ్చర్యము – తిరస్కారము ।

వి వ ర ణ ము :

ఇచ్చట రామేశ శత్రువులు పుణ్యము గల వారలని, దేవతలని, సింహ శరభముల వంటి మహా భోగములు గలవారని, ఎట్టి కలతలు లేని ప్రభుత్వముకలవారని అప్రస్తుత మగు శత్రుస్తుతి వాచ్యార్థము. ఐనను శ్లేషమును బట్టి వారు రాక్షసులని, గడ్డి గరచుకొని పోయిరని, అడవులలో సింహాదులతోపాటు జీవితము గడుపుచున్నారని, వాస్తవికముగా ఏమిలేని ప్రభుత్వము గలవారని ప్రస్తుతార్థము ఏర్పడుచున్నది. ఇచట రెండవ అర్థము శబ్ద శక్తి మూల వ్యంజన వల్ల నేర్పడినది. వాచ్యమగుస్తుతికి వ్యంగ్యమగు నీ నిందయందే పర్యవసానము. కావున నిది రెండవ రకపు వ్యాజస్తుతి. ఇచట శ్లోక ప్రథమ పాదములో "భువి" యను పదము ఛందస్సు కోసము చేర్చబడినది. మూలములో కానరాలేదు.

అథాక్షేపాలంకారః

ఉక్తం వా వక్ష్యమాణం వా ప్రకృతం ప్రతి షిద్యతే ।
కంచి ద్విశేషం ద్యోతయితుం తత్రాక్షేపః ప్రచక్ష్యతే ॥ 143

యత్ర కంచిదపి విశేషమభివ్యంజయితుం ప్రస్తుతస్యైవోక్తస్య
వక్ష్యమాణస్య వా ప్రతిషేధాభా (వ) స ఉపన్యస్తః స్యాత్,
తత్ర ద్వివిధోయ మాక్షేపాలంకారః ।
క్రమేణ యథా–

వి వ ర ణ ము :

ఒక క్రొత్త విశేషమును తెలపుటకై చెప్పిన దానిని కాని, చెప్పబోవు దానిని కాని ప్రకృతమును నిషేధించుట జరిగిన నది యాక్షేపాలంకారము. అది ఉక్త ప్రతిషేధము– వక్ష్యమాణ ప్రతిషేధమని రెండు విధములు. వరుసగా నుదాహరణములు. ఇచట ఛందో భంగవారణార్థము 3వ పాదము "విశేషద్యోతనార్థాయ" అని సవరించుకొనవలెను.

అకల్పితం హి జగదేక వదాన్యధూరాత్
దానా త్స (ద) లక్షపదమేతి కవి స్తవేతి ।

రామేశ ధీర కథయాశు కథంత్విదానీం
ఔదార్యత స్తవ భవామి భృశం విలక్షః ॥ 144

అత్ర రామేశవిబుధ నిష్ట లక్షాధికారేణ అస్మన్నిష్ట విలక్షత్వస్యాక్షేపః। విలక్షపదశ్లేష మహిమ్నా తు మయి విస్మయావిష్టత్వం ధ్వన్యతే।

అర్థము :

జగదేక వదాన్య – ప్రపంచములోని ముఖ్యదాతవునగు । ధీర – ధీరుడవునగు । రామేశ – ఓరామేశప్రభూ । తవ – నీయొక్క । దానాత్ – దానమువలన । కవిః – కవి సలక్షపదం – లక్షాధికారి పదమును । ఏతి – పొందుచున్నాడు । ఇతి – అని । దూరాత్ - దూరమునుండి । ఆకర్ణితం – వినుటయైనది । ఇదానీం - ఇప్పుడు । కథంతు – ఎట్లు । తవ - నీయొక్క । ఔదార్యతః – దానమువలన । (అహం – నేను) । భృశం – మిక్కిలి । విలక్షః – లక్షలేనివానిగా – ఆశ్చర్యము గల వానిగా । భవామి - అగుచున్నాను । ఆశు – త్వరగా । కథయ – తెలుపుము ।

వివరణము :

ఇచ్చట రాజుగారి దానము వలన కవి సలక్షు డగుచున్నాడని చెప్పి, కవియైన తాను రాజుగారి దానము వలన విలక్షుడయినందున మొదట చెప్పిన యంశము నిషేధించబడు చున్నది. ఐనను దాన గుణము యొక్క గొప్పదనమును మరియొక విశేషము చెప్పుటకేకదా ఇచ్చట ఈ నిషేధము. తన నాశ్చర్యమున ముంచివేసిన దనగా రాజుగారి దానము చాల గొప్పదని తెలియుచున్నది. ఈ విశేషద్యోతనార్థమే ఉక్త నిషేధము కనుక నిది మొదటిరకపు ఆక్షేపము. మూల పంక్తులలో రామేశ –విబుధుల యందలి లక్షాధికారముతో తనయందలి విలక్షత్వమునకాక్షేపము జరిగినటున్నది. ఆక్షేపమనగా నిటనిషేధము. తానుకూడ రామేశ విబుధుడే (రామేశునికి సంబంధించిన పండితుడే) కనుక తనయందు విలక్షత్వము అనగా లక్ష లేకపోవుట నిషేధించబడి, ఆశ్చర్య మభివ్యక్తమగుచున్నదని తాత్పర్యము

రామేశ దుర్లభం త్వాసీద్దుర్భిక్షం విదుషాం కులే ।
కల్పద్రో రవతీర్ణస్య దీనానేవావితుం దివః ॥ 145

అత్ర విదుషాం భాగ్యోదయేన నాయకే కల్పద్రుమత్వమాక్షిప్యత ఇత్యాక్షేపః ।

అర్థము :

రామేశ – ఓరామేశప్రభూ । దివః – స్వర్గమునుండి । దీనానేవ –దీనులనే । అవితుం- రక్షించుటకు । కల్పద్రోః – కల్పవృక్షము । అవతీర్ణస్యసతః – అవతరించినదియగుచుండగా ।

విదుషాం — విద్వాంసుల । కులే — సముదాయమునందు । దుర్భిక్షం — దారిద్ర్యము । దుర్ల భంతు — దుర్లభమైనదియై । ఆసీత్ — ఉండెను ।

**వి వ ర ణ ము :**

ఇచ్చట స్వర్గమునుండి కల్పవృక్ష మవతరించినందున విద్వాంసులకు దారిద్ర్యము తొలగిపోయినదని వర్ణించబడినది. ఆ కల్పవృక్షము కన్పించుటలేదు కనుక విద్వాంసుల దారిద్ర్యము బాపు రామేశుడే కల్పవృక్షమని, రామేశుని యందు కల్పవృక్షత్వ మాక్షేపించ బడుచున్నది - గ్రంథకర్త అనుచున్నాడు. ఐన ఇది అర్థాపత్తి కావచ్చునే కాని, ఆక్షేపాలం కార లక్షణము ఇక్కడ సమన్వితము కానందున దీని కుదాహరణము కాదు.

యథావా :-

మరి యొక ఉదాహరణము

కేతకీపుర యాత్రాం తే శ్రుత్వాహం వక్తు మాగతః ।
రామేశ తత్కథం వచ్మి సర్వశాస్త్ర విది త్వయి ॥ 146

అత్ర "వక్తు మాగత" ఇతికథన సామాన్యం ప్రతిజ్ఞాయ
(విశేష కథన మాభాసేన) 'కథం వచ్మి" ఇతి నిషేధాభాసేన అస్మ
దర్శిక్షణచాతుర్యం తవాధీనమితి విశేషో వ్యజ్యతే ।

**అ ర్థ ము :**

రామేశ — ఓ రామేశప్రభూ । తే — నీయొక్క । కేతకీపురయాత్రాం — కేతకీ పట్టణ ( ? ) యాత్రను । శ్రుత్వా — విని । అహం — నేను । వక్తుం — చెప్పుటకు । ఆగతః — వచ్చితిని । తత్ — దానిని । సర్వశాస్త్రవిది — అన్ని శాస్త్రములు తెలిసిన । త్వయి — నీవిష యమై । కథం — ఎట్లు । వచ్మి — చెప్పగలను ? ।

**వి వ ర ణ ము :**

ఇచ్చట ఏదో తాను చెప్పబోయి, అన్ని తెలిసిన మీకు నేను చెప్పవలసిదేమున్నది అని నిషేధించుటయైనది. ఇది వక్ష్యమాణ ప్రతిషేధరూపమగు రెండవరకపు ఆక్షేపము. మారక్షణ కార్యమంతయు నీయధీనమను విశేషము, నీవు అన్నియు తెలిసిన వాడవను విశేష ముకూడా నిట తెలియుచున్నది.

అంశోక్తా వంశాంతర నిషేధోఽపి ఆక్షేప ఇతి విశ్వానంద యోరాగీ జగాద ।
యథా—

హేమాద్రిః కిమయం న హీషదపి యం సంత్రాసిన స్సంశ్రితాః
దిగ్దంతీ కిమయం న హి ప్రసహతే భవ్యం హరే ర్నామ సః ।
భోగీంద్రః కిమయం న హి ప్రకుపితో లోకేసయజ్జిహ్మగః
సందిహ్యేహ బుధై స్స విబుధరాడ్రామేశ్వరో నిశ్చితః ॥ 147

ఇతి ఏతస్య సందేహాత్ పృథక్ చమత్కార కారిత్వాభావేన నై తదవాంతర భేదో భవతి ।

యథావా—

వివరణము :

ఈ శ్లోకము సందేహాలంకార ప్రకరణములో వ్యాఖ్యాతమే । నాల్గవ పాదములోకొంత భేదమున్నది. ఐనను అర్థము స్పష్టమే. కొంతచెప్పి కొంత నిషేధించుట కూడ ఆక్షేపమని నిత్యానందయోగి అనెను. పై శ్లోకములో బంగారు కొండ కాదని నిషేధించుటతోపాటు, విరాగులు కూడ వీతనిని ఆశ్రయించి యున్నారు — అని ఒక అంశము చెప్పుట మరియొక అంశమును నిషేధించుట జరిగినది. ఇటువంటిదానిలో సందేహాలంకారమునకంటె విడిగా చమత్కారము లేనందున ఆక్షేపావాంతర భేదముగా చెప్పుకొనవలసిన అవసరము లేదు.

మరియొక ఉదాహరణము

రామేశ ప్రభు సార్వభౌమ విదుషాం గేహేషు మే నాస్తి చేత్
వస్తుం ధాత రహం ప్రియామి సుచిరం స్థాతుం ప్రభూణాం కులే ।
తస్యాత్యంత విరోధినా మితి ముహు ర్నిశ్చిత్య పద్మాగ్రజా
స్వాపత్యై స్సహ సంవివేశ పిశునస్తేయాదిభి స్తత్ర హ ॥ 148

అత్ర భో జ్యేష్ఠే రామేశవిద్వత్కులేషు మాతిష్ఠ తత్ర ప్రభు సార్వభౌమ పాదప్రసారో భవిష్యతీత్యేవం వదంతం చతుర్ముఖం ప్రతి, జ్యేష్ఠాపి తత్ర తర్హి నివాసో నాస్తిచేత్ భవతు నామ, మమానురూపం ద్విషత్కులం భవతీ త్యాక్షేపః కృత ఇతి స ఏవాలంకారో భంగ్యంతరేణ వర్ణిత ఇత్యాలంకారిక రహస్యమ్ ।

ఇహాక్షేపాలంకారే ఇష్ట నిషేధే అనిష్టస్యాభాసితతయా విరోధాను ప్రవేశేన తత్ ప్రస్తావాదితః పరం విరోధ గర్భాలంకార వర్గో నిరూప్యతే ।

అ ర్థ ము :

రామేశ ప్రభు సార్వభౌమ విదుషాం - రామేశ ప్రభువు యొక్క విద్వాంసుల యొక్క । గేహేషు — గృహములందు । వస్తుం — నివసించుటకై । మే - నాకు । (అవకాశః — అవకాశము) । నాస్తి చేత్ - లేనిచో । ధాతః - ఓబ్రహ్మ దేవుడా । అహం - నేను । తస్య — ఆరామేశ ప్రభువు యొక్క । అత్యంత విరోధినాం — మిక్కిలి శత్రువులగు । ప్రభూణాం — ప్రభువుల । కులే — గృహమునందు । సుచిరం — చాల కాలము । స్థాతుం - నివసించుటకు । ప్రయామి - వెళ్ళుదును । ఇతి - అని । ముహుః - తేపతేపకు । నిశ్చిత్య — నిశ్చయించి । పద్మాగ్రజా — లక్ష్మీదేవి అక్కయగు జ్యేష్ఠాదేవి । స్వాపత్యైః — తన సంతానమగు । పిశునస్తేయాదిభిస్సహ = పైశున్యము చౌర్యము మొదలగు వానితో । తత్ర — వారిఇండ్లలో సంవివేశహ - బాగుగా ప్రవేశించెను।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు నాశ్రయించిన విద్వాంసుల గృహములందు నివసించగూడదను బ్రహ్మదేవుని యాజ్ఞను బట్టి జ్యేష్ఠాదేవి, వారల గృహములలో వలదనిన ఆ మహారాజు శత్రువుల గృహములలో నివసింతునని చెప్పి, యట్లే నివసించినదని తాత్పర్యము. ఇచ్చట మహారాజాశ్రితుల ఇండ్లలో నివాసము నిషేధించబడినందున ఇక మహారాజ శత్రువుల ఇండ్లలోనే నివసించవలయునను అంశము ఆక్షేపించబడును. ఇట్లిచట ఆక్షేపాలంకారమే వేరు రీతిలో చెప్పబడినది యని ఇది అలంకారిక రహస్యమని గ్రంథకర్త అనుచున్నాడు.

వస్తుతః ఇది ఒకచోట నిషేధించినందున మరియొక చోట ఉనికిని ఆక్షేపించుకొనుట అర్థాపత్తి కావచ్చును. కాని ఆక్షేపాలంకార లక్షణ లక్షితము కానందున ఆక్షేపాలంకారమునకు ఉదాహరణమనుటకు వీలులేదు.

ఈ ఆక్షేపాలంకారమున ఉక్తము లేదా వక్ష్యమాణమునకు నిష్టము నిషేధించబడి, తద్భిన్నమగు విశేషము భాసించుటలో విరోధము ప్రస్తుతమైనందున నిక విరోధ గర్భాలంకారము లు నిరూపించబడును.

## అథ విరోధాలంకారః

స విరోధాలంకారో దశధా త్వస్మిన్ విరోధఆక్షేపే। 149

యత్రాపాతప్రతీతో విరోధః పర్యవసానే పరిహ్రియతే, తత్రి విరోధాలంకారః। పర్యవసానేఽపి యది విరోధః తథైవావతిష్ఠేత తదా దోష ఏవ। తత్రతజాతేః, జాతిగుణ క్రియా ద్రవ్యైః విరోధే చత్వారో భేదాః।

క్రియాయాః క్రియాగుణద్రవ్యైస్త్రయః, గుణస్య గుణద్రవ్యాభ్యాం ద్వౌ, ద్రవ్యస్య ద్రవ్యేణైక- ఇతి సంభూయ దశ విరోధాలంకారాః।

వివరణము :

ఇచ్చట లక్షణము చెప్పు కారిక రెండుపాదములు మాత్రమే వ్రాతప్రతిలో నున్నవి. మొదటి రెండు పాదముల నిట్లు ఊహించుకొనవచ్చును.

'ఆపాతతః ప్రతీతో యత్ర విరోధః పరిహ్రియేతాంతే'

పైపైకి మాత్రమే తోచు విరోధము చివర పరిహరించఁబడెనేని యది విరోధాలంకార మగును. ఇట్లు పరిహార మేర్పడగా నిందులో వర్ణించబడు విరోధము పదిరకములుగా నుండును. జాతికి — 1 జాతితో 2 గుణముతో 3 క్రియతో 4 ద్రవ్యముతో విరోధముండవచ్చును. కనుక నివి నాలుగు రకములు. ఇట్లే క్రియకు — 1 క్రియతో 2 గుణముతో 3 జాతితో కూడ విరోధము వర్ణించ బడవచ్చును. కనుక నివి మూఁడు రకములు. గుణమునకు — 1 గుణముతో 2 జాతితోను విరోధము చెప్పవచ్చును కనుక నివి రెండు రకములు. ద్రవ్యమునకు — ద్రవ్యముతో విరోధ మొక్కటి — ఇట్లు విరోధాలంకారము పదిరకములు.

విశ్వేశతనుజో భాతి వినతానందవర్ధనః ।
రామేశోఽపి సదా లక్ష్మీం రమయన్నితరాం భువి॥ 150

అత్ర ప్రథమార్థే జాత్యోరేవ విరోధః, తనుజ శబ్దానందవర్ధనశబ్దయో ర్జాతి వాచకత్వాత్। ద్వితీయార్థే జాతేః క్రియయావిరోధః శివస్యలక్ష్మీం రమయన్నితి రముధాత్వర్థస్య విరోధాత్। అత్ర లక్ష్మి ఇతి నాయకస్య ద్వితీయ సహధర్మిణీ నామ శ్లేషోపస్థాపితో విరోధః।

అర్థము :

విశ్వేశ తనుజః — విశ్వేశుని పుత్రుడు । వినతా — వినత యను దానికి, వినత — నమ్రులైనవారికి । ఆనందవర్ధనః — ఆనందము కలిగించు పుత్రుడై — ఆనందము కలిగించు వాడునై । రామేశోఽపి - శివుడయ్యును — రామేశప్రభువై । సదా — ఎల్లపుడు । లక్ష్మీం - లక్ష్మిని । రమయన్ - సంతోషింపచేయువాడై । నితరాం - మిక్కిలి । భువి - భూమి యందు । భాతి — భాసించుచున్నాడు (అధోరేఖ కలవి చేర్చినవి)

వివరణము :

ఇచ్చట శ్లోకములోను పంక్తులలోను 'రమయన్నితరాం' అని 'రమయన్నితి' అనియు చేర్చబడినవి. వినతానందవర్ధను డనగా వినత కానందముకలిగించు కొడుకు గరుడుఁడు. విశ్వేశ

తనుజుడు మరి వినతానందవర్ధను డనుటలో ఆపాతతః విరోధము తోచినది. అపుడు వినతు లకు అనగా నమ్రులకు ఆనందవర్ధనుడనుటవలన ఆ విరోధము తొలగినది. ఇదే శివునికి లక్ష్మీగమనము విరుద్ధము. ఐనను రామేశ శబ్దమునకు ప్రభువను నర్థము వలన లక్ష్మియను నామె రామేశుని మరియుక భార్య యనినందునను నీవిరోధము తొలగినది. కనుక నిచట విరోధాలంకారము.

ఆలంకారికులు ఏకవ్యక్తిని చెప్పు శబ్దములు ద్రవ్యవాచకములనియు, అనేక వ్యక్తివాచ కములైన శబ్దములు జాతివాచకములనియు, వ్యవహరింతురు. ఇచట తనుజ శబ్దము — ఆనంద వర్ధన శబ్దములు జాతివాచకములు. కనుక మొదట జాతికి — జాతితో విరోధము వర్ణించబడి నది. రెండవది జాతికి — క్రియతో విరోధము. రామేశ శబ్దము జాతి వాచకము - రుదులు పదకొండుగురు కనుక రమింపజేయుట రముధాత్వర్థము కనుక క్రియ ఇట్లీశ్లోకములో రెండు రకముల విరోధము ఉదాహరింపబడినది. రామేశ ప్రభువు లక్ష్మిని రమింపజేయు వాడెట్లనగా అతని రెండవ భార్యపేరు లక్ష్మీదేవియే కనుక విరోధము పరిహృత మగుచున్నది. ఇచట విరోధము శ్లేషముతో సుస్థాపితమని తెలిసికొనవలయును.

ద్విజరాజోఽప్యహీనోత్కః ప్రచేతా శ్చుచిరప్యసౌ।
శ్రీరామేశవిభు ర్భాతి పరసేతువిదారణః॥ 151

అత్ర ప్రథమపాదే రాజత్వజాతేః ఔత్సుక్యగుణేన విరోధః। శుచిరపి ప్రచేతా ఇతి జాతి ద్రవ్యయోః, ప్రచేతస ఏకత్వాత్ ।

అర్థము :

ద్విజరాజోఽపి — బ్రాహ్మణ రాజైనప్పటికిని । అహీనోత్కః — అనల్పమైన ఔత్సు క్యము గలవాడు — అహీన - సంఖ్యము గానట్టి । ఉత్ — ఉన్నతమైనట్టి । కః — శిరస్సు గలవాడు । శుచిరపి - అగ్నియైనప్పటికిని — ఉజ్జ్వలుడై నప్పటికిని । ప్రచేతాః — వరు ణుడు - గొప్పమనస్సు కలవాడు । అసౌ — ఈ । శ్రీరామేశవిభుః - రామేశప్రభువు । పర సేతువిదారణః - శత్రురాజుల ఆనకట్టల చీల్చువాడై । భాతి - ప్రకాశించు చున్నాడు ।

వివరణము :

రామేశ ప్రభువు రాజై కూడ ఉత్సుకుడనుటలో విరోధమున్నది. ఏదో ఒక అలభ్య వస్తువు కొరకు వ్యాకులత చెందుట ఔత్సుక్యము. రాజుకు వ్యాకులపాటు ఎందుకుండును? అందుచే నిచట ఆపాతతః విరోధము. ఈ విరోధముకూడ జాతికి — గుణముతో విరోధము. రాజపదము జాతివాచకము, ఔత్సుక్యము గుణము కదా! ఎటువంటి తిరస్కారము లేక తల ఎత్తుకొని తిరుగువాడను రెండవ అర్థము ఈ విరోధమును తొలగించుచున్నది. ఇట్లే అగ్నిని

కూడ వరుణు డనుటలో ఆపాతతః విరోధమున్నది. అగ్ని ఆహవనీయాది భేదేన అనేకము కనుక శుచి శబ్దము జాతి వాచకము. వరుణు డొక్కడే కనుక 'ప్రచేతా' అనునది ద్రవ్యవాచకము. కనుక నీవిరోధము జాతికి - ద్రవ్యముతో నున్న విరోధము. శుచి యనగా ఉజ్జ్వలుడని 'ప్రచేతా'యనగా ప్రకృష్టమనస్సు గలవాడని చెప్పుకొనుట చేత నీవిరోధము పరిహృతమగుచున్నది. ఇట్లీ శ్లోకములో రెండు రకముల విరోధము ఉదాహరించబడినది.

జనార్దనే రతిం ధత్తే హరన్నపి జనద్రుహః।
కామాక్షీతనుజోఽప్యేష సద్వినాయకశామకః॥ 152

అత్ర ప్రథమార్ధే సంహరణ (గుణ) రతిక్రియయో ర్విరోధః। ద్వితీయార్ధే జాతిక్రియయోః।

అర్థము :

జనద్రుహః – జనులహింసించువారలను । హరన్నపి - సంహరించువాడై కూడ । జనార్దనే - జనుల హింసించువానిపై – శ్రీ మహావిష్ణువుపై । రతిం – ప్రీతిని । ధత్తే – ధరించుచున్నాడు । ఏషః – ఈరామేశ ప్రభువు । కామాక్షీతనుజోఽపి – పార్వతీ పుత్రుడై కూడ – కామాక్షి కొడుకై కూడ । సద్వినాయక – మంచి వినాయకస్వామిని – ఉన్న విరుద్ధ నాయకులను । శామకః - శమింపచేయువాడు ।

వివరణము :

ఇచట జనుల పీడించువారిని సంహరించుట, మరియు జనులపీడించు వానియందు ప్రీతి అనునివి రెండు విరుద్ధములు. వీనిలో సంహరణము క్రియ, రతి యనగా ప్రీతి గుణము. కనుక నిది గుణ క్రియా విరోధము. రెండవ అర్థము ద్వారా విరోధము పరిహారము. మూలపంక్తులలో నిచ్చట 'సంహరణ–గుణ–రతి క్రియయోః' అని కలదు. దానిని "రతిగుణ–సంహరణ క్రియయోః" అని సవరించుకొనవలెను. ఉత్తరార్ధములో 'తనుజ' యనునది జాతివాచకము "శామకః" అనునది క్రియావాచకము. కనుక నిచట జాతిక్రియల విరోధము–రెండవ అర్థము ద్వారా పరిహరించబడినది.

భీమోఽపి నకులద్వేషీ శ్రీమాన్విశ్వేశనందనః।
జయత్యత్యద్భుతం లోకే రామస్సన్నపి లక్ష్మణః॥ 153

అత్ర ప్రథమార్ధే ద్రవ్యగుణయోః ఉత్తరార్ధే ద్రవ్యయోరేవ।
అయ మలంకారః శ్లేషేణాపి సంభవతీతి కేచిత్।

అ ర్థ ము :

శ్రీమాన్ — సంపత్తిగల । విశ్వేశ నందనః — రామేశ ప్రభువు । భీమోఽపి — భీముడై — భయంకరుడై — కూడ । నకులద్వేషీ — నకులుని ద్వేషించువాడు — కులమును ద్వేషించనివాడు । రామస్సన్నపి — రాముడై కూడ — రామేశుడై కూడ । లక్ష్మణః — లక్ష్మణుడు — సంపత్తిగలవాడు — ఐ । లోకే — లోకమునందు । జయతి — సర్వోత్కృష్టుడుగానున్నాడు । అత్యద్భుతం — మహాశ్చర్యము।

వి వ ర ణ ము :

ఇచ్చట పూర్వార్ధములో భీమ డను ద్రవ్యమునకు — నకులద్వేషమను గుణముతో విరోధము, రెండవ అర్థము ద్వారా పరిహృతము. ద్వితీయార్ధమున ద్రవ్యములగు రామలక్ష్మణులకు విరోధము ద్వితీయార్థము ద్వారా పరిహృతము.

మూలములో "అయ మలంకారః శ్లేషేణాపి సంభవతీతి కేచిత్" అని ఉన్నది. అనగా ఈ అలంకారము శ్లేషముతోకూడ ఉండునని కొందరందురని అర్థము. ఐన గ్రంథకర్త ఉదాహరణములన్నియు శ్లేషము కలవియే కనుక మూలములో "శ్లేషేణాపి" యనుచోట "అశ్లేషణాపి" యని యుండవలెను. అపుడు శ్లేషము లేక గూడ నీయలంకారముండునని కొందర దురు అను నర్థమేర్పడి వాక్యార్థముపపన్నమగును.

అథ విభావనాలంకారః

ప్రకటితకారణవిరహే కార్యోత్పత్తి ర్విభావనా జ్ఞేయా।
ముఖ్యకారణాభావేఽపి కార్యోత్పత్తి ర్విభావనేతి ప్రాహుః॥ 154

యథా:—

వి వ ర ణ ము :

ముఖ్యమైన కారణము లేనప్పటికిని కార్య ముత్పన్నమైనట్లు వర్ణించబడిన నది విభావనాలంకారమగును — ఉదాహరణము —

రామేశ దీనకరుణావరుణాలయాద్య
త్వత్పండితౌఘసుళమేషు వినా పయోదైః।
ఆశాప్రాంతకాంతవసువృష్టి రియం విభాతి
సాఫల్యమేతి (ము) సుఖకర్మలతా యయాఽపి॥ 155

అర్థము :

దీన — దీనులకు । కరుణావరుణాలయ - దయాసముద్రుడవగు । రామేశ — ఓరామేశ ప్రభూ । అద్య — ఇపుడు । త్వత్పండితౌఘ — నీపండితుల సమూహము యొక్క । సుశయేషు — మంచి హస్తములందు । పయోదైర్వినా — మేఘములు లేకనే । ఇయం — ఈ । అక్రాంత — ఎల్లపుడు । కాంత - మనోహరమగు । వసువృష్టిః — సంపద్వర్షము । విభాతి - భాసించుచున్నది । యయాపి — దేనిచేత । సుఖకర్మలతా - సుఖమును కలిగించు కర్మయను తీగ । సాఫల్యం - ఫలము గలది యగుటను । ఏతి - పొందుచున్నది ।

వివరణము :

మహారాజ దానగుణముచే తదాశ్రిత పండితులు ధనవంతులై సుఖించు చున్నారు. పండితుల చేతులలో ధనవృష్టి, మేఘములు లేకనే ఏర్పడుచున్నదని వర్ణించుటచే, ముఖ్య కారణము లేకనే కార్యము కలిగినట్లు వర్ణించబడినదై నది. అందుచే ఇది విభావనకుదాహరణము.

అథ విశేషోక్తి రలంకారః

సతికారణపౌష్కల్యే కార్యం న హి చే ద్విశేషోక్తిః । 156

యథా-

వివరణము :

కారణములన్ని యున్నప్పటికిని కార్యము కలుగనిచో నది విశేషోక్తి యలంకారమగును.
ఉదాహరణము:-

చలత్కనకకంకణే విలసదూర్మికాచంచలే
కరాభిధఘనాఘనే వితరణోదధారాలతాం।
గతేఽపి భువనత్రయే తవ విరోధినాం జీవనం
విశుష్యతి విచక్షణప్రభువరాద్భుతం సాంప్రతమ్॥ 157

అత్ర రామేశకరకమలఘనాఘనే నితంతరం దానాంబువర్షవ్యాపృతత్రాణాం జీవనమేవ జీవనం జలం తత్దుర్లభమితి విశేషోక్తిః, ఇయమపి నిమిత్తోపాదానానుపదాన రూపేతి సంక్షేపః । యథావా -

అర్థము :

చలత్కనక కంకణే — కదలుచున్న బంగారు కంకణములుగల। విలసదూర్మికా చంచలే — ప్రకాశించు ఉంగరములచేత కదలుచున్న। కరాభిధ ఘనాఘనే — హస్తమను పేరుగల మేఘము। వితరణోద దారాంతాం — దానోదక ధారలుగలదగుటను। గతేపి — పొందినను। తవ — నీయొక్క। విరోధినాం — శత్రువులకు। భువనత్రయే - మూడులోకముల యందును। జీవనం — నీరు — జీవితము। (విశుష్యతి - ఎండిపోవుచున్నది)। విచక్షణప్రభువర — వివేకముగల ఓమహారాజా। సాంప్రతం — ఇప్పుడు। అద్భుతం — ఆశ్చర్యము।

వివరణము :

ఇచ్చట రామేశ హస్త మను మేఘము దానోదకమును వర్షించు చున్నది. మరి నీటి సమృద్ధి యను కార్యము ఉండవలెను. కాని శత్రువులకు మూడు లోకములలో నెక్కడను నీటిబొట్టు దొరకుట లేదు అని వర్ణించబడినది. కనుక కారణముండియు కార్యము కలుగలేదని వర్ణించుటచేత నిట విశేషోక్తి. శత్రువులకు వాస్తవములో నీరు దుర్లభము కాదు, మరేమన బ్రతుకు. ఐనను జీవన శబ్దమునకు నీరని — బ్రతుకని రెండర్థములును గలవు. కనుక నిచ్చట విశేషోక్తి — జీవన పద శ్లేషము వలన నిర్వహించ బడినది. ఇదియు కారణమున్నప్పటికి కార్యము కలుగకపోవుటకు నిమిత్తము చెప్పుట — చెప్పకపోవుటలను బట్టి రెండు రకములు కావచ్చును ఇచట నటో రేఖాంకిత భాగము మూలములో కానరాలేదు. అర్థౌచిత్యము ననుసరించి చేర్చబడినది. మరియొక ఉదాహరణము—

రామేశ భూమీతల వాసవేఽపి మనోరథా న్వర్షతి మార్గణానామ్।
కుతాప్యరాతిక్షితిభృత్సుచిత్రం వార్తాఽపి నోదంచతి జీవనస్య॥ 158

వివరణము :

రామేశ భూమీంద్రుడు యాచకుల కభీష్టముల వర్షించుచుండ, వాని శత్రువులకు ఎక్కడను నీటి వార్తకూడ అందుటలేదని పై శ్లోక భావమే వేరు పదములతో చెప్పబడినది. ఐన నిక్కడ కూడ జీవన పద శ్లేషమే విశేషోక్తి నిర్వాహకము.

అథాసంగత్యలంకారః

కవిభి రసంగతి రుదితాభిన్నస్థలతైవ కార్యకారణయోః। 159

కార్య మున్నచోటనే కారణ ముండితీరవలెను. కాని అట్లుగాక కార్య మొకచోట కారణము వేరొకచోట వర్ణించబడెనేని అది అసంగత్యలంకారమనబడును.

ఉ దా హ ర ణ ము :

భవత్ప్రతాపాగ్ని రనిష్టసంఘాన్ కుర్వన్ సమాజేషుశిఖావలీ ఢాన్।
రామేశవిప్రాగ్ర్య తదంగనానాం ముఖేషు సూతే బత కాలిమానమ్॥ 160
అత్రాగ్నిశిఖావలేహన కాలిమ్నో ర్భిన్నదేశత్వమ్।

అ ర్థ ము :

రామేశ విప్రాగ్ర్య — రామేశవిప్రశ్రేష్ఠుడా । భవత్ప్రతాపాగ్నిః — నీ పరాక్రమమనెడు అగ్ని । సమాజేషు — మానవ సమూహములలో । అనిష్ట సంఘాన్ — శత్రు సముదాయములను । శిఖావలీఢాన్ — జ్వాలా క్రాంతులనుగా । కుర్వన్ — చేయుచు । తదంగనానాం— వారి స్త్రీలయొక్క । ముఖేషు — ముఖములయందు । కాలిమానం — నలుపును । సూతే — కలిగించుచున్నది । బత — ఆశ్చర్యము ।

వి వ ర ణ ము :

ఇచ్చట రామేశ ప్రతాపాగ్నిచేత కాలినవారు శత్రువులు. వారి స్త్రీలమొగములేమో నల్లబడినవి అని వర్ణించబడినది. ఇట్లు కారణ మొకచోట కార్య మింకొకచోట ఏర్పడినట్లు వర్ణించ బడినందున నిచట అసంగత్యలంకారము.

## అథ విషమాలంకారః

విసదృశకార్యేఽనర్థోత్పత్తౌ ఘటనావిరూపయో ర్విషమమ్। 161

అత్ర కారణస్య విసదృశకార్యోదయే ప్రథమం విషమమ్।
అనర్థోదయే ద్వితీయమ్। విరూపయో ర్ఘటనాయాం తృతీయమ్। క్రమేణ యథా—

వి వ ర ణ ము :

కారణమునకు అనుగుణము కాని కార్యము గలిగినట్లు వర్ణించబడిన విషమాలంకారమగును. ఇదియొక రకము. ఇట్లే కారణమున కననుగుణమగుటయే కాక అనర్థ రూపమగు కార్యము కలిగినట్లు వర్ణించబడినను విషమాలంకారమే. ఇది రెండవ రకము. ఇక పొందిక లేని రెంటికి సమావేశము వర్ణించబడిన నది మూడవ రకపు విషమాలంకారమగును. వరుసగా నుదాహరణములు :

సతో ముష ర్యున్నమితో త్వదీయా ద్రామేశ పద్మప్రతిమా టపాంగాత్।
అవిర్భవం త్యుజ్జ్వలకుండలాని గ్రైవేయహారావళి కంకణాని॥ 162

అత్ర గ్రైవేయహారాదీనాం కార్యాణాం కారణవిసదృశానామేవోత్పత్తిః।

అర్థము :

రామేశ — రామేశప్రభూ। సతాం — సజ్జనుల। ఉపరి — పైకి। ఉన్నమితాత్ — ఎత్తబడిన। త్వదీయాత్ — నీ। పద్మప్రతిమాత్ — పద్మమువంటి। అపాంగాత్ — క్రీగంటి చూపు వలన। ఉజ్జ్వల కుండలాని — ప్రకాశించు కర్ణభూషణములు। గ్రైవేయహారావళికంకణాని — కంఠభూషణహార సముదాయములు కంకణములు। ఆవిర్భవంతి — ఏర్పడుచున్నవి।

వివరణము :

మహారాజ కటాక్షము వలన కుండలాదులేర్పడుచున్నవి యని వర్ణించుటచేత కారణమగు కటాక్షమునకు అనుగుణముకాని కుండలాది కార్యోత్పత్తి వర్ణించబడినట్లైనది. కనుక యిది మొదటిరకపు విషమాలంకారము.

రెండవదాని యుదాహరణము

ద్వితీయో యథా—

యామాత్మరక్షణకృతే పరపీడనాయ
రామేశ బుద్ధి మనుజగ్ము రరాతయస్తే।
భగ్నా స్తయైవ పరిలుప్తవివేక భాగ్యాః
స్తైర్వ స్సంచరంత్యకరుణం పరిభర్త్స్యమానాః॥ 163

అత్ర యే కృత్రిమ శత్రవో యాం బుద్ధి మనుసృత్య త్వద్వంచనాయోద్యుక్తాః, తయైవ తే వంచితా ఇతి ప్రత్యుతానర్థహేతుత్వమ్।

అర్థము :

రామేశ — రామేశప్రభూ। తే — నీ। అరాతయః — శత్రువులు। ఆత్మరక్షణకృతే — తమ రక్షణ కొరకు। పర పీడనాయ — శత్రువుల పీడించుటకొరకు। యాం — ఏ। బుద్ధిం — బుద్ధిని। అనుజగ్ముః — అనుసరించిరో। తయైవ — ఆ బుద్ధి చేతనే। భగ్నాః — కొట్ట పడిన వారై। పరిలుప్త వివేక భాగ్యాః — నశించిన వివేకము భాగ్యము కలవారలై। స్వైః — తమవారి చేత। అకరుణం — దయ లేనివిధముగా। పరి భర్త్స్యమానాః — బెదరించబడుచున్నవారై। సంచరంతి — తిరుగుచున్నారు।

వివరణము :

ఇచ్చట ఇతరుల పీడించుటకు రామాశ్రయించిన బుద్ధి తమనే పీడించినది అని పర పీడనము లేకపోగా తమ కనర్థము గలిగినట్లు వర్ణించుటచే నిది రెండవ రకపు విషమాలం

కారము. కృత్రిమ శత్రువు లనగా అపకార రూప కార్యము వలన శత్రువులైన వారు. వారు ఈ ప్రభువును ఏ బుద్ధినాశ్రయించి వంచింప యత్నించిరో, అదే బుద్ధితో వారు వంచించబడినారని బుద్ధిరూప కారణము పరపీడన రూప కార్యమును గాక తమ కనిష్టమును కలిగించినట్లు చెప్పినందున ఇది రెండవ విషమము.

విరూప ఘటనా యథా—

విరూప ఘటనయను మూడవదాని ఉదాహరణము

రామేశ వైరిణస్తే క్వ క్వవా మారవకాననమ్।
యేషా మత్రత్యకందేషు స్వీయా మతి రజాయత॥ 164

అత్ర మహాభాగానామపి త్వద్వైరిణాం మరుకాననసంచార తత్రత్యకందమూలాద్యాస్వాదనకథనేన చేయం విరూప ఘటనా।

అర్థము:

రామేశ – రామేశ ప్రభూ । తే – నీయొక్క । వైరిణః – శత్రువులు । క్వ – ఎక్కడ । మారవకాననం – మరుస్థలపు అడవి । క్వవా – ఎక్కడ । యేషాం – ఏశత్రువులకు । అత్రత్య కందేషు – ఇచ్చటగల గడ్డలయందు । స్వీయా – తమవి అనెడు । మతిః – బుద్ధి । అజాయత – కలిగెను ।

వివరణము:

రామేశ ప్రభువు శత్రువులుకూడ మహారాజులు. వారలకు మరువనములలో తిరుగుట కాని అచ్చటి కందమూలాదుల తినుట కాని తగినది కాదు. కనుక నిది పొందిక లేని రెంటి యొక్క సమావేశము. అందుచే మూడవ రకపు విషమాలంకారమున కుదాహరణము.

అథ సమాలంకారః

విషమప్రస్తావా త్సమాలంకారో నిరూప్యతే ।
స సమాలంకారః స్యాత్ యత్రాన్యోన్యాను రూపయోర్ఘటనా । 165

యథా—

పార్థితా నైక భూపాలైః కవితా భవతాం బుధాః ।
సదానురాగా ద్రామేశం సంగతా స్వానురూపతః॥ 166

అర్థము :

విద్వాః — ఓ విద్వాంసులారా । భవతాం — మీయొక్క । కవితా — కవిత్వము । నైక భూపాలైః — అనేక రాజులచేత । ప్రార్థితా — ప్రార్థించబడినదియై । స్వానురూపతః — తన కనురూపమగుట వలన । సదా — ఎల్లప్పుడు । అనురాగాత్ — అనురాగము వలన । రామేశం - రామేశ ప్రభువును । వంగతా — ఆశ్రయించినది ।

వివరణము :

విషమాలంకార ప్రస్తావ మేర్పడి స్మరణము వచ్చినందున సమాలంకారము నిరూపించ బడుచున్నది. పరస్పరము అనురూప్యము (పొందిక) గల రెంటియొక్క కూర్పు సమాలంకారమనబడును. పైశ్లోకమున విద్వత్కవితకు — రామేశ ప్రభువుకు ఏర్పరచబడిన కూర్పు అనురూప ఘటన కనుక సమాలంకారమగుచున్నది.

అథ విచిత్రాలంకారః

తదిహ విచిత్రం ప్రాహుః (కారణ)విపరీతఫలోదయే ప్రయత్నశ్చేత్। 167

యథా-

ఖల మఖిలం భస్మీకృత్య, త్రైలోక్యం (చ)క్షణేన శిశిరయితుమ్।
ప్రజ్వలతి మహితకీర్తేః రామేశస్యాగ్రిమం తేజః॥ 168

అర్థము :

మహిత కీర్తేః — ప్రశస్తమైన కీర్తిగల । రామేశస్య — రామేశప్రభువు యొక్క । అగ్రిమం — శ్రేష్ఠమైన । తేజః — తేజస్సు — పరాక్రమము । క్షణేన — క్షణ కాలములో । అఖిలం — సమస్తమైన । ఖలం — దుర్జన వ్యక్తిని । భస్మీకృత్య — భస్మమొనరించి । త్రైలోక్యం — మూడు లోకములను । శిశిరయితుం — చల్లపరుచుటకు । ప్రజ్వలతి — మండుచున్నది — ప్రకాశించుచున్నది ।

వివరణము :

కారణ విపరీతమగు కార్యము వర్ణించబడిన చిత్రాలంకార మనబడును. ఇచట లక్షణ శ్లోకములో 'కారణ' అను పదము ఛందోభంగము నాపాదించుచున్నందున నివర్తనీయము. లక్ష్య శ్లోకములో 'ఖిల' మనుట కంటె 'ఖల' మనుట ఉపపన్నము కనుక అట్లే అర్థము వ్రాయబడినది. తేజస్సు యొక్క జ్వలనమునకు విపరీతమగు కార్యము చల్లపరుచుట అనునది వర్ణించబడుటచే నిట చిత్రాలంకారమగును.

అథాధికాలంకారః

ఆధారానానుగుణ్యం చే దాధేయస్యాధికం భవేత్ ॥ 169

యథా—

దుర్భరా భువనేషు త్వత్కీర్తి రుద్గత్య సంగతా।
త్రివిక్రమశిరోదేశే రామేశా (భా) భవ దాలికమ్॥ 170

అర్థము :

రామేశ — రామేశ ప్రభూ । త్వత్కీర్తిః — నీకీర్తి । భువనేషు — లోకములలో । దుర్భరా — భరించరానిదియై । ఉద్గత్య — పైకి వెళ్ళి । త్రివిక్రమశిరోదేశే - త్రివిక్రమస్వామి శిరః ప్రాంతమున । సంగతా — చేరినదియై । అలికం — నుదుటికి ఆభరణముగా । అభవత్ — అయెను ।

వివరణము :

ఆధేయమాధారమునకు అనుగుణముగా నుండక ఇముడనట్లుగాని, ఎక్కువైనట్లు గాని, వర్ణించినచో అధికాలంకారమగుదు. పై శ్లోకమునందు రామేశుని కీర్తి మూడు లోకములలోను ఇముడక పైకెగిరి, అన్ని లోకముల పైవరకు వ్యాపించి యున్న త్రివిక్రమస్వామి తలవరకు వెళ్ళి, ఆస్వామి లలాట ప్రదేశమున నాభరణమైనది — అని వర్ణించుటచే నిచ్చట అధికాలంకారమైనది.

అథాన్యోన్యాలంకారః

తతాన్యోన్యం మిథో యత్ర కార్యకారణతా భవేత్। 171
యత్ర ద్వయోః పరస్పరం క్రియాకర్తృత్వభావః తత్రాన్యోన్యాలంకారః॥
యథా—

వివరణము:

పరస్పరము ఉపకారము వర్ణించబడిన అన్యోన్యాలంకార మగును. ఇచ్చట మూలములోని కార్య కారణ భావము కాని — క్రియా కర్తృత్వ భావము కాని ఉపకారోపకారక భావమునే లక్షించుచున్నదని గమనించవలెను.

ఉదాహరణము

యథైవ చంద్రేణ విభాతి చాంద్రీ స చంద్రమా శ్చంద్రికయా యథైవ ।
తథైవ కీర్త్యా భవతా విభాసతే భవా న్హి కీర్త్యా శ్రితపారిజాత॥ 172

అర్థము :

చంద్రేణ — చంద్రునిచేత । యథైవ — ఏవిధముగా । చాంద్రీ — వెన్నెల । విభాతి — భాసించుచున్నదో । సః — ఆ । చంద్రమాః — చంద్రుడు । యథైవ — ఏ విధముగా । చంద్రికయా — వెన్నెలచేత । విభాతి — భాసించుచున్నదో । తథైవ — అట్లే । భవతా — నీచేత । కీర్తిః — కీర్తి । విభాసతే — భాసించుచున్నది. । కీర్త్యా — కీర్తిచేత । శ్రితపారిజాత — ఆశ్రితులకు కల్పవృక్షమవగు సోమహారాజా । భవాన్—నీవు । విభాతిహి — భాసించుచున్నావు కదా ।

వివరణము :

ఇచ్చట వెన్నెల భాసించుటకు చంద్రుడు, చంద్రుడు భాసించుటకు వెన్నెల ఉపకరించుచున్నట్లు, కీర్తిభాసించుటకు ప్రభువు. ప్రభువు భాసించుటకు కీర్తిగూడ ఉపకరించుచున్నట్లు వర్ణించబడినవి. ఇచ్చట చంద్రికా చంద్రులు, కీర్తి ప్రభువులుకూడ పరస్పరముపకరించు కొనుటను బట్టి అన్యోన్యాలంకారమగును.

ప్రస్తుతః 'యథా' 'తథా' శబ్ద ప్రతిపాద్యమగు ఉపమాలంకారమె ఇందులో ప్రధానముగా నున్నదని గమనించవలెను.

అథ విశేషాలంకారః

ఏకస్య యుగపద్వృత్తి ర్యత్రానేకేషు వర్ణ్యతే।
వినాధారం తథా ధేయం ఘటనా దుర్ఘటస్యచ॥ 173
విశేషాలంకృతే ర్భేదా స్తత్రి త్రిధా బుధా జగుః।

విశేషాలంకారము మూడు విధములు. 1. ఒకే వస్తువు ఒకేసారి అనేకాధారములలో నున్నట్లు వర్ణించబడిన నొక విశేషాలంకారము 2. ఆధారము లేక ఆధేయమున్నట్లు వర్ణించబడిన రెండవ రకము విశేషము 3 దుర్ఘట వస్తును సమకూరినట్లు వర్ణించబడిన మూడవ రకము.

యథా—

సమాగతం వీక్ష్య తపోద్భటం భయాత్
పలాయమానస్య విరోధినో దృశా।
రామేశ భూమ్యాం దివి దిక్షు సర్వతో

విలోక్యతే హంత భవాన్ పురస్థితః॥ 174
అత్రైకస్యాధేయస్యానేకాధారాన్వయోనిబద్ధః॥

అర్థము :

రామేశ — రామేశప్రభూ । సమాగతం — వచ్చినట్టి । తవ — నీయొక్క । ఉద్భటం— గొప్ప భటుని । వీక్ష్య — చూచి । పలాయమానస్య — పారిపోవు । విరోధినః — శత్రువు యొక్క । దృశా — దృష్టితో । భూమ్యాం — భూమియందు । దివి — ఆకాశమునందు । దిక్షు — దిక్కుల యందు । సర్వతః — అంతట । భవాన్ — నీవు । పురః స్థితః - ఎదురుగా ఉన్నవాడవుగా । విలోక్యతే — చూడబడుచున్నావు । హంత — ఆశ్చర్యము ।

వివరణము :

ఇచ్చట రామేశ ప్రభువు ఒక్కడే ఒకేసారి అంతట అనేకాధారముల యందున్నట్లు వర్ణించబడుటచే నిది మొదటిరకము విశేషాలంకారము.

## అథ వ్యాఘాతాలంకారః

విహితే కేనచిత్కర్త్రా కార్యే కేనాపి హేతునా ।
తేనైవాన్యోఽన్యథయతి తచ్చేద్వ్యాహత్యలంకృతిః॥ 175

వివరణము :

ఒకరొకసాధనము చేత నొక కార్యము చేయగా, ఆదే సాధనము చేత వేరొకరు ఆ కార్యమునకు విపరీతమగు కార్యము చేసినట్లు వర్ణించబడినచో నది వ్యాఘాతాలంకారము.

యథా —

రక్తయాఽవతి రామేశ దృశా కృష్ణ స్త్వదాశ్రితాన్।
తయైవ త్వద్ద్విష స్సర్వాన్ హర స్సంహరతి ప్రభుః॥ 176

అర్థము :

రామేశ — రామేశప్రభూ । కృష్ణః — కృష్ణుడు । త్వదాశ్రితాన్ — నిన్నాశ్రయించిన వారలను । రక్తయా — ఎఱ్ఱని — ప్రేమగల । దృశా — చూపుచేత । అవతి — కాపాడును । ప్రభుః — ప్రభువగు । హరః — శివుడు । తయైవ — ఆ ఎరుపెక్కిన చూపుతో । సర్వాన్ — సమస్తమైన । త్వద్ద్విషః — నీ శత్రువులను । సంహరతి — సంహరించుచున్నాడు ।

అత్ర రక్తావలోకనేనైవ హరిరవతి। తయైవ రుద్రః సంహరతీతి కార్యస్య విహతత్వాద్వ్యాఘాతః। శబ్దశ్లేషావలంబనేన చమత్కారస్సము న్మిషతీతి ధర్మసుధీవరాః। శబ్దశ్లేషాద్వ్యాహతిస్తు దేవతావర్ణనే శుభేతి చమత్కారచంద్రికాయామ్।

వివరణము :

కృష్ణుడు రక్త దృష్టితో కాపాడగా రుద్రుడు అదే దృష్టితో సంహరించుచున్నాడు. అనుట వలన నిది వ్యాఘాతాలంకారము. ఇక్కడ రక్తమనగా ఎరుపెక్కినదని యర్థము. ఎరుపు ప్రేమతో, కోపముతో కూడ కలుగవచ్చు. కనుక రక్తదృష్టి యనగా ప్రేమ దృష్టి-కోప దృష్టికూడ । ఇట్లు శ్లేషముతో చమత్కారము కలుగునని ధర్మసుధీవరు లనెదరు. శబ్ద శ్లేషమును బట్టి వ్యాఘాతము దేవతావర్ణనమున శుభముగా నుండునని "చమత్కార చంద్రికా" గ్రంథములో నున్నది.

అథ కారణ మాలాలంకారః।

పూర్వం పూర్వం యత్ర భజే దుత్తరోత్తరహేతుతామ్।
తత్ర కారణమాలాఖ్య మలంకారం ప్రచక్షతే॥ 177

వివరణము :

పూర్వ పూర్వ ముత్తరోత్తరమునకు కారణముగా వర్ణించబడినచో నది కారణ మాలాలంకారము । ఉదాహరణము....

బుధానాం వైశిష్ట్యం తవ మనసి హార్దస్య జనకమ్
సముద్భూద్ధం హార్దం నిరవధికవిశ్వాసజనకమ్।
తతోఽయం విశ్వాసస్త్వఖిలమిహ భాగ్యం జనయతి
ధ్రువం విశ్వేశ శ్రీమహితచరితారక్షితవిభో॥ 178

అర్థము :

శ్రీమహిత — సంపత్తితో ప్రశస్తమైన । చరిత — ప్రవర్తనచేత । ఆ రక్షిత — రక్షించబడిన । విభో — ప్రభువగు । విశ్వేశ — విశ్వేశప్రభూ । బుధానాం — విద్వాంసుల యొక్క । వైశిష్ట్యం — ప్రత్యేకత । తవ — నీయొక్క । మనసి — మనస్సునందు । హార్దస్య — స్నేహమునకు । జనకమ్ — జనకమైనది । సముద్భూద్ధం — కలిగిన । హార్దం — స్నేహము । నిరవధిక — అవధిలేని । విశ్వాస జనకం — విశ్వాసమును కలిగించినది ।

తతః — తరువాత । అయం — ఈ । విశ్వాసః — విశ్వాసము । ఇహ — ఇక్కడ । అఖిలం — సమస్తమైన । భాగ్యం — భాగ్యమును । జనయతి — కలిగించును ।

వి వ ర ణ ము :

ఇచ్చట వైశిష్ట్య । స్నేహ - విశ్వాస - భాగ్యములలో పూర్వపూర్వము ఉత్తరోత్తరమునకు కారణముగా వర్ణించబడినందున కారణమాలాలంకారమగుచున్నది.

అథ ఏకావళ్యలంకారః

పూర్వం పూర్వం ప్రతి చేద్విశేషణం తూత్తరోత్తరం భవతి।
సోఽయమలంకారజ్ఞైః కథితస్త్వేకావళీత్యలంకారః॥ 179

వి వ ర ణ ము :

పూర్వ పూర్వమునకు ఉత్తరోత్తరము విశేషణముగా వర్ణించబడినచో నది ఏకావళి యనునలంకారమని చెప్పబడినది. ఉదాహరణము

రామేశ భవత స్సంపత్సర్వదా వినయాన్వితా ।
వినయశ్చ ప్రతాపేన ప్రతాపో నీతివిస్తృతః॥ 180

అ ర్థ ము :

రామేశ — రామేశప్రభూ । భవతః — నీయొక్క । సంపత్ — సంపత్తి । సర్వదా — ఎల్లపుడు । వినయాన్వితా — వినయముతో కూడుకొనినది । వినయశ్చ — వినయమేమో । ప్రతాపేన — పరాక్రమముతో । అన్వితః — కూడుకొనినది । ప్రతాపః — పరాక్రమము । నీతి విస్తృతః - నీతితో విస్తీర్ణమైనది ।

వి వ ర ణ ము :

ఇక్కడ సంపత్తికి వినయము, వినయమునకు పరాక్రమము, పరాక్రమమునకు నీతి — విశేషణముగా వర్ణించబడినది. కనుక నిది ఏకావళీ అలంకారము. దీనికి మరియొక ఉదాహరణము.

రామేశ తవ బాహూస్తు ససార స్స సునీతిమాన్।
నీతి ర్వృత్తవతీ నిత్యం విత్తం సత్పాత్రసత్కృతమ్॥ 181

అ ర్థ ము :

రామేశ — రామేశ ప్రభూ । తవ — నీయొక్క । బాహుస్తు — హ స్త మేమో । ససారః — బలము గలది । సః — ఆ బలము । సునీతిమాన్ — మంచి నీతి గలది । నీతిః — నీతి । వి త్తవతీ — ధనము గలది । నిత్యం — ఎల్లపుడు । విత్తం — ధనము । సత్పాత్ర సత్కృతమ్ — మంచివారి యధీనము చేయబడినది ।

వి వ ర ణ ము :

ఇచ్చట బాహు — బలనీతి - విత్తాదులలో పూర్వ పూర్వమున కు త్తరో త్తరము విశేషణముగా వర్ణించ బడినందున నిదియు ఏకావళీ అలంకారము.

అథమాలాదీపకాలంకారః

పూర్వ పూర్వ కృతోత్కర్షం భజేచ్చే దు త్తరో త్తరమ్।
తత్రి మాలాదీపకాఖ్యం అలంకారం బుధా జగుః॥ 182

వి వ ర ణ ము :

ఉ త్తరో త్తరమునకు పూర్వ పూర్వము వలన ఉత్కర్షము వర్ణించ బడినచో మాలాదీపక మనబడును. యథా:— ఉదాహరణము—

యౌవన మధునా తనుతే కాంతాయా స్తే పరం హి లావణ్యమ్।
తదపి మనోభవలీలాం ధైర్యం సా తేऽద్య మార్ష్టి రామేశ!॥ 183

అ ర్థ ము :

రామేశ — ఓరామేశ ప్రభూ । తే - నీయొక్క । కాంతాయాః — ప్రియురాలి యొక్క । యౌవనం — యౌవనము । అధునా — ఇపుడు । పరం — ఉత్కృష్టమగు । లావణ్యం — సౌందర్యవిశేషమును । తనుతేహి — కలిగించుచున్నది । తదపి — ఆ సౌందర్యముకూడ । మనోభవలీలాం — మన్మథ విలాసమును । తనుతే — కలిగించుచున్నది. సా — ఆ మన్మథలీల । అద్య - ఇపుడు । తే — నీ । ధైర్యం — ధైర్యమును । మార్ష్టి — తుడిచి వేయుచున్నది.

వి వ ర ణ ము :

ఇక్కడ యౌవనము వలన లావణ్యమునకు, లావణ్యము వలన మన్మథవిలాసమునకు నుత్కర్షము ఏర్పడినట్లు చెప్పుటవలన నిది మాలాదీప కాలంకార మగుచున్నది.

అథ సారాలంకారః

పూర్వస్మాదపి పూర్వస్మా త్సారం చేదు త్తరో త్తరమ్।
యత్ర వర్ణ్యేత తత్రాహుః బుధా స్సారమలంకృతిమ్॥ 184

వివరణము :

పూర్వ పూర్వము కంటె ఉత్తరోత్తరమున కుత్కర్షము వర్ణింపబడిన అది సారాలంకారమగును.

యథా

ఉదాహరణము—

అజాండసారః కథితా త్రిలోకీ
తతోఽపి సారః క్షితిలోక ఏషః।
తత్రాపి గోదాతటభూమిభాగః
తత్రాపి రామేశనివాసభూమిః॥ 185

అర్థము :

త్రిలోకీ — లోకత్రయము । అజాండసారః — బ్రహ్మాండ సారముగా । కథితా — చెప్పబడినది । తతోఽపి — దాని కంటె । ఏషః — ఈ । క్షితిలోకః - భూలోకము । సారః — ఉత్కృష్టమైనది । తత్రాపి — ఆభూలోకమునందును । గోదాతట భూమిభాగః — గోదావరీ తీర ప్రాంతము । సారః — ఉత్కృష్టము । తత్రాపి — అందులోను । రామేశ నివాసభూమిః — రామేశ ప్రభువు నివసించు ప్రాంతము । సారః — ఉత్కృష్టము ।

వివరణము :

ఇచ్చట బ్రహ్మాండ - భూలోకాదులలో పూర్వ పూర్వము కంటె ఉత్తరోత్తరము త్కృష్టముగా చెప్పబడినందున సారాలంకారము.

మరియొక ఉదాహరణము

సంసారసార స్సద్విద్యా తత్సారః కావ్యపద్ధతిః।
తత్రాపి సారం రామేశ సచ్చారిత్రమితి ధ్రువమ్॥ 186

వి వ ర ణ ము :

ఈ శ్లోకమున సంసారమున సద్విద్య సార భూతమని, సద్విద్యలోను కావ్యమార్గము మరీసారభూతమని, అందులోను రామేశ చరితము మరీ సారభూతమని వర్ణించబడినది. ఇట్లిందులో తత్తత్సారము చెప్పబడినదే కాని, ఒకదాని కంటె నొకటి యుత్కృష్టమని చెప్పబడలేదు. పై శ్లోకములో కూడ బ్రహ్మాండములో భూలోకము సారమని, అందులో గోదావరీతీర ప్రాంతము సారమని చెప్పబడినదే కాని, ఒకదాని కంటె మరియొకటి ఉత్కృష్టమని చెప్పబడలేదు. కనుక సారాలంకార లక్షణము సమన్వితము కాదు. ఐనను దాని సారము దానికంటె నుత్కృష్టమగును కనుక నిచ్చట కవికి పూర్వాపూర్వాపేక్షికమగు నుత్తరోత్కర్షము చెప్పుట యందే తాత్పర్యమని లక్షణ సమన్వయము చేసికొనవలయును.

అథ కావ్యలింగాలంకారః

అథ తర్క న్యాయమూలాః కావ్యలింగాదయో౽లంకారా నిరూప్యంతే।
హేతుర్భవతి పదార్థః తం ప్రతి వాక్యార్థఏవ తం ప్రతి వా।
తత్రి ద్వివిధం ప్రాహుః తద్భేదజ్ఞాస్తు కావ్యలింగ మితి॥ 187

వి వ ర ణ ము :

తర్క ప్రతిపాద్య కార్యకారణ భావమూలకాలంకారములు కావ్యలింగాదులు నిరూపించబడుచున్నవి. పదార్థము పదార్థమును గురించి గాని, వాక్యార్థమును గురించిగాని, కారణమైనట్లు వర్ణించ బడెనేని యది కావ్యలింగము. అదియు పదార్థ హేతుకమని — వాక్యార్థ హేతుకమని రెండు విధములు. మూలములోని అధోరేఖాంకిత భాగము ఛందస్సుకై పూరించబడినది.

యథా

ఉదాహరణము

అర్థిబాధిరకశార్థదాయినః కిం వదామి తవ దానగౌరవమ్॥ 188
అర్థినో౽పి కురుతే యదర్థినః భూయఏవ సుజనైకసంస్తుత॥
అత్ర దానగౌరవరూప వాక్యార్థస్య ఉత్తరవాక్యార్థం ప్రతి హేతుత్వాత్.
కావ్యలింగత్వమ్।

అ ర్థ ము :

సుజనైక సంస్తుత — సుజనస్తుతి పాత్రుడవగు మహారాజా । అర్థితాధిక — కోరికను మించి । శతార్థదాయినః - అనేక ద్రవ్యమును ఇచ్చునట్టి । తవ — నీయొక్క । దానగౌరవం — దానము యొక్క గొప్పదనమునుగూర్చి । కిం వదామి — ఏమి చెప్పుదును । యత్ — ఏదానము । అర్థినోఽపి — ధనవంతులనుకూడ । భూయ ఏవ - మరల । అర్థినః— యాచకులనుగా । కురుతే — చేయుచున్నది ।

వి వ ర ణ ము :

ఇచ్చట ''ధనవంతులుకూడ యాచకులగుట'' యను వాక్యార్థమునకు అడిగిన దానికంటె అధికముగా నిచ్చు రామేశుని దాన గౌరవ రూపవాక్యార్థము కారణముగా వర్ణించబడినందున నిది కావ్యలింగాలంకారము. మూలములోని అధోరేఖాంకితభాగము అర్థస్ఫురణమునకై పూరించబడినది.

మరియొక ఉదాహరణము

రామేశభూవాసవసంప్రవర్తితా స్సదక్షిణా అన్నమయా మహామఖాః।
మహీతలం సంగమయంతి నిర్జరాన్ద్విజాతి ముఖ్యానపి నాకలోకమ్॥ 189

''తస్మాదితః ప్రదానం దేవా ఉపజీవంతి, తస్మాదముతః ప్రదానం మనుష్యా ఉపజీవంతి'' ఇతి శ్రుతేః ఉభయేషాం సంగమః మఖాదేవ భవతీతి భావః।

అ ర్థ ము :

రామేశభూవాసవ సంప్రవర్తితాః — రామేశ భూమీంద్రుని చేత జరిపించబడిన । సదక్షిణాః — దక్షిణలుగల । అన్నమయాః — అన్నప్రచురములగు । మహామఖాః — గొప్ప యాగములు । నిర్జరాన్ - దేవతలను । మహీతలం — భూమిని । ద్విజాతిముఖ్యానపి — విప్రశ్రేష్ఠులనుకూడ । నాకలోకం - స్వర్గలోకమును । సంగమయంతి - పొందింపచేయుచున్నవి.

వి వ ర ణ ము :

ఇక్కడ దేవ బ్రాహ్మణసమాగమ రూప వాక్యార్థమునకు, పూర్వార్థప్రతిపాదిత మహామఖరూపవాక్యార్థము హేతువుగా వర్ణించుటచేత నిచటగూడ వాక్యార్థహేతుక కావ్యలింగమే యలంకారము. యజ్ఞము ఉభయులకు సమాగమము కలిగించునని ''తస్మాదితః'' ఇత్యాది శ్రుతి చెప్పుచున్నది.

అథ వక్రోక్త్యలంకారః

అన్యథోదిత వాక్యస్య కాక్వాక్షేపేణ వాన్యథా।
యోజనం క్రియతే యత్ర వక్రోక్తిః స్యాదలంకృతిః॥ 190

**వివరణము :**

ఒకానొక అర్థము నందభిప్రాయముతో ప్రయోగించిన వాక్యమునకు, కాకుస్వరముతో గాని, ఆక్షేపముతోగాని, మరియొక అర్థముతో నన్వయింపచేసి కాని నట్లు వర్ణించబడిన, నచ్చట వక్రోక్తి అలంకారము. కాకువనగా ప్రశ్నము. ఆక్షేపమనగా నిందించుట.

యథా—

ఉదాహరణము

ముగ్ధే వ్యాధః క్వవాస్తే (కచస్తే) సుదతి వనచరో వేత్తి తం గోపబాలః
క్వాసౌ భిక్షు స్సుశీలే బలిసదనగతో వామనో వేత్తి బాలేః।
క్వాయం దైత్యాంధకారిః (భస్మాంధకారీ) నిశిచరవనితామారకో వేత్తి ధీరః
శ్రీ గౌర్యో రేష లీలాసువచననిచయః పాతు రామేశ నిత్యమ్॥ 191

**అర్థము :**

ముగ్ధే — ముద్దరాలా । వ్యాధః — కిరాతుడు । క్వవా — ఎక్కడ । ఆస్తే — ఉన్నాడు । సుదతి — చక్కని దంతములు కలదానా । వనచరః — అడవులలో తిరుగు । గోపబాలః — పసులకాయు పసివాడు । తం — ఆ కిరాతుని । వేత్తి — ఎరుగును । సుశీలే — మంచి స్వభావము కలదానా । భిక్షః — బిచ్చమెత్తు । అసౌ — ఆయన । క్వ — ఎక్కడ । బాలే — ఓబాలిక । బలిసదనగతః — బలి ఇల్లుసొచ్చిన । వామనః — వామనుడు । వేత్తి — ఎరుగును । అయం — ఈ ఇంటనుండు । దైత్యాంధకారిః — రాక్షసుడగు అంధకుని శత్రువు । క్వ — ఎక్కడ । ధీరః — శూరుడగు । నిశిచర వనితా మారకః — రాక్షసస్త్రీయగు పూతనను సంహరించినవాడు । వేత్తి — ఎరుగును । రామేశ — ఓ రామేశప్రభూ । శ్రీగౌర్యోః— లక్ష్మి పార్వతుల । ఏషః — ఇట్టి । లీలా సువచన నిచయః — విలాసము కొరకైన చక్కని మాటల సముదాయము । నిత్యం — ఎల్లపుడు । (త్వాం — నిన్ను) । పాతు — కాపాడును ।

**వివరణము :**

ఇందు పార్వతీపతియగు శివుని కిరాతుడని, లక్ష్మిదేవి ఎత్తి పొడవగా పార్వతీదేవి లక్ష్మిపతియగు విష్ణువును, వనచరుడని, పసులకాపరియని దెప్పిపొడిచినట్లు వర్ణించబడినది.

అన్లే శివుకు భిక్షువైన, విష్ణువు వామనావతరములో భిక్షువని, శివుడు రాక్షసాంతకుడైన విష్ణువు రాక్షసస్త్రీ మారకుడని యూవర్ణించబడినది. ఐనను ఇక్కడ వక్రోక్తి లక్షణము సమన్వితమగుటలేదు. ఒక అభిప్రాయముతో చెప్పిన మాటకు మరియొక్క అభిప్రాయము కల్పించిమాట్లాడిన వక్రోక్తి. ఇచ్చట వ్యాధ భిక్ష్వాది పదముల కభిప్రాయాంతరకల్పన ఏమియులేదు. "భిక్షుః కుత్ర బలేర్మఖే" "భిక్షువెక్కడ" "బలియజ్ఞమున" అనుచోట శివుడను అర్థములో ప్రయోగించిన భిక్షుపదానికి వామనుడను అర్థాంతరము కల్పించిమాటాడుట జరిగినది. ఇచ్చట అట్లు అభిప్రాయాంతరయోజనలేదు. కనుక నిది వక్రోక్తికి ఉదాహరణము కాదు.

మరియొక ఉదాహరణము

కిం తే ప్రీతిం స కర్తుం కపటవటు రభూ ద్వామన బ్రహ్మచారీ
కస్మాజ్జాతః ప్రియస్తే, కిమితి తవ పతిః కృత్తివాసా జటీ వా।
బిభ్రాణః కేన రేమే వనభువి దయితో వల్కలం వా జటా వా
లక్ష్మ్యైశైలేశబాలాపరిహసితవచః పాతు రామేశ్వర త్వామ్॥ 192

వివరణము:

ఈ శ్లోకములో కూడ పై శ్లోకములో వలెనే లక్ష్మీపార్వతుల పరిహాసము వర్ణించబడినది. నీ ప్రియుడు కపటవటువని పార్వతితో లక్ష్మీదేవి అనగా నీ ప్రియుడుకూడ వామనబ్రహ్మచారి కదా! అని పార్వతీదేవి లక్ష్మితో అనుచున్నది. నీ ప్రియుడు తోలు బట్టలు ధరించినాడనగా, నీ ప్రియుడును రామావతారములో నారచీరలు, జటలు ధరించినాడని గుర్తుచేయుట జరిగినది. ఐన ఇందులోను పై శ్లోకము నందువలెనే వక్రోక్తి లక్షణ సమన్వయము కుదరదు.

అథ సామాన్యాలంకారః

సామాన్యం గుణసామ్యేన యత్ర వస్త్వంతరైకతా। 193

యత్ర ఏకస్య వస్తునో గుణసామ్యేన వస్త్వంతరతాదాత్మ్యప్రతీతిః, తత్ర సామాన్యాలంకారః। యథా—

గుణము సమాన మైనందున ఎచ్చట రెండు వస్తువుల కభేదము స్ఫురించునో, అచట సామాన్యాలంకారము.

ఉదాహరణము—

సంక్రాంతే తవ యశసి ప్రభో త్రిలోక్యాం
సంశాంతః కలి రభవ న్మహే ంద్రశంభ్వోః।
సాస్నాతో వృషభతురంగగోచరోఽయమ్
రామేశ ద్విజవరబృందసార్వభౌమ॥ 194

ఇహ తవ యశోధవలిమ్నా, వృషభోచ్చైశ్శ్రవసో ర్భేదః, తిరో
హితోఽపి, సాస్నయా పునః స్ఫుటీకృతః (ఇతి వర్ణ్యతే)।

అర్థము :

ద్విజవరబృంద సార్వభౌమ — ద్విజశ్రేష్ఠసమూహ చక్రవర్తివగు। ప్రభో, రామేశ — రామేశప్రభూ। తవ — నీ యొక్క। యశసి — కీర్తి। త్రిలోక్యాం — మూడు లోకముల యందు। సంక్రాంతేసతి — వ్యాపించగా। మహేంద్రశంభ్వోః — ఇంద్ర శంకరులకు। వృషతురంగ గోచరః — ఎద్దు గుఱ్ఱమునకు సంబంధించిన। అయం — ఈ। కలిః — కలహము। సాస్నాతః — గంగడోలు వలన। సంశాంతః — మునిగిపనది।

వివరణము :

ఇచ్చట రాజుగారి కీర్తియొక్క తెలుపు దనమును గుణము రెండింటికిని సమానముగా నున్నందున నందికేశ్వరునికిని ఉచ్చైశ్రవమునకును భేదము గ్రహించరానిదిగా నుండెనని, చివరకు గంగడోలునుబట్టి భేదము గ్రహించ బడెనని వర్ణించుట చేత నిట సామాన్యాలంకారము.

అథ మీలనాలంకారః

మీలనం వస్తునైకేన వస్త్వంతరనిగూహనమ్। 195
తద్ద్వివిధం; సహజేన ఆగంతుకతిరోధానం, ఆగంతుకేన సహజరోధానం చ।
తత్ర ప్రథమో యథా —

సామ్యమును బట్టి ఒక వస్తువు చేత మరియొక వస్తువు అభిభూతమైనట్లు వర్ణించ బడెనేని, యది మీలనాలంకారము. అదియు రెండు విధములు. సహజము చేత ఆగంతుక తిరస్కారరూపమొకటి, ఆగంతుకముచేత సహజముయొక్క తిరస్కారము రెండవది. మొదటి దానికి ఉదాహరణము—

నహూగతే తల్పమనల్పవిభ్రమైః
(కస్యాం) నభ్యాస్తు రామేశ మృగీదృశస్తవ ।

ముఖాంబుజశ్రీః స్మితకాంతకాంతి
స్తిరశ్చకారానువిలేపశోభామ్॥ 196

అత్ర సహజాభ్యాం ముఖస్మితకాంతిభ్యాం అగంతుకగంధానులేపశోభా తిరోధానమ్।

అర్థము :

రామేశ – రామేశ ప్రభూ । (త్వయి – నీవు) । తల్పం – ప్రక్కను । సమాగతేసతి- చేరినవాడవగుచుండగా । అనల్పవిభ్రమైః – గొప్ప విలాసములచేత । మృగదృశః – లేడి కన్నులు గల । తవ – నీ యొక్క । సఖ్యాః – సఖురాలియొక్క । ముఖాంబుజశ్రీః – కమలము వంటి మోముయొక్క కాంతి । స్మితకాంత కాంతిః –చిర్నగవుయొక్క అందమైన శోభయు । అనువిలేప శోభాం – అనులేప ద్రవ్యముల వలన గలిగిన కాంతిని । తిరశ్చకార– తిరస్కరించెను ।

వివరణము :

ఇచట సహజమగు ముఖస్మిత కాంతిచేత అనులేప ద్రవ్యములవలన ఏర్పడిన శోభ తిరస్కరించబడినట్లు వర్ణించుటచేత నిది మొదటి మీలనాలంకారమునకుదాహరణ మగుచున్నది,

రెండవ దాని యుదాహరణము

స్ఫురద్భోగ త్యాగ ప్రథిత గుణ రామేశ విబుధ
ప్రభో యుష్మత్కోపాదుదిత ముని రూపాస్తు విమతాః॥
లసద్ జ్ఞానా నానావిధ రచిత వేషాః కువసనాః
మహారణ్యే పుణ్యే మునిజనశరణ్యే సమరసాః॥ 197

అత్రాగంతుకేన మునివేషేణ సహజవేషతిరోధానమ్।

అర్థము :

స్ఫురత్ – ప్రకాశించు । భోగత్యాగ – భోగముగా త్యాగముగా । ప్రథిత – ప్రసిద్ధమైన । గుణ – గుణములుగల । విబుధ – విజ్ఞుడవగు । ప్రభో – ప్రభువగు । రామేశ – రామేశస్వామి । యుష్మత్కోపాత్ – మీకోపము వలన । ఉదిత మునిరూపాః – ఏర్పడిన మునుల రూపముగల । విమతాః – శత్రువులు । లసద్‌జ్ఞానాః – ప్రకాశించు జ్ఞానముగలవారలై । నానావిధ– అనేక విధములుగా । రచిత – రచింపబడిన । వేషాః – వేషములు గలవారలై । కువసనాః – చెడువస్త్రములు గలవారలై । పుణ్యే – పవిత్రమగు ।

మునిజనశరణ్యే — మునులకు రక్షకమగు । మహారణ్యే — పెద్ద అడవియందు । సమ రసాః- శంపూర్ణరుచిగల వారలైరి ।

వి వ ర ణ ము .

ఇచ్చట మహారాజు శత్రువులు వేసుకొనిన వేషముచేత, వారల సహజ వేషము తిరస్కరించబడినట్లు వర్ణించబడినందున. ఇది రెండవ రకమునకు జెందిన మీలనాలంకారమున కుదాహరణము. సామాన్యా లంకారమునందు రెండు వస్తువులు విడిగా కన్పించును. కాని ఈ యలంకారమునందు అట్లు రెండు వస్తువులు కన్పించవు. ఇదియే ఈ రెండలంకారములకు గల భేదము.

అథ తద్గుణాలంకారః

తద్గుణః స్వగుణత్యాగాదన్యోత్కృష్టగుణాహృతిః॥ 198

యత్ర గుణవైసాదృశ్యే సత్యేవ దుర్బలనిజగుణహానేన సన్నిధిమహిమ్నా ప్రబలపరగుణ స్వీకారః తత్ర తద్గుణాలంకారః। యథా-

వి వ ర ణ ము :

అల్పమగు తన గుణమును విడిచి సమీపములోనున్న ఉత్కృష్టమగు మరియొక దాని గుణమును స్వీకరించినట్లు వర్ణించబడినచో నచట తద్గుణాలంకారము । ఉదాహరణము—

త్వయి చిరయతి కుత్రచిత్
తవ వనితా మదనాహృతాంగకాంతిః।
కలయతి కచకాంతకేతకీనాం
రుచ మవనీసురరాజ రాజవక్త్రి॥ 199

అ ర్థ ము :

రాజవక్త్రి — చంద్రుని వంటి మోము గల । అవనీసురరాజ — భూసుర శ్రేష్ఠుడా । త్వయి — నీవు । కుత్ర చిత్ — ఒకచోట । కదాచిత్ — ఒకప్పుడు । చిరయతి — ఆలస్యము చేయగా । తవ — నీ యొక్క । వనితా — ప్రియురాలు । మదనా హృతాంగ కాంతిః — — కామునిచే హరించబడిన దేహకాంతి గలదియై । కచకాంత కేతకీనాం — కురులలోని అందమైన మొగిలిరేకుల । రుచం — కాంతిని । కలయతి — సంతరించుకొనుచున్నది ।

వి వ ర ణ ము :

ఇచ్చట స్త్రీ శరీరము సహజమగు తన కాంతిని విడిచి సమీపస్థమగు మొగిలిరేకు కాంతిని స్వీకరించినట్లు వర్ణించుటచేత నిది తద్గుణాలంకారమున కుదాహరణ మనవలెను

వస్తుతః ప్రియ వియోగమువలన ప్రియురాలి శరీరము మొగిలిరేకు వంటి తెలుపును సంత రించుకొనినట్లు వర్ణన వలన తెలియుచున్నది. కనుక ఇది తద్గుణమున కుదాహరణముగా సరి పోవుట లేదు.

మరియొక ఉదాహరణము

సప్తా కూపార తీర స్ఫురదురు విపిన ప్రాంత విశ్రాంత సిద్ధ
ద్వంద్వై రశ్రాంత గీతా భవదురువిమల స్ఫూర్తి కీర్తి ప్రసారాః।
పక్షే శుక్లేతరేఽపి ద్విగుణితరుచయః చక్రవాళాచలాంతాన్
రామేశ క్షోణిదేవ స్ఫటికమణిమయాన్ కుర్వతే నిస్తమస్కాన్॥ 200

అత్ర త్వదీయ కీర్తి ధవలిమ స్వీకారేణ, నిజనీలిమగుణత్యాగః।

అర్థము :

రామేశక్షోణి దేవ – రామేశ భూసురా । సప్త – ఏడు । అకూపార – సముద్రముల । తీర – గట్టులపై । స్ఫురత్ – ప్రకాశించు । ఉరు – గొప్పదైన । విపిన ప్రాంత – అడవి ప్రదేశములందు । విశ్రాంత – విశ్రమించిన । సిద్ధ – సిద్ధుల । ద్వంద్వైః – జంటలచేత । అశ్రాంత – ఎల్లపుడు । గీతాః – గానముచేయ బడిన । భవత్ – నీయొక్క । ఉరు – గొప్పని । విమల – స్వచ్ఛములగు । స్ఫూర్తి – మెరపులు గల । కీర్తి – కీర్తియొక్క । ప్రసారాః – విలాసములు । శుక్లేతరే – శుక్లముగాని । పక్షేఽపి – పక్షమునందును । ద్విగుణితరుచయః – రెట్టింపైన కాంతి గలవియై । చక్రవాళాచలాంతాన్ – చక్రవాళ పర్వత ప్రాంతములను । స్ఫటిక మణిమయాన్ – స్ఫటిక మణులు ఎక్కువ గలవానినిగా । నిస్తమస్కాన్ – చీకటి లేని వానినిగా । కుర్వతే – చేయుచున్నవి ।

వివరణము :

ఇచ్చట చక్రవాళ పర్వత ప్రాంతములు తమ నీలిమ గుణమును వదిలి కీర్తియొక్క తెలుపును గ్రహించినవి యని వర్ణించుటచేత నిట తద్గుణాలంకారము.

అథ అతద్గుణాలంకారః

సతిహేతౌ పరగుణాస్వీకారే స్యా దతద్గుణః॥ 201

వివరణము :

నిమిత్తమున్నను ఇతర గుణమును స్వీకరించక పోవుట వర్ణింపబడెనేని అది అతద్గుణా లంకారము.

ఉదాహరణమ :—

తాపింఛ దలకాంతాభిః కీర్తిభి స్తద్విరోధినామ్ ।
రామేశ తవ కీర్తిస్తు సమాకాన్తాపి శోభతే॥ 202

అర్థము :

రామేశ — రామేశ ప్రభూ । త్వద్విరోధినాం — నీ శత్రువులయొక్క । తాపింఛ— తమాల — (కానుగు) చెట్టుయొక్క । దల — ఆకుల వలె । కాంతాభిః — అందములైన । కీర్తిభిః — కీర్తుల చేత । సమాక్రాంతాపి—ఆక్రమించ బడినదే ఐనను । తవ — నీయొక్క । కీర్తిస్తు — కీర్తియేమో । శోభతే — ప్రకాశించుచున్నది ।

వివరణము :

కానుగాకులవలె నల్లగా నున్న శత్రువుల అపకీర్తితో కలిసియున్నను రామేశ ప్రభు కీర్తి తెల్లగానే ప్రకాశించుచున్నది. అనగా నలుపు గుణమును స్వీకరించలేదని వర్ణించుటచే ఇచట అతద్గుణము.

అథ ప్రశ్నోత్తరికాలంకారః

మిథః శ్చమత్కృియాలాపో యః ప్రశ్నోత్తరికా హి సా। 203

వివరణము :

చమత్కార పూర్ణమగు పరస్పర సంభాషణము ప్రశ్నోత్తర రూపముగా నిబంధించ బడియున్న నది ప్రశ్నోత్తరికాలంకారము.

ఉదాహరణమ—

భో దారిద్ర్య! కులం విహాయ విదుషాం తూర్ణం క్వ వా గచ్ఛసి
స్వామిన్నబ్జజ! రామభోగివిబుధ శ్చక్రే మమోచ్చాటనమ్।
తచ్ఛత్రూన్న కథం గతోఽసి శరణం తచ్ఛత్రవః కే క్షితౌ
యేషాముల్లసనం ముఖేషు లలితం తత్పాదాలోకనాత్॥ 204

అర్థము :

భోః — ఓయి । దారిద్ర్య — దారిద్ర్యమా । విదుషాం — విద్వాంసుల । కులం — ఇంటిని । విహాయ — విడిచి । తూర్ణం — త్వరగా । క్వవా — ఎక్కడికి । గచ్ఛసి — వెళ్ళుచున్నావు । స్వామిన్ — ప్రభువైన । అబ్జజ — బ్రహ్మదేవుడా । రామభోగి విబుధః — రామేశ్వర ప్రభువు । మమ — నాయొక్క । ఉచ్చాటనం — త్రోసివేతను । చక్రే - చేసెను । తచ్ఛత్రూన్ — అతని శత్రువులను । శరణం — రక్షకముగా । కథం — ఎట్లు । నగ

తో ఒసి — పొందలేదు । క్షితౌ — భూమియందు । తచ్ఛత్రవః — అతని శత్రువులు । కే — ఎవరు । యేషాం — ఎవరియొక్క । ముఖేషు — మోములయందు । తత్సంపదాలోకనాత్ — ఆతని సంపత్తిని చూచి నందున । ఉల్లసనం — సంతోషము । లులితమ్ — అస్తమించినదో ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభు సంపత్తిని చూచి మోము ముడిచికొనినవారలే అతని శత్రువులనియు, వారిని దారిద్ర్యమావహించినదనియు, విద్వాంసులందరూ శ్రీమంతులైనారనియు నీవిషయములు బ్రహ్మదేవునికి దారిద్ర్యమునకును జరిగిన సంభాషణ రూపమున వివరించబడినవి కనుక నిది ప్రశ్నోత్తరాలంకారము.

మరియొక ఉదాహరణము

యథావా—

కంజాతం న విముంచతీహ కమలా కామార్తి మార్చ్ఛత్యభీః
శ్రీమాన్ షోడశవార్షిక స్స భగవాన్ కం సంజఘాన ప్రభుః
కిం జల్కం సమవాప్య (మోదతి) నందతి పరం హంస స్సదా మానసే
రామేశప్రభు మాశ్రితో బుధజనః కం కం సమాప్నో త్యలమ్॥ 205

అ ర్థ ము :

ఇహ — ఇచట । జాతం — పుట్టిన । కం — దేనిని । కమలా — లక్ష్మి । నవిముంచతి — విడవదు? కంజాతం — కమలమును (అని ఉత్తరము) । అభీః — భయములేనివాడు । కాం — ఏ । ఆర్తిం - బాధను । ఆర్ఛతి — పొందును? । కామార్తిం — మన్మథ బాధను (అని ఉత్తరము) । శ్రీమాన్ — అందములుగల । షోడశవార్షికః — పదునారు వర్షములుకల । సః - ప్రసిద్ధుడగు । ప్రభుః — ప్రభువగు । భగవాన్ — భగవంతుడు । కం — ఎవనిని । సంజఘాన — చంపెను? । కంసం — కంసుని । (అని ఉత్తరము) । హంసః — హంస । సదా — ఎల్లపుడు । మానసే — మానస సరోవరమున । కిం — ఏ । జల్కం — ఆహారమును । సమవాప్య — పొంది । పరం — ఎక్కువ । నందతి — సంతోషపడును? । కింజల్కం — కింజల్కమును । (అని ఉత్తరము) । రామేశ ప్రభుం — రామేశ ప్రభువును । ఆశ్రితః — ఆశ్రయించిన । బుధజనః — విద్వాంసుడు । కం కం — దేని దేనిని । అలం — మిక్కిలి । సమాప్నోతి — పొందును? కంకం — రత్నదీనారమును (అని ఉత్తరము) ।

వి వ ర ణ ము :

ఇచ్చట ప్రశ్నవాక్యమే ఉత్తరవాక్యముగా నేర్పడుచున్నది. 'కం — జాతం' అని రెండు పదములుగా ప్రశ్న వాక్యము నందును 'కంజాతం' అని ఒకేపదముగా ఉత్తర వాక్యమునందును విభజించ వలసియున్నది. ఇట్లే 'కం — సంజఘాన' అనునది ప్రశ్న 'కంసం జఘాన' అనునది ఉత్తరము. మిగత వాక్యములువిట్లే గలవు ఇదియు ప్రశ్నోత్తరాలంకారము. ఇచట 'మోదతి' యను పరస్మైపదరూపము 'ముద' ధాతువునకు కుదరనందున 'నందతి' యని మార్చబడినది.

ఈ శ్లోకము చివర నిఘంటు కారికలీయబడినవి.

జల్కాంతు భక్ష్యభేదేఽపి చాలిక్యం కుంజరా శనే।
కంకశ్ఛద్మద్విజేఖ్యాతౌ లోహపృష్ఠకృతాంతయోః॥
తథా యాదవభేదే స్యాత్ రత్నే దీనారకుప్యయోః।
ఇత్యుభయత్రాపి విశ్వనానార్థమాలే''

కంజాతం అను పైశ్లోకములోని 'జల్కా — కంక' పదములకు గల అర్థములే ఈ నిఘంటు కారికలలో నీయబడినవి.

అథానుమానాలంకారః

సాధ్యసాధనమాత్రోక్తౌ అనుమాన ముదీరితమ్। 206

యత్ర కించిద్జ్ఞాప్యం నిర్దిశ్య తద్జ్ఞాపకతయా అన్యన్నిర్దిశ్యతే తత్రాను మానాలంకారః। మాత్రచావ్యాప్తి పక్షధర్మతయోః ప్రదర్శనం నిరస్యతే। తయోరపి ప్రదర్శనే తర్కానుమానత్వాపాతాత్। వస్తుతస్తు తాభ్యామపి భవితవ్యమేవ। యథా—

వి వ ర ణ ము :

సాధ్య సాధనముల మాత్రమే నిర్దేశించిన అనుమానాలంకారము. 'మాత్రమే' యనుట వలన వ్యాప్తి — పక్షధర్మతల నిర్దేశము నిరసించబడును. వానిని గూడ నిర్దేశించిన నది తర్కశాస్త్రానుమానమే యగును, కాని కావ్యానుమానముగా నుండకపోవచ్చును. ఐనను మరీ శాస్త్రాకారమును సంతరించుకొనని వ్యాప్తి — పక్ష ధర్మతలు గూడ ఉండుట వాస్తవముగా వన్నెదెచ్చును. ।

ఉదా:—

సితత్వాచ్ఛీతత్వా ద్భువి విసృమరత్వా ద్దివి చ తే,
యశః కేచిత్ జ్యోత్స్నాం జగతి కలయంత్యేవ కవయః।
గుణాబ్దే రామేశ త్వదురు మహిమాద్రి ప్రమథితాత్
సుధాకీర్తి వ్యాజా దజని మతమేతన్మమ పునః॥ 207

అర్థము :

రామేశ — రామేశప్రభూ । తే — నీయొక్క । యశః — కీర్తిని । జగతి — ప్రపంచము నందు । కేచిత్ — కొందరు । కవయః — కవులు । సితత్వాత్ — తెల్లనిదగుటవలన । శీతత్వాత్ — చల్లనిదగుట వలన । భువి — భూమియందు । దివిచ — స్వర్గమునందును । విసృమరత్వాత్ - ప్రసరించునదగుటవలన । జ్యోత్స్నామేవ — వెన్నెలనుగానే । కలయంతి — వర్ణించుచున్నారు । త్వత్ — నీయొక్క । ఉరు — గొప్పదగు । మహిమాద్రి - ప్రభావమనెడు పర్వతమువలన । ప్రమథితాత్ — మథించబడిన । గుణాబ్ధేః — గుణసాగరమునుండి । సుధా — అమృతము । కీర్తి వ్యాజాత్ — కీర్తి యనెడు నెపమున । అజని — ఏర్పడెను । ఏతత్పునః — ఇదేమో । మమ - నాయొక్క । మతమ్ — మతము ।

వివరణము :

ఇచట ''సితత్వాది'' సాధనములచేత కీర్తిని వెన్నెలయని, అమృతమని, సాధించుట జరిగినది. కనుక నిచట అనుమానాలంకారము.

అథ ప్రత్యనీకాలంకారః

ప్రతిపక్షస్య బలినః ప్రతీకారే సుదుష్కరే,
తదీయస్య తిరస్కారః ప్రత్యనీకముదీర్యతే॥ 208

వివరణము :

శత్రువు బలవంతుడగుటచే నతనిని ఎదిరించలేక ఆతనికి సంబంధించిన మరియొకరిని తిరస్కరించుట ప్రత్యనీకమను అలంకారముగా పేర్కొనబడును.

ఉదా—

లావణ్యే భువనోపకారకరణే రామేశ విద్వత్ప్రభో
సూర్యాచంద్రమసౌ త్వయా త్వకరుణం దక్షేణ సంవఞ్చితౌ,

తే ధామ్నా చ ముఖేన తౌల్య మయతో ర్వహ్న్యబ్జయో స్సాహసాత్
క్లాంతిం క్లాంతతరావుభౌ వితనుతః శ్రీవిశ్వనాథాత్మజ॥ 209

అ ర్థ ము :

శ్రీ విశ్వనాథాత్మజ — విశ్వనాథ పుత్రుడవగు । విద్వత్ప్రభో - విద్వాంసుడవును ప్రభువగునగు । రామేశ-రామేశ మహారాజ । భువనోపకార కరణే — లోకోపకారమొనరించుట యందును । లావణ్యే — సౌందర్యము నందును । దక్షణ — సమర్థుడవగు । త్వయా - నీ. చేత । అకరుణం — నిర్దయగా । సూర్యాచంద్రమసౌ — సూర్య చంద్రులు । సంవంచితౌ - వంచించబడినవారలగుచు । ఉభౌ — ఇద్దరును । క్లాంతతరే — క్షీణించిన వారలై । సాహసాత్ — సాహసమువలన । తే — నీయొక్క । ధామ్నా — తేజస్సుచేత । ముఖేనచ - ముఖముచేతకూడ । తౌల్యం — సామ్యమును । అయతోః — పొందుచున్న । వహ్న్యబ్జయోః — అగ్ని పద్మములకు । క్లాంతిం - క్షయమును । వితనుతః - విస్తరింపచేయుచున్నారు।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువు లోకోపకారమున — సూర్యుని సౌందర్యమున — చంద్రునికూడ మించినందున వారిద్దరు రాజు నెదిరించలేక, రాజు ప్రతాపము వంటి అగ్నిని సూర్యుడు, రాజు ముఖమువంటి పద్మమును చంద్రుకును, కాంతిహీన మొనరించుచున్నా రనుటవలన నిచట ప్రత్యనీకాలంకారము.

అత్ర జగదుపకారలావణ్యగుణయోగేన త్వయా పరాభూతౌ రవిశశినౌ। త్వత్ప్రతీకారాక్షమౌ త్వత్తేజోముఖసఖయోః కృశానుసరోజయోః । కాంతి క్షయం కురుత ఇత్యుచ్యతే తేనానీకాభిభవాశక్త్యా కస్యచిత్ప్రత్యనీకాభిధావ కత్వదర్శనాత్ ఇదమపి తాదృగితి ప్రత్యనీక మిత్యుచ్యతే।

వి వ ర ణ ము :

ప్రత్యనీకాలంకార సమన్వయము పైన చెప్పిన విధముగా ప్రదర్శించుటయేగాక ఈ పంక్తులలో రచయిత "ప్రత్యనీక" పద సార్థక్యమును చూపెట్టుచున్నాడు. అనీకమనగా సైన్యము. దాని నెదిరించలేని వ్యక్తి తత్సంబంధిని ఎదిరించుటవలె నిది యున్నందున దీనికి ప్రత్యనీకమని పేరు ఏర్పడినది.

అథ ప్రతీపాలంకారః

ప్రతీప ముపమానస్యోపమేయత్వప్రకల్పనమ్। 210

యతోఽపమేయస్య లోకోత్తరతాం వక్తుం ఉపమానస్య ఉపమేయతయా।
కల్పనం క్రియతే తత్ర ప్రతీపాలంకారః। యథా-

వి వ ర ణ ము :

లోకోత్తరత్వమును అభివ్యక్త మొనరించుటకై ఉపమానమును వర్ణనీయమగు దానికి ఉపమేయముగా కల్పించిన, నది ప్రతీపాలంకార మగును.

ఉదాహరణము—

విశ్రాణనైకనిరతేన భవద్భుజేన
సామ్యం గతస్య హరిచందనపాదపస్య।
వ్యర్థా స్థితిర్భువి సదేతి విచింత్య వేధాః
స్వర్లోక దాన విభవాయ చుచోద తం చ॥ 211

అ ర్థ ము :

వేధాః — బ్రహ్మదేవుడు । విశ్రాణన - దానమునందు । ఏక - ఒకదాని యందే । నిరతేన — సక్తమైన । భవత్ — నీ । భుజేన — భుజముతో । సామ్యం — సామ్యమును । గతస్య — పొందిన । హరిచందన పాదపస్య — హరిచందన మను వృక్షముయొక్క । భువి — భూమియందు । సదా — ఎల్లప్పుడు । స్థితిః — ఉనికి । వ్యర్థా — నిష్ఫలము । ఇతి - అని । విచింత్య — ఆలోచించి । తంచ — ఆ వృక్షమును । స్వర్లోక - స్వర్గలోకమునందు । దాన విభవాయ — దానమనెడు పనికై । చుచోద — ప్రేరేపించెను ।

వి వ ర ణ ము :

హరిచందనము భూలోకమున నుండెడిది. అర్థి జనుల యభీష్టముల నిచ్చుచుండెడిది. ఐన రామేశ ప్రభు భుజదండము దీనిని మించి దానముచేయుచుండ ఆభుజముతో సమానమగు నీవృక్షము భూమియందు ఉండనవసరము లేదని, ఆలోచించి బ్రహ్మదేవుడు ఆవృక్షమును స్వర్గలోకములో అర్థిజనుల అభీష్టము దీర్పుమని పంపెను. అందుచే అది ఇపుడు దేవవృక్షమైనది. ఇట్లు వర్ణించుట వలన నిచట ఉపమానముగావలసిన 'హరిచందనము' భుజమునకుపమేయమైనది. అందుచే ఇచట ప్రతీపాలంకారము, 'నిరతేన' అని పూరితము.

అథోదాత్తాలంకారః

ఉదాత్తాలంకృతి స్స్యా ద్యత్సమృద్ధార్థవర్ణనమ్। 212

వి వ ర ణ ము :

సమృద్ధిగలపదార్థముల వర్ణనము ఉదాత్తాలంకారము.

శ్రీరామేశక్షితీంద్రామలగుణవిదుషాం కుండలైః శ్రోత్రదేశః
కంఠో హారైః కటీ శ్రీపురుషగుణవరైః కంకణైర్హస్తపద్మమ్।
అంగుల్యస్త్వంగులీయై ర్మణివరనికరై స్తావకౌదార్యలీలామ్
ఏతాన్యుద్వ్యంజయంతి శ్రితదివిజతరో విశ్వనాథాత్మజాద్య॥ 213

అ ర్థ ము :

విశ్వనాథాత్మజ — విశ్వనాథ పుత్రుడవగు । శ్రితదివిజతరో — ఆశ్రితులకు కల్పవృక్షమవగు । అమలగుణ — స్వచ్ఛములగు గుణములు గల । శ్రీరామేశక్షితీంద్ర — రామేశప్రభూ । విదుషాం — విద్వాంసులయొక్క । కుండలైః — కుండలములతో । (యుక్తః — కూడుకొనిన) । శ్రోత్రదేశః —చెవుల ప్రాంతము । హారైః - హారములతో । (యుక్తః — కూడుకొనిన) । కంఠః — కంఠము । శ్రీపురుషగుణవరైః — సంపన్న పురుషుల మొల త్రాడులచేత । యుక్తా — కూడుకొనిన) కటీ — నడుము । కంకణైః — కంకణములతో । (యుక్తం - కూడుకొనిన) హస్తపద్మమ్ — కమలమువంటి కరము । మణివరనికరైః — శ్రేష్ఠములగు మణుల సముదాయముగల । అంగులీయైః — ఉంగరములచేత (యుక్తాః — కూడుకొనిన) అంగుల్యః — వ్రేళ్ళు । ఏతాని — ఇవి । తావక — నీయొక్క । ఔదార్య లీలాం తు — దానవిలాసమును । ఉద్వ్యంజయంతి — అభివ్యక్తమొనరించుచున్నవి ।

వి వ ర ణ ము :

ఇచట ప్రభు దాన గుణమున కభివ్యంజకముగా విద్వాంసుల అర్థ సమృద్ధి వర్ణించబడినది. అందుచే ఇది ఉదాత్తాలంకారము.

అథానుకల్పాలంకారః

అనుకల్పస్తు గౌణోక్తి ర్ముఖ్యోక్తే స్సమనంతరమ్। 214

వి వ ర ణ ము :

ప్రధానము తరువాత అప్రధానమును పేర్కొనుట అనుకల్పాలంకారము.

ఉదాహరణము—

శ్లాఘ్యోఽయం దానవిద్యాయాం రామేశోహ్యథపార్థివః ।
యథా పరప్రకాశే తు తపనో దహనోఽపి వా॥ 215

అర్థము :

దానవిద్యాయాం — దానవిద్యయందు। అయం — ఈ। రామేశః — రామేశ ప్రభువు। అథవా - లేక। అర్కజః — కర్ణుడు। శ్లాఘ్యః — ప్రశంసించదగినవాడు। యథా — ఎట్లైన। పరప్రకాశే — ఇతరవస్తువుల ప్రకాశింప జేయుటయందు। తపనః — సూర్యుడు వా — లేక। దహనోఽపి — అగ్నియైనను।

వివరణము :

ఇచట ముఖ్యులగు 'రామేశ — సూర్యుల'ను చెప్పిన తరువాత 'కర్ణవహ్నులను' చెప్పినందున నిది అనుకల్పమను నలంకారము. 'రామేశ — కర్ణులు' 'తపనదహనులవంటి' వారను ఉపమ కనపడుచున్నను, దానివలన సూర్యుని ముందు అగ్నివలె దాన గుణమున కర్ణుడు రామేశునిముందు వెలవెల బోవుననియు, కనుకనే కర్ణుని కంటె రామేశుడు గొప్ప యనియు నేర్పడును. కనుక దీనిని పృథగలంకారముగా నీతడు పేర్కొనినాడు.

ననూభయోరపి వైకల్పికత్వేన వికల్పాలంకారః కిం నస్యాత్, మైవమ్। తుల్యత్వే హి వికల్పః। నచాత్ర తుల్యబలతా, తపనాపేక్షయా దహనవద్రామేశాపేక్షయా కర్ణస్య జఘన్యత్వాత్।

వివరణము :

ఇచట దానగుణములో రామేశ కర్ణులిద్దరిని వికల్పించినందున వికల్పాలంకారము అనరాదు. ఏలన, ఇద్దరు సమానులైనపుడే వికల్పాలంకారము. ఇచట సూర్యునికంటె వహ్నికి వలె, రామేశునికంటె కర్ణునికి తక్కువదనము వివక్షితము కనుక నిది వేరే అలంకారము.

అథ సూక్ష్మాలంకారః

యదసంలక్షితం వస్తు సూక్ష్మం స్యాత్తత్ప్రకాశనే। 216

వివరణము :

చక్కగా తెలియని యంశమును ప్రకాశింపచేయుట సూక్ష్మాలంకార మనబడును.

ఉదాహరణము—

శ్రీరామేశేన సమం మమాస్తు మిథ్యాభిశాపో వా।
ఇతి పశ్యతి ముహు రబలా భాద్రచతుర్థీకలానాథమ్॥ 217

అత్రి రామేశేన సంగమో దుర్లభః మిథ్యాభిశాపో వా భవత్వితి,
సూక్ష్మార్థం మనసి విధాయ భాద్రపదచతుర్థీచంద్రమపశ్యదితి ప్రకాశనమ్।

అర్థము :

శ్రీరామేశేన సమం — రామేశప్రభువుతోగూడ । మమ — నాకు । మిథ్యా — అసత్యమగు । అభిశాపోవా — అపవాదమైనను । అస్తు — అగుగాక । ఇతి — అని । అబలా — స్త్రీ । ముహుః — తేపతేపకు । భాద్రచతుర్థీః లానాథమ్ — భాద్రపద చతుర్థినాటి చంద్రుని । పశ్యతి — చూచుచున్నది.

వివరణము :

రామేశ్వర ప్రభు సంగమమునందు ఆశ చాలించుకొనిన, యువతి వాస్తవ సంగమము లేకపోయినను అసత్యమగు నొక అపనిందయైనను ఏర్పడిన చాలునని భాద్రపద చతుర్థినాడు చంద్రుని చూచుచున్నది. అనుటచే రహస్యార్థ ప్రకాశనము జరిగినందున నిది సూక్ష్మాలంకార మగుచున్నది.

అథ రసవదాద్యలంకారః

యత్రాంగభావం భజతే రసస్తత్ర రసవదితి వామనః। యథామదీయే భాగవత చంపూప్రబంధే—

వివరణము :

రసము ప్రధానముగాక అంగముగా నెక్కడ వర్తించబడునో, అక్కడ రసవదలంకారమని వామనునిమతము. తన భాగవత చంపూ ప్రబంధములోని ఈ శ్లోకము ఉదాహరణముగా చూపించబడుచున్నది.

రాధే ముఖేందు మకలంకతమం సమీక్ష్య
లజ్జాకులః కిలతుషారకరః పురాభూత్।
విశ్లేతుకోపమలినే వదనే తవాద్య
సద్య స్సముల్లసతి సామ్యధియా శశాంకః॥ 218

అత్రకోపభావస్య శశాంకోల్లసనరూపశృంగారః అంగభావం భజతీతి రసవదలంకారః।

అర్థము :

రాధే — ఓరాధా। తవ — నీయొక్క। అకలంకతమం — ఏమాత్రము కలంకము లేని। ముఖేందుం — ముఖచంద్రుని। సమీక్ష్య — చూచి। పురా — పూర్వము। తుషారకరః — చంద్రుడు। లజ్జాకులః - లజ్జగలవాడై। అభూత్కిల — అయెనట। అద్య — ఈవేళ। తవ — నీ। వదనే — మోము। నిర్హేతు కోపమలినేసతి — నిష్కారణ కోపముతో మలినమగుచుండ। శశాంకః - చంద్రుడు। సామ్యధియా — సమానమైనదను బుద్ధితో। సద్యః - వెంటనే। సముల్లసతి - భాసించుచున్నాడు।

వివరణము :

ఇచట చంద్ర సముల్లాస రూపమగు ఉద్దీపన విభావము వలనను, రాధారూపాలంబన విభావము వలనను, అభివ్యక్తమగు కృష్ణుని యందలి శృంగారము (రతిభావము) రాధారోష రూప భావమునకు అంగముగా నేర్పడి, రోషభావమే ప్రధానమైనది కావున నిట రసవదలంకారము.

రసం ప్రతి రసోహ్యంగం భావమేవ జగుర్బుధాః। 219

వివరణము :

రసమును గురించి అంగముగా వర్ణించబడిన రసమును విద్వాంసులు భావమునుగానే చెప్పుదురు. అంగమగు దానికి ప్రాధాన్యముండదు కదా. అందుచే అది రసత్వస్థితిని అందుకొనజాలదని భావము.

ఉదాహరణము—

సప్తాంభోనిధి మధ్యభాగ వసుధా వప్రోపవిష్టార్థినః
సర్వే సంప్రతి సంశృణుధ్వ మభితో భూమా మయోదుష్యతే (తామ్)।
శ్రీరామేశ విభు స్సపద్యతితరాం త్యాగైక సింహాసనా
ధ్యాసీనో వితరత్యభీష్టమఖిలాభీష్టాని చాన్యేన కిమ్?॥ 220

అత్ర దైన్యరూపకరుణరసం ప్రతి దానవీరస్యాంగత్వమ్।

అర్థము :

సప్తాంభోనిధి — ఏడు సముద్రములు। మధ్యభాగ — మధ్యభాగమగు। వసుధావప్రభూ పదేశమునందు। ఉపవిష్ట — కూర్చొనియున్న। అర్థినః— యాచకులారా। సర్వే — (మీరు) అందరు। సంప్రతి — ఇపుడు। సంశృణుధ్వం - వినుడు। మయా - నాచేత।

భూమౌ — భూమియందు । అభితః — అంతట । ఉద్ ఘుష్యతే — చాటబడుచున్నది । త్యాగైక సింహాసనాధ్యాసీనః — త్యాగమే ప్రధానముగాగల సింహాసనమునందున్న । శ్రీ రామేశ విభుః — రామేశప్రభువు । అభీష్టం — ఇష్టమైనంత । సపది - వెంటనే । అఖిలాభీష్టాని - సమస్తములగు అభిమతములను । అతితరాం - మిక్కిలి । వితరతి — ఇచ్చుచున్నాడు । అన్యేన - మరియొకరితో । కిం — ఏమి ?।

**వివరణము :**

ఇచట యాచకులనినందువ వ్యక్తమగు దైన్యమునకు రాజు దాన వీరము అంగముగా కూర్చబడినది. అందుచే రవపదలంకారమని గ్రంథకర్త అభిప్రాయము. వస్తుతః ఇచట దేనికిని రసత్వసిద్ధికనపడదు.

అథ ప్రేయోలంకారః

ప్రేయోఽలంకృతిరంగంచేద్ భావో భావాంతరం ప్రతి। 221

**వివరణము :**

ఒక భావము మరియొక భావమున కంగముగా నిబద్ధమైన ప్రేయోలంకార మనబడును.

ఉదాహరణము—

త్వద్దానస్య (ము) మఖేషు సంవిహరణం రామేశ విద్వత్ప్రభో।
యష్ట్వాణాం జలకేలిషు ద్యుతటినీపూరావగాహాయతే।
నిత్యం స్నిగసరోరుహేషు వికసన్మందారమాలాయతే
కించాన్నేచ సుధాయతే (వ్యవహృతా) స్వవనితాతల్పేఽపి రంభాయతే॥222

**అర్థము :**

విద్వత్ప్రభో — విద్వాంసుడవును — ప్రభుడవును అగు । రామేశ-రామేశ మహారాజా । మఖేషు - యజ్ఞములందు । త్వద్దానస్య - నీదానముయొక్క । సంవిహరణం - విహారము । యష్వ్రాణాం — ఋత్విక్కులకు । జలకేలిషు — జలక్రీడలయందు । ద్యుతటినీపూర - ఆకాశగంగా ప్రవాహమునందు । అవగాహాయతే — అవగాహనమును వలె చేయుచున్నది । నిత్యం — ఎల్లప్పుడు । స్నిగ్ధ సరోరుహేషు — చక్కని కమలములయందు । వికసన్మందార మాలాయతే - వికసించిన మందారములమాలయందు వలె నాచరించుచున్నది । కించ — మరియును । అన్నేచ — అన్నమునందును । సుధాయతే — అమృతమునందువలె ఆచరించుచున్నది । స్వవనితా తల్పేపి — తమ తమ స్త్రీలతోనున్న శయ్యయందును । రంభాయతే — రంభాయుక్త శయ్యయందువలె ఆచరించుచున్నది ।

వి వ ర ణ ము :

యాగములలో రామేశ ప్రభువు చేయు దానము, ఋత్విక్కుల సాధారణ జలావగాహనమును ఆకాశగంగాజలావగాహనమువలె, వా రలంకరించుకొను కమలముల మందారములవలె, వారు భుజించు అన్నమును అమృతమువలె, వారివారి స్త్రీలతోనున్న తల్పములను రంభా విశిష్ట తల్పములవలె నొనరించినది.

అత్ర సంభోగశృంగారాలంబనవిభావం ప్రతి స్వస్వత్వనివృత్తిపూర్వక పరస్వత్వాపాదనరూపక్రియాత్మకవ్యభిచారిభావస్య అంగత్వమితి ప్రేయో లంకారత్వమ్। యథావా—

వి వ ర ణ ము :

పైశ్లోకమున జలక్రీడా – సరోరుహమాలా – రంభాతల్పాదులవలన నభివ్యక్తమగు శృంగారమున కాలంబన విభావభూతులగు వారలకు రాజకృతదానము అంగముగా, నిబంధింపబడినందున, నిది ప్రేయోలంకారము. ఇందులో భావమునకు భావమంగము కావలయునను ప్రేయోలంకార లక్షణము సరిగా సమన్వయమగుటలేదు. అందుచేత మరియొక ఉదాహరణ మివ్వబడుచున్నది.

శ్రీ విశ్వేశాత్మజాద్య క్షితితలమదన త్వద్వియోగార్తి వేగ
గ్లానా శుష్యన్మృణాలాకృతి రధికకృశా నైవ నిద్రాతి బాలా।
కించోదంచత్త్వదీయాకృతి విజితనిజాకారకాంతిః స్మరశ్చ
త్వద్వక్త్రాలోకభగ్నో విధురపి కృషతః సా త్వదీయేతి రోషాత్॥ 223

అత్ర గ్లానిరూపవ్యభిచారిభావం ప్రతి కార్శ్యభావస్య అంగత్వమ్ ।

అ ర్థ ము :

క్షితి తల మదన - భూతలమన్మథుడవగు । శ్రీవిశ్వేశాత్మజ — విశ్వేశ పుత్రుడా । అద్య — ఈ వేళ । త్వద్వియోగార్తి - నీవియోగ బాధయొక్క । వేగ - వేగముచేత । గ్లానా — వాడిపోయినట్టి । శుష్యన్మృణాళాకృతిః - ఎండిపోవుతామరకాడ ఆకారముగల । బాలా — ముద్దరాలు । అధికకృశా — చాలా కృశించినదియై । నైవనిద్రాతి — నిదురించుటయే లేదు । కించ - మరియును । ఉదంచత్ — వృద్ధిచెందుచున్న । త్వదీయాకృతి - నీ సౌందర్యముచేత । విజిత - జయించబడిన । నిజాకార కాంతిః — తన శరీర కాంతిగలవాడై । స్మరశ్చ — మన్మథుడును । త్వద్వక్త్రాలోక — నీముఖకాంతిచేత । భగ్నః - పరాజితుడగు ।

విధురపి — చంద్రుడుగూడ । సా - ఆ యువతి । త్వదీయా — నీది । ఇతి — అని । కోషాత్ — కోపమువలన । (తాం - ఆమెను) కృషతః — అరగదీయుచున్నారు.

వి వ ర ణ ము :

ఇచట ప్రభువియోగము వలన కలిగిన గ్లాని యను భావమునకు కృశత్వమను భావమంగముగా నిబంధించబడినందున ప్రేయోలంకారమగును.

అథ ఊర్జస్వీ — సమాహితాలంకారౌ

రసాభాసోఽథవా భావాభాసో యత్ర రసస్య వా।
భావస్యాంగం భవేత్తత్ర ప్రాహురూర్జస్వ్యలంక్రియా॥ 224
సమాహితాలంకృతిః స్యాత్ భావాంగే భావసంక్షయే। 225

వి వ ర ణ ము :

రసాభాస - భావాభాసములు రసానికిగాని, భావానికి గాని, అంగములుగా నిబంధించబడిన, అచట 'ఊర్జస్వి' అలంకారమనియందురు.

భావశాంతి భావాంగమైనపుడు సమాహితాలంకారము.

వరుసగా నుదాహరణములు :

త్వత్పౌధభాగవివరేషు రమత్ కపోత
ద్వంద్వం విలోక్య మదనాశుగపీడితాంగాః।
ధూర్తా భటా స్తవ దివాపి గృహీతకంఠాః
స్వీయాభి రజ్ఞనయనాభి రహో రమంతి॥ 226
అత్ర తిర్యగ్గతో రసాభాసః శృంగారరసస్య అంగమ్।

అ ర్థ ము :

త్వత్పౌధభాగ వివరేషు — నీమేడ ప్రాంతములోని అవకాశములయందు । రమత్ — క్రీడించు । కపోత — పావురముల । ద్వంద్వం — జంటను । విలోక్య — చూచి । మదనాశుగ పీడితాంగాః — మన్మథ బాణములతో బాధించబడిన శరీరములు గలవారలై । తవ — నీయొక్క । ధూర్తాః — ధూర్తులగు । భటాః — భటులు । దివాపి — పగలుకూడ । గృహీత కంఠాః — గ్రహించబడిన కంఠముగలవారలై । స్వీయాభిః — తమతమ । అజ్ఞనయనాభిః — స్త్రీలచేత । (రమంతి) రమంతే — క్రీడించుచున్నారు । అహో — ఆశ్చర్యము । (రమత్ అను ప్రయోగము అపాణినీయము)

వి వ ర ణ ము :

ఇచట కపోతగత రసాభాసము భటగత శృంగారానికి అంగముగా నున్నందున నిది "ఊర్జస్వి" అను నలంకారము.

కేచిద్ద్విష స్తవ భయాదసకృత్పురేషు
స్థిత్వా చిరం మదనసాయకలక్ష్య భూతాః।
వేశ్యాలయం నిశి నివిశ్య పణప్రదానా
శక్తా రతేషు సునిబద్ధభుజా బభూవుః॥ 227

అత్ర కాముకానాం భవద్ద్వేషిణాం గర్వాభాసః వేశ్యాజనానాం నర్మభావం ప్రత్యంగమ్।

అ ర్థ ము :

కేచిత్ – కొందరు । తవ – నీయొక్క । ద్విషః – శత్రువులు । భయాత్ – భయమువలన । పురేషు – పట్టణముల యందు । అసకృత్ – చాలాసార్లు । స్థిత్వా – నిలిచి । చిరం – చాలా కాలమునుండి । మదన సాయక లక్ష్యభూతాః – మన్మథ బాణములకు గురియై । నిశి – రాత్రి । వేశ్యాలయం – వేశ్య గృహమును । నివిశ్య – ప్రవేశించి । పణప్రదానాశక్తాః – అడిగిన ధనమిచ్చుటయందు అశక్తులై । రతేషు – క్రీడలయందు । సునిబద్ధభుజాః – బాగుగా కట్టివేయబడిన భుజములు గలవారలై । బభూవుః – ఐరి ।

వి వ ర ణ ము :

ఇచట రాజుకు భయపడు శత్రువులకు గర్వము అసంబద్ధము కనుక, అది గర్వాభాసమని తాత్పర్యము. ఇది వేశ్యాజన శృంగార క్రీడకు సంబంధించిన భావమునకు అంగము కనుక నిదియు ఊర్జస్వి అలంకారమె అని తాత్పర్యము.

యా మాం ప్రబోధితవతీ సుచిరం ప్రముగ్ధాం
రామేశనాథవిషయైః కలహోపదేశైః।
సా కిన్నివారయతి మత్తమధువ్రత జ్యా
టంకార ఘోర మదనాశుగ పాత తాపమ్॥ 228

అత్ర సహనశాంతిరూపకలహః మదనసంతాపం ప్రత్యంగమ్।

**అర్థము :**

యా — ఎవతె । ప్రముగ్ధాం — ముద్దరాలనగు । మాం — నన్ను । సుచిరం — చాలాకాలము । రామేశనాథవిషయైః — రామేశప్రభు విషయకములగు । కలహోపదేశైః— ప్రణయ కలహము యొక్క ఉపదేశముంచేత । ప్రబోధితవతీ — మేలుకొల్పినదో । సా — ఆమె । మత్త — మదించిన । మధువ్రత — తుమ్మెదల । జ్యా — అల్లెత్రాడు యొక్క । టంకార — ధ్వనిచేత । ఘోర - భయంకరమగు । మదన — మన్మథుని ! ఆశుగ — బాణ ముల । పాత — పడుట చేతనైన । తాపం — సంతాపమును । కిం — ఎందువలన । న నివారయతి — వారించదు.

**వివరణము :**

ఇచట ముగ్ధనాయికకు క్షమ నశించినదని కలహ ప్రస్తావమును బట్టి వ్యక్తమగును. అట్టి భావశాంతి — సంతాప భావానికి అంగముగా నున్నందున నిది సమాహితాలంకారము.

అథ సంసృష్టిః

తిలతండులవచ్ఛ్లేషభంగ్యా యా స్యాత్ పరస్పరమ్।
అలంకృతీనాం ఘటనా సా సంసృష్టి ర్నిగద్యతే॥ 229

ఆసా మలంకృతీనాం అవాంతరభేదభిన్నానాం పరస్పరనైరపేక్ష్యేణ ఏకత్రైవ తిలతండులన్యాయేన సంయోగవృత్త్యా స్థితిః సంసృష్టిః। సాచ శబ్దార్థోభయాలంకరణతత్త్వేన త్రివిధా। శబ్దాలంకార సంసృష్టి ర్యథా మదీయే భాగవతచంపూ ప్రబంధే శ్రీకృష్ణవచన మిదమ్:-

**వివరణము :**

పైనుదాహరించిన వివిధాలంకారములకు పరస్పర మపేక్ష లేకనే, ఒకచోట తిలతండుల న్యాయముగా సమావేశ మేర్పడిన సంసృష్టి యలంకార మనబడును. ఇది మూడు విధములు — 1. కేవల శబ్దాలంకార సంసృష్టి 2. కేవలార్థాలంకార సంసృష్టి 3. ఉభయాలంకార సంసృష్టియని. శబ్దాలంకార సంసృష్టికి తన భాగవత చంపూ ప్రబంధములోని శ్రీకృష్ణ వచన ముదాహరించుచున్నది :

త్వద్ధాటీషు సమిద్ధ సైంధవ ఖురోద్ధూతై ర్ధరారేణుభిః
వ్యావిద్ధా నృపమూర్ధబద్ధమణయః స్నిగ్ధా నిరుద్ధత్విషః
త్వత్పాదాబ్జ నఖాబ్జ మంజుల భవ త్తేజ శ్శిఖాభిః పునః
తే శ్వేతాశ్చ వహంతి కాంతినివహం తిగ్మాంశు భంగావహమ్॥ 230

అత్ర వృత్త్యనుప్రాస యమకానాం సంసృష్టిః॥

అర్థము :

త్వత్ — నీ। ధాటీషు — యుద్ధయాత్రలయందు। సమిద్ధ — ప్రకాశించు। సైంధవ— గుఱ్ఱముల। ఖుర — డెక్కలచేత। ఉద్ధూతైః — లేపబడిన। ధరారేణుభిః — భూ పరాగముల చేత। వ్యావిద్ధాః — వ్యాప్తములైన। స్నిగ్ధాః — నున్నని। నృపమూర్ధనద్ధమణయః — రాజుల శిరోభాగము లందమర్చబడిన మణులు। నిరుద్ధత్విషః — అడ్డగించబడిన కాంతులు గలవియై। పునః—మరల। త్వత్పాదాబ్జ — నీ పదకమలములయందలి। నఖాబ్జ — చంద్రస దృశనఖములచేత। మంజుల — సుందరములగు। ధవ తేజశ్శిఖాభిః — నీ ప్రతాపకాంతులచేత। శ్వేతాశ్చ — ప్రకాశించునవియునై। తే — ఆమణులు। తిగ్మాంశు భంగావహం — సూర్యుని అవమానించజాలు। కాంతినివహం — కాంతి సముదాయమును। వహంతి — వహించు చున్నవి।

వివరణము :

ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసము — యమకము అను రెండు శబ్దాలంకారములకు పరస్పర నిరపేక్ష సమావేశమేర్పడినందున, ఇది సంసృష్టి అలంకారము. ఒకే అక్షరము అసకృదావృత్తమైన వృత్త్యనుప్రాసము. ఇచట 'ధకారము' అట్లనేకావృత్తి చెందియున్నది. ఒకటికంటె నెక్కువయగు అక్షర సముదాయము ఒకసారికంటె ఎక్కువ అవృత్తమైన అది యమకాలంకారము. ఇచట చతుర్థ పాదమున వహంతి (కాంతిని) వహంతి యను అక్షర సముదాయమునకట్టి అవృత్తికలను గాన యమకము.

అర్థాలంకార సంసృష్టి ర్యథా—

అర్థాలంకార సంసృష్టికి ఉదాహరణము—

విశ్వేశాంక సుఖోపలాలితతయా చైకాంతతత్త్వం గుహః॥

ఇత్యాదావతిశయోక్తి — శ్లేషయోః సంసృష్టిః।

వివరణము :

పైన "భేదేఽపి అభేదాతిశయోక్తి" అను అతిశయోక్తి అలంకారమునకు దాహరణముగా నివ్వబడిన "విశ్వేశాంక" అను శ్లోకమున విశ్వేశాది శబ్దములకు శ్లేషము "త్వంగుహః" అను చోట అతిశయోక్తియు నున్నందున ఆ శ్లోకము అర్థాలంకారముల సంసృష్టికి ఉదాహరణ మగుచున్నది.

ఉభయ సంసృష్టి ర్యథా-

శబ్దార్థాలంకారముల సంసృష్టికి ఉదాహరణము—

ఐశ్వర్యం తవ నిత్యమస్తు ధరణీమందార మందారవ (వః)
త్వం చాంభోధిగభీర భీరస రసన్మర్త్యైక దత్తాభయ।
శ్రీవిశ్వేశకుమార మారహరణస్ఫూర్తే సుమూర్తే వియద్
గంగా తుంగతరంగ ఫేన విలసత్కీర్తేఽత్ర రామేశ భోః॥ 231

అత్ర ఉపమావృత్త్యనుప్రాసయోః సంసృష్టిః॥

అర్థము :

ధరణీ మందార — భూలోక కల్పవృక్షమా । అంభోధిగభీర — సముద్రమువలె గంభీరుడా । భీరస — భయముచేత । రసత్ — ఆక్రోశించు । మర్త్యైక దత్తాభయ — మనుష్యమాత్రుల కభయమిచ్చువాడా । శ్రీవిశ్వేశకుమార — విశ్వేశ పుత్రుడా । మారహరణ స్ఫూర్తే — మన్మథుని హరించు కాంతిగలవాడా । సుమూర్తే — మంచి దేహము గలవాడా । వియద్గంగా — ఆకాశముయొక్క । తుంగ — ఉన్నతములగు । తరంగ — తరంగముల యొక్క । ఫేన — నురగవలె । విలసత్ — ప్రకాశించు । కీర్తే — కీర్తిగలవాడా । భోః — ఓయి । రామేశ — రామేశప్రభూ । అత్ర — ఈ లోకమునందు । తవ — నీకు । నిత్యం — ఎల్లప్పుడు । ఐశ్వర్యం — ఐశ్వర్యము । మందారవత్త్వంచ—మందారములు గలవాడవగుటయు । అస్తు — ఉండవలెను ।

వివరణము:

ఇక్కడ చతుర్థపాదమున గకారావృత్తి చేత, వృత్త్యనుప్రాసము, ఫేనము వంటి కీర్తియనుటచే ఉపమయు రెండునుండుటచేత నది ఉభయ సంసృష్టికి ఉదాహరణము—

అథ సంకరో నిరూప్యతే

ఇక సంకరాలంకారము నిరూపించబడును.

క్షీర నీర నయాద్యోగః సంకర స్సముదీర్యతే।
అంగాంగిభావాత్సందేహా ద్వాచకైక్యాత్సతు త్రిధా॥ 232

వివరణము :

పరస్పర సాపేక్షములైన రెండలంకారములకు నీరక్షీర న్యాయముగా సమావేశమైనచో నది సంకరాలంకారము. ఇది అంగాంగిభావ సంకరమని, సందేహసంకరమని, ఏకవాచకానుప్రవేశ సంకరమని మూడు విధములు.

అంగాంగి భావేన సంకరో యథా—

అంగాంగి భావముతో సంకరమునకుదాహరణము—

వ్యాలాధీశ ఫణాగణారుణమణి శ్రేణీ త్విషః పాదయోః
లక్ష్మీ ర్దిగ్గజదంతపంక్తిరుచయః క్షౌమం నితంబే నవమ్‌ః
అస్వప్నోపవనప్రసూన తతయో మాల్యాని వేణీభరే
శ్రీరామేశ విభో భవంతి నితరాం త్వత్కీర్తికాంతామణేః॥ 233
అత్ర రూపకాతిశయోక్త్యోః అంగాంగిభావేన సంకరః॥

అర్థము :

వ్యాలాధీశ — ఆదిశేషుని । ఫణాగణ — పడగల సమూహమునందలి । అరుణ — ఎర్రని । మణిశ్రేణీ త్విషః — మణి గుణముల కాంతులు । శ్రీ రామేశ విభో — ఓ రామేశ ప్రభూ । త్వత్కీర్తి కాంతామణేః — నీ కీర్తి యనెడు కాంతారత్నముయొక్క । పాదయోః - పాదముల యందలి । లక్ష్మీః — శోభారూపముగా । భవంతి — అగుచున్నవి । దిగ్గజ — దిగ్గజముల । దంతపంక్తి — దంత సముదాయముగల । రుచయః — కాంతులు । త్వత్కీర్తి కాంతామణేః — నీ కీర్తి యనెడు కాంతా రత్నముయొక్క । నితంబే-కటి ప్రదేశమునందు । నవం — నూత్నమైన । క్షౌమం — పట్టు వస్త్రముగా । భవంతి — అగుచున్నవి । అస్వప్న-దేవతల । ఉపవన — ఉద్యానమునందలి । ప్రసూనతతయః — పూవుల గుంపులు । త్వత్కీర్తి కాంతామణేః — నీ కీర్తియనెడు కాంతారత్నము యొక్క । వేణీభరే — కేశ పాశమునందు । నితరాం — మిక్కిలి । మాల్యాని - పూలదండలుగా । భవంతి — అగుచున్నవి ।

వివరణము :

ఇచట కీర్తిని కాంతగా రూపించినందున రూపకాలంకారము ప్రధానమైనది. భేదమున్నను అభేద వర్ణన రూపములగు అతిశయోక్తులు మూడు పాదములలోనివి ఈ రూపకానికి అంగములైనవి. కనుక నిచట ఈ రెంటికిని అంగాంగిభావేన సంకరము

యథావా —

మరియొక ఉదాహరణము—

"దేవేంద్రశ్రీః కిమయం ——రామేశ్వరాఖ్యః పశ్రీభుః॥"

అత్ర రామేశ్వరే పరమైశ్వర్యాదిధర్మసామ్యాదింద్రాదిరూపేణ సందిహ్య పశ్చాద్విశేషధర్మోల్లేఖనాంతే గుణైర్నిశ్చిత ఇతి నిశ్చయోరరీకారాన్నిశ్చయాంతసందేహః। స చ గోత్రపరిభేద ఇత్యాదిశ్లేషపదోపాత్తానాం తత్తదర్థానాం భేదే సత్యభేదాధ్యవసాయరూపాతిశయోక్త్యనుప్రాణిత ఇత్యంగాంగి భావేన సంకరః। ఇంద్రాదివ్యతిరేకశ్చ స్ఫుటః।

**వివరణము :**

పైన నిశ్చయాంత సందేహాలంకారానికి ఉదాహరణముగా నిచ్చిన 'దేవేంద్రః కిమయం' అను శ్లోకమున నిశ్చయాంత సందేహమేకాక, గోత్రాది శ్లిష్ట పదముల అర్థములగు వంశ పర్వతాదులకు భేదమున్నను, అభేదము వర్ణితమైనందున అభేదాతిశయోక్తి ఏర్పడి, ఆ సందేహమునకు నిర్వాహకమైనది. కనుక ఇచటకూడ ఆ రెంటికి సంకరము. ఇంద్రాదుల కంటె రాజునకు ఆధిక్యముగూడ అభివ్యక్తమైనందున ఇచట వ్యతిరేకాలంకారముకూడ స్పష్టమగుచున్నది.

సందేహ సంకరో యథా–

సందేహ సంకరమునకు ఉదాహరణము -

యద్రోహిణీ నయన చుంబన కేలి వేలా
సంసక్త కజ్జల నిభం ప్రతిభాతి చంద్రే।
రామేశ తత్తవ యశః శ్శశిభేద సిద్ధ్యై
మేలాక్షరం విధికృతం హి వయం ప్రతీమః॥ 234

అత్రోపమోత్ప్రేక్షయో స్సందేహస్సంకరః।

**అర్థము :**

చంద్రే – చంద్రునియందు। రోహిణీ – రోహిణీకాంతయొక్క। నయన – కనుల యొక్క। చుంబన - ముద్దాడుటయనెడు। కేళి - ఆటయొక్క। వేలా – సమయము నందు। సంసక్త – తగిలిన। కజ్జలనిభం – కాటుక వంటిది। యత్ - ఏది। ప్రతిభాతి – భాసించుచున్నదో। తత్ – అది। రామేశ – ఓరామేశ ప్రభూ। తవ – నీయొక్క। యశశ్శశి భేద సిద్ధ్యై – యశస్సనెడు చంద్రునకంటె భేదము ఏర్పడుటకొరకు। విధికృతం – బ్రహ్మదేవుడు చేసిన। మేలాక్షరం - అంటుకొను అక్షరమునుగా। వయం – మేము। ప్రతీమః హి –అనుకొనుచున్నాము కదా।

వి వ ర ణ ము :

ఇచట ఉపమోత్ప్రేక్షలకు — సందేహ సంకరమని గ్రంథకారుని అభిప్రాయము. కాని అది సరిగా సమన్వితమగుట లేదు.పూర్వార్థమున చంద్ర కళంకమును కజ్జలనిభ మన్నందున, ఉపమ కావలెను. (కాని కజ్జల కళంకములు వేరుగానందున, కళంకమునే అట్టి కజ్జలముగా నుత్ప్రేక్షించుట యనవలెను. ఇట్లు ఉపమయా? ఉత్ప్రేక్షయా? అను సందేహమును కథంచిత్ ఉపపాదించు కొనవలెను.)

ఏకవాచకానుప్రవేశ సంకరమున కుదాహరణము :

మిథస్సముల్లాసితబంధుచక్రః
ప్రోత్సారితారాతి జనాంధకారః।
హృతప్రమీలాఖిల నేత్ర పద్మః
విభాతి రామేశ్వరసార్వభౌమః॥ 235

అత్రావయవ నిరూపణాదేవరామేశ్వరసార్వభౌమస్య సహస్రాంశుతయా.... నిరూపణం గమ్యత ఇతి ఏకదేశవివర్తిరూపకమ్। తచ్చశ్లేషేణసహ ఏక వాచక మనుప్రవిష్టమితి ఏకవాచకానుప్రవేశసాంకర్యమ్।

అ ర్థ ము :

మిథః - పరస్పరము । సముల్లాసిత — ప్రకాశింపచేయబడిన । బంధు - బంధువుల। చక్రః — సముదాయము, చక్రవాకములు గలవాడై । ప్రోత్సారిత - తొలగించబడిన। అరాతిజన - శత్రువులనెడు । అంధకారః - అంధకారము గలవాడై । హృతప్రమీల - తొలగించబడిన నిద్దుర గల । అఖిల - అందరి । నేత్రపద్మః - నేత్రములనెడు పద్మములు గలవాడై । రామేశ్వర సార్వభౌమః - రామేశ ప్రభువు । విభాతి - ప్రకాశించుచున్నాడు ।

వి వ ర ణ ము :

ఇచ్చట చక్రవాక సముల్లాసము, అంధకార నివారణము, పద్మోన్మీలనము గలిగించినందున రామేశ ప్రభువు సూర్యుడుగా భావించబడవచ్చును. బంధువులందు చక్రవాక తాదాత్మ్యము, అంధకారమునందు శత్రుతాదాత్మ్యము, నేత్రములయందు పద్మతాదాత్మ్యము చెప్పినందున ప్రభువునందు సూర్యతాదాత్మ్య మేర్పడి ఇది ఏకదేశవివర్తి రూపకమగును. అది 'చక్ర' యనెడు శ్లిష్టమైన ఏకవాచకము నాశ్రయించి యున్నందున నిది ఏకవాచకాను ప్రవిష్ట శ్లేష రూపక సంకరమని తాత్పర్యము.

మూలములో 'సహస్రాంశుతయా' తరువాత గ్రంథపాత సూచకముగా చుక్కలున్నవి. అది 'సహస్రాంశుతాదాత్మ్య' అని సవరించుకొనిన 'సహస్రాంశుతాదాత్మ్యనిరూపణం' అని అర్థవంతమగును.

విజయాశంసనమ్

1) రాకా హిమకర సాకారానన 2) కోకాధిక కుచ పాకాలంబన 3) ....నవహారాచ్ఛాదిత 4) ...భరణవిహారాలంకృత సర్వావయవ 5) సుపర్వస్త్రీజనగర్వోదయ హృదఖర్వ ద్యుతిఘన 6) బాలాకార ధృత లీలాదర్పణ గోళాంత స్స్వసమాలోకక్షణ 7) విస్తారితహృదయా స్తం మంగలవస్త్రాద్యుదయవమస్తాత్మ్యుజ్జ్వల 8) దేవార్చన పితృసేవాసమ్మత 9) భూవానవసమభావాత్యున్నత 10) భారద్వాజకులాంబుధి హిమకర 11) విశ్వేశాత్మజ 12) ధీకృత సుమకర జయ జయ విజయీభవ విజయీభవ।

వి వ ర ణ ము :

రామేశ ప్రభువుకు విజయము కలుగవలెనని పై గద్యముయొక్క తాత్పర్యము. ఇందులో పండ్రెండు సంబోధనములున్నవి వరుసగా అవి వివరించబడుచున్నవి. 1) నిండు పున్నమనాటి చంద్రుని బోలిన మూర్తిమంతమగు మోము గలవాడా!, 2) చక్రవాకముల కంటె గొప్పనగు కుచముల సంతాపమునకు కారణమైనవాడా! ఇతనిని చెందలేని స్త్రీలు వియోగ సంతప్తలని తాత్పర్యము. 3 (ఈ సంబోధనము మొదట గ్రంథపాతము కొంత జరిగినది. అక్కడ 'నిర్మలతర' అనుపదము చేర్చుకొనినచాలును) స్వచ్ఛములగు క్రొంగ్రొత్త హారములచేత ఆచ్ఛాదించబడినవాడా!, 4) మరియు 5) సంబోధనలను ఒకే సమాసముగా చేసిన తాత్పర్యమిట్లుండును - వజ్రాద్యాభరణముల కదలికలచేత అలంకరించబడిన అన్ని అవయవములుగల అప్సరస్త్రీల గర్వోన్నతిని, అపహరించు గొప్ప సౌందర్యముతో నొప్పు వాడా!, నాల్గవ సంబోధనమును విడిగా నుంచిన వజ్రాద్యాభరణముల కదలికలచేత అలంకరించబడిన అవయవములు కలవాడా అని తాత్పర్యమేర్పడును. 6) చిన్నపుడు చేతపట్టు కొనిన అద్దములో తనవంటి వానిని చూచి సంతసించినవాడా! 7) ఇందులో 'హృదయా స్తం' అనుచోట 'హృదయాంచల్' అనియు 'వస్తా' అను దానిని 'వస్త్రా' అనియు సవరించుకొనిన తాత్పర్యమిట్లుండును — బాగుగా కప్పుకొనబడినదియై హృదయమునందు ప్రకాశించునదియు నగు మంగళ వస్త్రము మొదలగువాని పెంపుతో సంపూర్ణముగా మిక్కిలి భాసించువాడా! 8) దేవపూజ పితృసేవలచేత (అందరికి) ఇష్టుడయినవాడా! 9) భూమియందు ఇంద్రునితో సమానమగు ప్రభావముచేత గొప్పవాడవైనవాడా! 10) భారద్వాజవంశ వారిధియందు చంద్రుడా

11) విశ్వేశపుత్రుడా! 12) ఇందులో 'ధీకృత' అనుటకు బదులు 'ధిక్కృత' అని చదువుకొనిన తాత్పర్యము ఇట్లుండును. వసంతుని ధిక్కరించినవాడా జయము జయము.

అనిపిండి వంశ కలశోదధి పూర్ణచంద్ర
రామేశః వీర! విజయీభవ! సర్వకాలమ్।
పుత్రం లభస్వ నిజసద్గుణపద్మభానుం
స్తుత్యం భవంతమనఘం భవతః పితేవ॥ 236

తాత్పర్యము :

అనిపిండివంశవారాశిచంద్రుడా! వీరరామేశ! సర్వదా విజయుడవగుదువు గాక. స్తుతించదగినట్టి, దోషరహితుడవగునట్టి నిన్ను మీతండ్రి కనినట్లు, నీవును నీసద్గుణపద్మముల వికసింపచేయు సూర్యునివంటి పుత్రుని కనుము. ఈ శ్లోకములో 'అనిపిండి' అనుదానికి బదులు 'అన్పిండి' అని చదువుకొనిన ఛందోభంగము నివారించబడును.

శ్రీ విశ్వేశ కుమార తే యదుపతిః పుత్రం దదాతు ద్రుతం
కించాత్యంత మహర్నిశం వితనుతాం నృత్యం విలాసాస్పదమ్।
జిహ్వాగ్రే భుజమండలే కరతలే స్వాంతే చ తే సంతతం
సద్విద్యా విజయోన్నతి ర్వితరణ స్ఫూర్తి శ్చ మూర్తి ర్హరేః॥ 237

తాత్పర్యము :

ఓ విశ్వేశపుత్రుడా! నీకు శ్రీకృష్ణప్రభువు త్వరగా పుత్రుని ప్రసాదించుగాక. నీ జిహ్వాగ్రమునందు సద్విద్య, నీభుజమండలమున గొప్ప విజయము, నీకరతలమునందు దాన శోభ, నీమనస్సునందు శ్రియఃపతియొక్క దివ్యమంగళవిగ్రహము రేయింబవళ్ళు ఎడబాటులేక ఆనందప్రదమగు నృత్యమును నితాంత మొనరించుచుండుగాక. ఇచట సంబుద్ధి తరువాత 'తే' అను ప్రయోగము అపాణినీయము.

అత్ర కావ్యాంతే అనేకావ్యయపదఘటితశ్లోకస్య రచితత్వేన కర్తృనాయకయోశ్శుభం భవతి తదుక్తం చమత్కారచంద్రికాయామ్-

"కావ్యాదా వవ్యయపదం చరమే బహుధావ్యయమ్।
యది ప్రయుజ్యతే తత్రి నేతృవక్త్రోః పరం శుభమ్॥" ఇతి॥

తాత్పర్యము :

ఈ గ్రంథాంతిమ శ్లోకమున అవ్యయ పదము లెక్కువగా నున్నవి. ఇట్లు ప్రయోగించినందున కృతి కర్తకు కృతిపతికిని శుభము కలుగును. ఈ విషయము చమత్కార చంద్రిక యందు చెప్పబడినది. కావ్యము మొదటగాని చివరగాని ఎక్కువ అవ్యయ పదములు ప్రయోగించబడిన కర్తకు నాయకునికి గూడ శుభ మొనగూడును.

గర్వాన్మాక్షిక మాక్షిపత్యనుపదం [ద్రాక్షరసం] శిక్షతే
సాక్షాదిక్షుము పేక్షతేక్షణమపి క్షీరంతు నోద్వీక్షసారస్యతే।
సేవామప్యురరీకరోతి న సుధాసారస్యసారస్యతో
వాచాం మే కవితావతారసమయేఽసాధారణీ(యం) ధోరణీ.॥ 238

తాత్పర్యము :

ఈ శ్లోకము ప్రథమ పాదములో 'పదం — శిక్షతే' అనుచోట నాలుగక్షరాల గ్రంథ పాతము ఏర్పడినది. ఇచ 'ద్రాక్షారసం' అని చేర్చుకొనవచ్చును. ఇట్లే చతుర్థపాదము చివర రెండక్షరాల గ్రంథపాతమున్నది. 'సాధారణీ' తరువాత 'యం' తొలగించి 'ధోరణీ' అని సవరించుకొనిన బాగుండును. అపుడు 'సాధారణీ ధోరణీ' అని శ్లోకము ముగియును. అపుడిట్లు తాత్పర్యమేర్పడును. చక్కని రసస్ఫూర్తియొక్క గర్వమువలన తేనియను, ద్రాక్షను, చెరకును, పాలను, అమృతమును గూడ నాక్షేపించు నావాక్కుల ధోరణి, కవిత అవతరించుపట్టున అసాధారణముగా నుండును.

కొల్లూరివంశసంభూత రాజశేఖర ధీమతా।
రచితేయం కృతిస్తోషం తనుతాం విదుషాం సతామ్॥ 239

తాత్పర్యము :

కొల్లూరి వంశమున పుట్టిన రాజశేఖరుడను విద్వాంసునిచేత రచించబడిన ఈ కృతి సుజనులగు విద్వాంసులకు సంతోషమును కలిగించునుగాక.

ఇతి శ్రీమదఖిలగుణగణాలంకృతస్య, సకలవిద్వజ్జనపోషకస్య, రామేశ ప్రభుసార్వభౌమస్య యశోఘనసారసురభీకృతాలంకారమకరందాఖ్యం కావ్యం సంపూర్ణమ్।

వి వ ర ణ ము :

ఇది శ్రీమదఖిలగుణ గణాలంకృతుడును, సకల విద్వజ్జన పోషకుడును అగు రామేశ ప్రభువనెడు సార్వభౌముని కీర్తి కర్పూరముచేత పరిమళింపచేయబడిన అలంకారమకరంద మనెడు కావ్యము స పూర్ణము.

# అనుబంధము - I

## గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | అమరకోశః | — | అమరసింహుడు |
| 2. | అలంకార సర్వస్వమ్ | — | రుయ్యకుడు |
| 3. | ఏకావలీ | — | విద్యాధరుడు |
| 4. | కావ్యప్రకాశః | — | మమ్మటుడు |
| 5. | కావ్యాదర్శః | — | దండి |
| 6. | కావ్యాలంకార సూత్రాణి | — | వామనుడు |
| 7. | కువలయానందః | — | అప్పయ్యదీక్షితుడు |
| 8. | చంద్రాలోకః | — | జయదేవుడు |
| 9. | చమత్కారచంద్రికా | — | విశ్వేశ్వరుడు |
| 10. | చిత్రమీమాంసా | — | అప్పయ్యదీక్షితుడు |
| 11 | ప్రతాపరుద్రీయము | — | విద్యానాథుడు |
| 12. | రసగంగాధరః | — | జగన్నాథుడు |
| 13. | వైజయంతీ | — | యాదవప్రకాశుడు |
| 14. | శబ్దకల్పద్రుమః | — | చౌఖాంబాసంస్కృతసిరీస్ |
| 15. | సంస్కృతకవిజీవితములు | — | మల్లాదిసూర్యనారాయణశాస్త్రి |
| 16 | సంస్కృతసాహిత్యచరిత్ర | — | యం కృష్ణమాచార్య |
| 17. | సంస్కృతాలంకారచరిత్ర | — | ఎస్. కె. దే |
| 18. | సాహిత్యకల్పద్రుమః | — | రాజశేఖరుడు |
| 19. | సాహిత్య దర్పణః | — | విద్యానాథుడు |
| 20. | సాహిత్య రత్నాకరః | — | ధర్మసూరి |

# అనుబంధము - II



*

# అనుబంధము - III

## వ్యాఖ్యాత – శ్రీ మరింగంటి శ్రీరంగాచార్య పరిచయము

జననము : 16–2–1933, పితరులు : కరీంనగర్ జిల్లా వేములవాడ వాస్తవ్యులు– శ్రీ ఉ. వే. శ్రీమాన్ మరింగంటి అప్పలాచార్యస్వామి, శ్రీ ల. సౌ. నాచ్చియారంబ.

గురుకులము : చతుశ్శాస్త్ర విద్వాంసులు శ్రీ ఉ. వే. శ్రీమాన్ కోయల్ కందాడై అప్పన్ శఠకోప రామానుచార్యస్వామివారి సన్నిధి.

ఉత్తీర్ణత : సాహిత్య విద్యాప్రవీణ (ఆం. వి). సాహిత్యరత్న (అలహా. హిం. వి) వ్యాకరణ బి. ఓ. ఎల్, ఎం. ఎ, సంస్కృతము, తెలుగు (ఉ. వి.) విశిష్టాద్వైత వేదాంత విద్వాన్ (తిరుమల వే. శా. వి. సదస్సు) శాస్త్రార్థ మౌఖికలేఖన పరీక్ష (మైసూరు ప్రభుత్వము)

ఉద్యోగము : హైదరాబాద్ శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృత మహా పాఠశాలలో సాహిత్యన్యాయ శాస్త్ర ప్రాధ్యాపకత్వము (1952 నుండి)

వ్యాసంగము : గీతోపనిషద్భాగవత రామాయణ బ్రహ్మసూత్ర శ్రీభాష్యప్రవచనము, ఆకాశవాణిలో సంస్కృతపాఠ నిర్వహణము; కవితా ఖండికా ప్రసారము.

గ్రంథరచనము: "భాగవతములోని రత్నములు" (కతిపయశ్లోకార్థ తాత్పర్యములు) సురభారతీ ప్రచురణ

బిరుదములు : 'ప్రవచనవాచస్పతి' 'మహోపన్యాస'కాది బిరుదములు,

సమ్మానములు: మైసూర్ మహీశూర విద్వన్మహాసభ, భాగ్యనగర సురభారతి, సుప్రసిద్ధ 'శ్రీమదుభయవేదాంత పీ'ఠాదులలో సమ్మానము.

